# పీఠిక.

---

ఈ 'యాంధ్రవాఙ్మయపాఠావళిఁ' గూర్పవలయునను నూహ నాకొకప్పుడు పొడమ నామిత్రులగు నీగ్రంథకర్తలకు సూచించి, వారినీ యుద్యమమునకుఁ బురికొల్పితిని. వారతి శీఘ్రముగనే దానిఁ దీర్చి యాపీఠిక వ్రాయుమని నన్నుఁ గోరుటచే రెండుమాటలు వ్రాయవలసివచ్చెను.

ఈ పాఠావళియొక్క ముఖ్యోద్దేశమేమన (1) బాలికా బాలకులకు భాషాభిరుచిఁ గల్గించుట, (2) వాఙ్మయచరిత్రప్రవేశము [3] జాతీయవైభవము, నాగరకత, ధర్మములును సుబోధకమగునట్లు చేయుట. కావున నియ్యది యున్నతపాఠశాలలో [హైస్కూళ్లలో]3 మొదలు పైతరగతులకు [ఫారములకు] గాఢపఠనము [intensive study] నకుపయుక్తముగను, కళాశాలలో (college) ధారాపఠన (Nondetailed study) మునకుఁ దగియుండును. ఉపోద్ఘాతములోని పెక్కు విషయము లన్ని తరగతుల వారికిఁ బనికివచ్చునట్టివే చేర్పఁబడినవి.

ఈ పాఠావళిలో నీ పురాణములఁగూర్చిన భాగము ప్రథమము. దీని తరువాతిది ప్రబంధముల విషయమైనది. మఱియొకటి కావ్యపరీక్షము గుఱించినది. ఇట్లు విడఁదీయుటలోఁ గొంత సౌకర్యము కలదు. కాలానుక్రమమునుబట్టి సరిగాఁ బురాణములతరువాతివి ప్రబంధములన్నియుఁ గాకపోయినను, కొన్ని పురాణములు ప్రబంధపద్ధతి ననుసరించియున్నను, మఱికొన్ని పురాణములు ప్రబంధములుగనే వ్రాయఁబడియున్నను, పురాణములకును ప్రబంధములకునుగల స్థూలమైన భేదమొక్కటి యెల్లవారికిని లక్ష్యమగుచున్నది. పురాణములు మిత్రసమ్మితములని, ప్రబంధములు కాంతాసమ్మితములనియు నున్నది పెట్టిక విషయమే కాక, దాని ననుసరించి

వాచ్యప్రాబల్యము, ప్రధానముగాఁ బురాణములలో నున్నదని యెల్లవా రంగీకరింపఁగలరు. ప్రబంధములు ధ్వనిప్రధానములయి యుండును. ప్రధానమైన రసధ్వని కాకపోయినను, వస్తుధ్వని యలంకారధ్వనియైనను ప్రచురముగ వానియందుఁ గనఁబడఁగలదు. ఈ కారణముచేఁ బురాణములకు నాంధ్రపాఠకులయందుఁ బ్రాథమ్యము నిచ్చుటయైనది.

మఱియు నిప్పటికిఁ గన్పట్టు నాంధ్రవాఙ్మయములో, కాలానుక్రమణికనుబట్టియు నివియే ప్రథమప్రయత్నములని కనఁబడుచున్నది. నన్నయకుఁ బూర్వమాంధ్రకవులుండి తీఱవలయునని కొంతమంది పండితుల యభిప్రాయము. అగత్యము లేదని కొందఱి యభిప్రాయము. దీనిఁ గూర్చి వివాదపెరిఁగియేయున్నది. చర్చయిప్పుడ నప్రస్తుతము. ఒక్క విషయము మాత్రమిచట సందర్భవశమున వ్రాయనగు. సమస్తభాషలయందును బ్రథమకావ్యము లనఁదగినవి మహావీరుల కథలు వీరభక్తిరసములతో నిండియుండుట కనఁబడుచున్నది. సంస్కృతవాఙ్మయములో ఋగ్వేదమిట్టిది యని పాశ్చాత్యపండితాభిప్రాయము. వేదము లపౌరుషేయము లనువారిమతమునఁ బ్రథమకావ్యము రామాయణము. దీని నీరెండురసములు పూర్తిగ విలసిల్లియున్నవి. పురాణమను నామము పాశ్చాత్యచరిత్రవ్యవహారమున భారతమునకును జెందియున్నది. తెనుఁగునఁగూడ సామాన్య వ్యవహారములో భారతపఠనము పురాణము చదువుట యనియే చెప్పఁబడుచున్నది. సంస్కృత పురాణకావ్యములు రామాయణపురాణకావ్యమునకుఁ దరువాతి వని యొప్పినవిషయమే. అట్లే గ్రీకుభాషలో సహితము ప్రథమకావ్య యద్భుతదైవమానుషచర్యల వివరించు 'హోమరు' కవివరునిది యని వింటిము. ఆంగ్లేయుల ప్రారంభభాషయగు 'ఆంగ్లోశాక్సను' నందుఁగూడ 'స్కాప్' లనుగాయకులు ప్రప్రథమమున గానరూపకావ్య నిర్మాత లనియు, వారిపాటలు వారిప్రభువుల గోత్రపరాక్రమములు మొదలగునవి యనియు, వాని తరువాత క్రైస్తవమతావలంబన మభివృద్ధినొంది, యుద్ధోద్రేకము తగ్గి, శాంతి కలిగినప్పటి 'కెడ్మన్' పాట భక్తిప్రాధాన్యమైనవాఙ్మ

తచర్యలను వెల్లడించుచున్న దనియుఁ దెలియుచున్నది. క్రీస్తుశకము ప్రథమద్వితీయ శతాబ్దములనాటికే కావ్యవ్యవహారము కలదని ప్రొఫెసరు కృష్ణస్వామి అయ్యంగారి మతానుసారముగఁ దమిళభాషలో నాదికావ్యమై 'మణిమేఖలై' యనునది బౌద్ధమతధర్మములను వాని మహిమలను వివరించుచున్నది. ఇట్లే, యాంధ్రభాషయందును బ్రథమయత్నములు పాటలు పద్దెములు నున్నగునవి దైవమానుషాద్భుత చర్యలుగల పురాణగ్రంథములు నగుట, వాఙ్మయసంప్రదాయానుసారముగనే కనఁబడుచున్నది. దేశభాషలలోఁ గావ్యకల్పనాప్రారంభము బౌద్ధులవలన నైనదో, తత్పూర్వుల వలన నైనదో, తెలియదుగాని...బౌద్ధులు తమ మతవ్యాప్తికొఱకై సంస్కృతమునే కాక, దేశభాషనుగూడ విరివిగా వాడుకొనిరని తెలియుచున్నది. సంస్కృత భాషాకావ్యములు పండితశ్రోతలకు చాలకాలము రచింపఁబడుచుండినను సంఘసుబోధము కొఱకును, మతవ్యాప్తికొఱకును, జీవభాషయగు దేశ (వ్యవహార) భాషనే వాడక తీఱదని యెఱింగి, బౌద్ధులట్లు ప్రారంభించి యుందురు. రాను, రాను, సంస్కృతాభ్యాసము పలుచనై, దేశభాషాభ్యాసము ప్రబలమై, దేశీయ భాషాకావ్యము లవసరము లయి యుండెననుట యుక్తమగును. ఈ హేతువుచేతనే, కన్నడ ప్రభువుల యాస్థానములయందుఁ బ్రోదిగొనుటకుఁ గర్ణాటకావ్యరచన, యాంధ్రదేశప్రోదికిఁ గాంధ్రకావ్యకల్పన, దేశమందెల్లెడలను వాసి గాంచుటకై సంస్కృతికవిత్వమును బయలువెడలి యుండును.

సంస్కృతపరిచయము రాజులకును, ప్రజలకును, తగ్గినకాలమున — చతుర్వేదములయందలి సారమును ద్రవిడమునఁ బ్రబంధరూపమున రచించి ద్రావిడులు వ్యవహరించుచుండ, పంచమవేదమై వేదసారమైన భారతమును దెలుఁగునఁ బరివర్తనము చేయు నుద్దేశము నన్నపార్యునకుఁ గలుగుట స్వాభావికము శ్లాఘాపాత్రము నై యున్నది.

ఇట్లొకవంక వేదమత నీతివ్యాప్తికొఱకు దేశీయభాషలలోఁ బురాణకల్పన ప్రబలుచుండఁ, గావ్యగౌరవ మాంధ్రగ్రంథములకును రావలయు

నని యొక వంకఁ బ్రబంధరచన ప్రారంభ మయ్యెను. పురాణశైలి సులభమై, కథాప్రధాన మై, నాతిదీర్ఘవాక్యమయమై యుండును. ప్రాచీనాచారములఁ బట్టి జనసంఘమునకుఁ బండితులు పురాణములు చదువ వలయును. అట్లు చదివినంత నే వానియర్థము స్పష్టపడ వలయును ఈ హేతువుచే, పై శైలి పురాణముల కవసరము. సంస్కృతమునందు నిట్టి కావ్యావనకు, భారతమున నన్నపార్యుఁడు కథనడుపు నపుడు గద్యకాని, దేశీయములయిన గీతికలు, సీసములు, ఆఁటవెలఁదులు గాని, బహుళముగా వాడి, ఘనమైన నీతి, స్తుతి, ప్రార్థన, వర్ణనాదికములపట్ల శార్దూలాది సంస్కృతవృత్తములఁ జొందుపఱచుచు వచ్చెను.

ఈ క్రింది విషయములకుఁ దార్కాణములు.—

1. ఉదంకుని కథలోని యిరువది గద్య పద్యములలో నాలుమాత్రమే వృత్తములు కలవు. ఈ వృత్తములయినను, ప్రబంధరచనామార్గ దర్శకములై, రసస్ఫోరకములై విలసిల్లినవి.

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు, నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము క్రమ్మఱింపఁగన్.

ఇందు, స్వభావతత్త్వము నీతిగా వివరింపఁ బడినది.

ఇట్టివి పునఃపునః పఠనచింతనాదుల కుపయుక్తము లని యీ ప్రబంధశైలిని వాక్రుచ్చుట. అయిన, నిందు వాక్యములు సులభములు నాతిదీర్ఘములు. పిమ్మట నాల్గు వృత్తపద్యములును నాగపతిస్తుతిరూపకము లగుటను, సంస్కృతజటిలములయి యున్నవి. అందు మొదటిది మిక్కిలి జటిలము.

చ. బహువన పాదపాద్రికులపర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

తక్కిన వింతకన్న సులభము లయి, తరతమపుటట మట్టులు "మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" అను దానితో నంత మయినవి.

ఈ క్రింది వృత్త పద్య మద్భుతరసవ్యాప్తిగలిగి మిక్కిలి జటిలమైనది.

శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథుమనమున్ భేదిల్లెఁ గల్పాంతసం
జాతప్రోద్ధతబాడబానలశిఖాశంకాధికాతంకమై.

(2) దుష్యంతమహారాజ చరిత్రమునందలి శతాధిక గద్యపద్యాత్మక ఖండములో 15 మాత్రమే వృత్తపద్యములున్నవి. ఇందు మొదట దుష్యంతుని మహిమ వర్ణింపఁ బడినది. రెండవదానిలో వనలత లారాజును గౌరవించెనని ప్రబంధశైలిగా వర్ణిత మయ్యె. మూఁడవ దానియందు శకుంతల వర్ణన కొంత చేయఁబడి యున్నది. పిమ్మటి మూఁడును విశ్వామిత్ర మహిమను వర్ణించునవి. తిరువాతిది మేనక యొయ్యారపు వర్ణన. ఆపయి మఱల దుష్యంత హృదయౌన్నతి వర్ణితమైనది. ఇట్లు వర్ణనాంశములు ప్రబంధములందువలెనె సూక్ష్మముగ వర్ణింపఁబడినవగుట నీభారత భాగము ప్రబంధ రూపమున వ్రాయఁబడినదనుటకు సందియములేదు.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరువరాహవ్యాళశార్దూలభు
ద్గమదేభాదులఁ బట్టి తెచ్చునుఁడై కణ్వాశ్రమోపాంతభూ
జములం దోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాకేళిక్రీడలన్.

అనునది, పెద్దనార్యుని యీక్రింది వర్ణనకుఁ బునాది కాఁగలదు.—

స్రగ్ధర॥ గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగులలయిపోఁగోతముల్ గ్రుద్దు లీలన్.

ఖడ్గింబెంటాడుద్రుమ్మాఁకుల్. కవుఁగిటికొలఁదుల్ కత్తిసొక్కక్కఘాతం
ప్రోద్దామప్రౌఢి వాతాద్భుతగతిఁ బలుమన్ భూమిజవ్యాడఁగా ని
ట్లద్దేవీనందనుం డత్యనుపమబలుఁడై యావనారంభవేళన్.

ఈ పైయుదాహరణములవలన వర్ణనాంశములు మొదలగు వానికై పురాణశైలి యచ్చటచ్చట నతిక్రమింపఁ బడినట్లు తెలియును. అయినను, కథాంశములనడిపించుట కిందుఁ బ్రచురముగ ధారాళమై తేఁటయైన చిన్న వాక్యములు గల చిన్న చిన్న పద్యములును వచనములును గనఁబడును. సీసపద్యము వృత్తపద్యములకన్నఁ బెద్దదియైనను, పాదాంతములను, పాద మధ్యములను నిలుపుల చేతను, దేశీయములగు గణములకూర్పు చేతను సులభమై దేశీయమై పురాణమున కుపయుక్తమైయున్నది. ఇదియే వివిధములగు వచనా చమత్కృతులచేఁ బ్రబంధోపయుక్తమునగుచున్నది ఈ క్రింది పద్యములఁ బరిశీలించినచో నీ భేదము స్ఫుటముగాఁగలదు.—

సీ. అనఘుఁడు రాజర్షియై తపశ్శక్తిపై
  బ్రహ్మర్షిభావంబుఁ బడసియున్న
నమ్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁడతిఘోర
  తపము చేయుచునున్నఁ దత్తపమున
కంతయు వెఱచి దేవేశ్వరుఁడప్సరో
  గణములలోనఁ బ్రగణ్యయైన
దాని మేనకయను ధవళాక్షిఁ బిలిచి వి
  శ్వామిత్రుపాలికిఁ జని తదీయ
ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన
దేవరాజ్యమహిమఁ దివిరి కీవు
గావు మనిన నదియుఁ గడుభయంపడియును
రేశ్వరునకు మ్రొక్కియిట్టులనియె. (61 పు)

ఈ పై పద్యమునకును వచనమునకును గమనికలోఁగాని రచనలోఁగాని భేదము కనఁబడదు. ఛందోబద్ధమని పరిశీలనపైని తెలియును గాని చదువునప్పుడంతగాఁ గనఁబడదు. ఈ క్రింది ఛందోబద్ధమయి కనఁబడినను, పాదరచనలో సమతయును వైచిత్రియున్నను, పురాణశైలి కఱువుగా నున్నది.

సీ. సామంబుచే శత్రుసాధింతుమంటిమా,
సామంబు ఖలునందు నేమగునె?
భృత్యులతో దాయ భేదింతమంటిమా,
యసహాయ సాహసుం డసురవరుఁడు;
దానంబు వశ్యవిధాయకమంటిమా,
వెల్ల వెల్లనువాఁడు కొల్లఁగొనియె;
దండితనంబున దండింతమంటిమా,
చెనకి యజేయు నిర్జింపరాదు.
గీ. కానఁ జతురుపాయంబులు కార్యసిద్ధి
జనకములు గావు మఱి వాడ సంధివిగ్ర,
హాదులైన షడ్గుణములు నప్రయోజ,
నములు పగతుఁడు ఘనుఁడు దుర్దముఁడుగాన.

ఈ క్రింది ప్రబంధోద్ధృతములు రచనాసౌష్ఠవమునకేమి, సమర్థ సంపూర్ణత చేతనేమి, గమనిక చేతనేమి మిగుల నెన్నికఁ గన్నవి.

సీ. స్వామియై నిగమాంత భూమియై సురపురీ
గామియై యబ్ధి శాయియుండ,
హంసయై కాలహాలాహారియై భవనంత,
ధారియై ప్రసవాయుధారి యుండ,
ధాతయై కుశలసంధాతయై భువనస,
నేతయై వాగ్వినేతయుండ,
మిత్రుఁడై పరమపవిత్రుఁడై విమలవా,
రిత్రుఁడై నళినీకళత్రుఁడుండఁ.
గీ. నొండొరులఁ గృష్ణవర్త్మకుఁ గశైలసంగి,
నంటు గావించు టెల్ల ననాథయువతి,
జన తనూదానసాహాయ్యమునకుఁగాక.
కానవా నారి నెవ్వారిఁ గమలజైరి.

సీ. మొయిఁగొప్పు నెఱిఁగొప్పు నెఱిఁగప్పు! మురిగుప్పు
    జలదమాలిక చొప్పు దెలుపలేదా?
  బలువాలుఁగల నేలు తెలివాలుఁగను డాలు,
    కలువపూఁదెర మేలు దెలుపలేదా?
  బలువైన కళలీనఁ గలలేనగవుసోన,
    కలశాబ్ధి తెరమేన నిలుపలేదా?
  కనకంపు వనసొంపు కడనుంపురుచి పెంపు,
    పసిఁడి తీఁగలగుంపు మెసఁగలేదా?
  గీ. ప్రాణసఖు లార నెయ్యంపుటలుకఁ బూని,
    యేలయీ కాలయీ వేళ నీవిశాల
    యావనికాభ్యంతరంబున కరిగెనఁగ,
    నమఁగు నెచ్చెలి మఱియు నెయ్యమునఁ జేరి.

ఇట్లు పురాణశైలికిని ప్రబంధశైలికిని భేదముఁ గమనింపనగు. మొదటిరచనలలో పురాణశైలి యీ పై పద్ధతుల ననుసరించినను, ప్రబంధ రచనలు ప్రారంభమైన పిమ్మటివగు పురాణములు ప్రబంధశైలినే బాగుగ నవలంబించినవి. ఈ క్రింది పద్యములవలన నీవిషయము స్ఫుటము కాఁగలదు.

సీ. శాకేందుబింబమై రవిబింబమై యొప్పు,
    నీరజాతేక్షణ నెమ్మొగంబు,
  కందర్పకేతువై ఘనధూమకేతువై,
    యలరుఁ బూఁబోడి చేలాంచలంబు,
  శ్రావణ పరిధియై ప్రళయార్క పరిధియై
    మెఱయు నాకృష్ణమై మలఁగుచాప
  మమృతప్రవాహమై యనల సందోహమై
    తనరారుసంతిసువర్ణనంబు
ఆ. హర్షదాయియై మహాశోకదాయియై,
  పలమునుద్ధరాలి బాణవృష్టి

ఓం.

# విషయసూచిక.

పుట.

ఉపోద్ఘాతము.—

పురాణములనుండి యెత్తిన భాగములు.

భారతము :—



భాగవతము :—



రామాయణము :—



హరివంశము :—

## టిప్పణము.

## పురాణనిర్వచనము.

పూర్వమును బొందునవి, పురాతనములైనవి పురాణము లని చెప్పఁబడుచున్నవి. బహుయుగములలో నైహికాముష్మిక సౌఖ్యానందముల నందిన ధార్మికుల పవిత్రచరిత్రములు, దుష్కర్ములజీవితవిపర్యయములు, పురాణములుగనె పరిగణింపఁబడుచున్నవి. బహుప్రాచీనములైన ప్రసిద్ధ పురాణేతిహాసములే కాక యర్వాచీనములైన గ్రంథములు సహితము పురాణములె యనఁబడుచున్నవి. పెక్కండ్రు వినుచుండ నొక్కఁడు గూరుచుండి జనరంజకముగ వివిధకథాకలాపములఁ జదువుటయుఁ బురాణపర్యాయము గనె వ్యవహరింపఁబడుచున్నది.

## పురాణపరిగణనము.

ప్రసిద్ధములయిన సంస్కృత పురాణములు పదునెనిమిది.

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ, శైవం లైంగం గారుడమ్,
నారదీయం భాగవతి, మాగ్నేయం స్కాందసంజ్ఞికమ్.
భవిష్యం బ్రహ్మవైవర్తం, మార్కండేయంచ వామనమ్,
వారాహ మాత్స్య కౌర్మాణి, బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్.
—భాగవతము.

ఇవి మూడుతెగల నున్నవి. సాత్వికములు, రాజసములు, తామసములు.

(1) విష్ణు, నారద, గారుడ, భాగవతములు—సాత్వికములు.
(2) బ్రహ్మ, పద్మపురాణములు—రాజసములు.
(3) శివ, మార్కండేయ, భవిష్య, లింగ, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, బ్రహ్మాండములు—తామసములు.

ఆగ్నేయము అగ్ని సంబంధమైనది.
బ్రహ్మవైవర్తము సూర్యసంబంధమైనది.

ఇందు సాత్త్వికము లుత్తమములుగాను, రాజసములు మధ్యమములుగాను, తామసము లంత్యములుగాను విజ్ఞులచే నెన్నఁబడుచున్నవని మత్స్య, పద్మపురాణములలో నిరూపింపఁబడినవి.

పురాణనామ జ్ఞాపక శ్లోక మొకటి కలదు.

శ్లో॥ మద్వయం భద్వయం చైవ, బ్రత్రయం వ చతుష్టయమ్,
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్.

శ్రీకూర్మపురాణమునఁ జేర్కొనఁబడిన పురాణపట్టిక పరికింపఁగా అగ్నిపురాణము మాటయే కాన వచ్చుటలేదు. దానికిమాఱు, వాయుపురాణ మున్నది. అగ్నిపురాణములో శివపురాణముసంగతి విడువఁబడి యా స్థానమున వాయుపురాణము చెప్పఁబడియున్నది. వరాహపురాణములో గారుడ బ్రహ్మాండపురాణములకు మాఱు వాయుపురాణ, నరసింహపురాణములు వక్కాణింపఁబడినవి. మత్స్య, మార్కండేయ, విష్ణుభాగవత పురాణములలో నయిత మిట్టివినిమయమే చూపట్టుచున్నది. అగ్ని, మత్స్య, పద్మ, భాగవతపురాణములలో పురాణశ్లోకసంఖ్య నాల్గులక్షలని చెప్పఁబడినది.

## ఉపపురాణములు.

ఇవి పదునెనిమిది. సనత్కుమార, నరసింహ, నంది, శివధర్మ, దుర్వాస, నారద, కపిల, మను, ఉశన, వరుణ, కాళి, వశిష్ఠ, లింగ, సాంబ, సౌర, పరాశర, మరీచి, భార్గవములు.

బృహన్నారదీయము నారదీయముగానె యెన్నఁబడుచున్నది. గణపత్యుపపురాణమని మఱియొకటి కలదు. దీనినె ముద్గలోపపురాణ మందురు. పురాణపట్టికలో నుదాహరింపఁబడిన లింగ, నారద, పురాణము లిం దుప పురాణములుగా గ్రహింపఁబడినవి. దేవీపురాణము భార్గవోపపురాణ మని

మునఁ బెనిచి వర్ణించిన దే ప్రబంధ మనఁ బరఁగుచున్నది. నన్నయ, శ్రీనాథాదులయిన యాదిమధ్యకవులు కూడ నీప్రబంధములే మహాకావ్యమని, కావ్యమని తమ తమ గ్రంథములలో వాకొని యుండిరి.

కావ్యములు పురాణాంధ్రీకరణకాలమునుండియు బయల్వెడలఁ జొచ్చినవి. నన్నయ భారతభాగములే గాక యింద్రవిజయమును; తిక్కన భారతపర్వములే గాక నిర్వచనోత్తరరామాయణమును; మఱి యెఱ్ఱాప్రెగడ భారతపరిశిష్టమును, నృసింహపురాణమును గాక హరివంశమును; మడికి సింగన పద్మపురాణము గాక వాసిష్ఠరామాయణమును; శ్రీనాథుఁడు కాశీఖండ, భీమఖండములే గాక నైషధమును, హరవిలాసమును; నందిమల్లయ, ఘంట సింగయలు వరాహపురాణము గాక ప్రబోధచంద్రోదయ ప్రబంధమును రచించుచు వచ్చిరి.

ప్రబంధములందుఁ బదునెనిమిదివర్ణనము లుండవలయునని కొందఱును, ఇర్వదిరెండువర్ణనము లుండఁదగునని మఱి కొందఱును దలంచుచున్నారు.

పదునెనిమిదివర్ణనము లనఁగా:

శ్లో॥ నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్,
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః.
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్,
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయా అపి.
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే,
ఏషామష్టాదశానాం ద్వైః త్రైశ్చ దూన మపీష్యతే.

—ప్రతాపరుద్రీయము.

ఇరువదిరెండువర్ణనము లనఁగా:—

ఉ॥ పరిణయ యాన శైల ఋతు పాన జయాహవ దౌత్యమంత్రసా
గర విరహాంగజారతి మృగవ్య సుతోదయ దివాకరాత్రమాం

తర పురదాహాద్యామృతవనంబుల సంస్థితు లొప్పఁ జెప్పుచో
నిరువదిరెండువర్ణనల నెన్నికకెక్కుఁ బ్రబంధ మిద్ధరన్॥

—చాటువు.

ఇందొండు రెండు లోపించినను బ్రబంధ మనిపించుకొనకపోదు. కావ్యము శ్రవ్యదృశ్యభేదమునందియు శ్రవ్యమే ప్రాయికముగఁ దన్నామమున వ్యవహరింపఁబడుచున్నది. దృశ్యములు రూపకములు. పురాతన ప్రసిద్ధచరిత్రము లితిహాసములు.

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణా ముపదేశసమన్వితమ్,
పూర్వవృత్తకథాయుక్త మితిహాసః ప్రచక్షతే॥

ధర్మార్థకామమోక్షముల నుపదేశించునది, పూర్వవృత్తములతోఁ గూడినది యితిహాసముగాఁ జెప్పఁబడుచున్నది.

పురాణములయందు ఒకనాయకుఁడని, యొక రసమని నియమము లేదు; కథయే ప్రధానము. కథావిస్తరము కావించుపట్ల సందర్భ మంతగా లేకున్నను కవులు తాము చెప్పఁదలఁచి నట్టియుఁ, దెలియఁజేయ వలసినట్టియు సర్వవిషయములు నందందుఁ బొందుపఱుచుచు వచ్చిరి. కావ్యమందన్ననో నాయకుఁడు, రసము, రచనాచమత్కృతి ప్రధాన విషయములు; మఱి వివాహమో, విజయమో యితివృత్తమగునపుడు శృంగారమో, వీరమో క్రమానువర్తితములయి యంగాంగిభావమున నితర రసములును బోషింపఁబడు చుండును.

---

## * పురాణప్రయోజనము. *

పురాణములు మానవుల చిత్తవృత్తులను ధర్మేతరములనుండి నివర్తించి స్వధర్మవిషయములఁ బ్రవర్తింపఁజేయుచున్నవి. ఇట్లొనర్పఁ గలిగినవే కాని యెవ్వియు యథార్థ విద్యాఫలదాయకములు కాఁజాలవు. అధికార జాతిభేదములతో నిమిత్తము లేక యివి స్త్రీ శూద్ర ద్విజబంధు ప్రభృతులకు సముచితము పఠనార్హములుగా నేర్పఱుపఁబడినవి.

శ్లో॥ పఠనాచ్ఛ్రవణాద్యేషాం స్వాంణాం పాపక్షయో భవేత్,
ధర్మాధర్మపరిజ్ఞానం సదాచార ప్రవర్తనమ్.
గతిశ్చ పరమా తస్మాత్ భక్తిర్భగవతి ప్రభో॥

పురాణములు చదువుటవలన, వినుటవలన మానవులకు మహాపాపములు పరిహారము లగుటయేగాక ధర్మాధర్మవివేకము జనించి, సదాచార ప్రవర్తన మలవడి, భగవద్భక్తి హెచ్చి, యుత్తమగతి లభించుచున్నది. నిష్కళంకమైన పితృభక్తి, నిరంతరమైన గురుభక్తి, నిర్మలమైన దైవభక్తి, నిశ్చలమైన దేశభక్తి, స్థిరమైన రాజభక్తి యను భక్తిపంచకము పురాణశ్రవణపఠన మననముల వలననే పొడముచున్నది. అనాదినుండి సత్యధర్మములను, మానవాశాఫలసిద్ధులను, హృదయగుహాంతరములలోఁ బ్రతిధ్వనింపఁ జేయుచున్న వీపురాణములే. శ్రేయమునకు నిష్కామమూల్యమైన యాత్మశాంతిని, వికాసమును, ప్రవిమలానందమును ప్రతిపాలుచేసి కొని దుర్భరజీవయాత్ర చేయువానికి శ్రేయోదాయకము లగు సరసి మార్గములను ప్రదర్శించునవి యీ పురాణములే. సంసారకంటక మార్గమునఁ బడి నిరాశాత్మాంధకారమున సంకటపడు జడమతులకు జ్ఞానభానూదయము లీ పురాణములే. కేవల లౌకిక విషయలోలురై భౌతిక విషమ పాశములలోఁ దగులుకొని శాంతిలేక కొట్టుకొనుచుండు మానవమాతులను తమస్సముద్రమునుండి మేలుకొలుపు భేరీభాంకారము లీపురాణములే. పరమేశ్వరుఁడు దూరమందెక్కడనో యున్నవాఁడను సామాన్యభావము కలుగనీయక సకల జీవిత సంఘటనలలో, సర్వలోకానుభవములలో, సమస్త సత్యచింతనములలో, నిఖిల దర్శనములలో నభివ్యక్తమై తాండవమాడుచున్నవాఁ డనువిశ్వాసవిశేషము నెలకొలిపి యక్షయ సుఖాంకురములను మొలక లెత్తింప ననువగు నమృతధార లీ పురాణములే.

శ్లో॥ అదిత్య స్యోదయస్తాత సౌపర్ణం భారతీ కథా,
ఇష్టా భార్యా సుమిత్రం వాక్యపూర్వాణి దినేదినే॥

అన్నట్లు, సూర్యోదయ మెన్ని పర్యాయము లగుచున్నను, బంగార మెంత కొరకినను, భారతకథ యెన్నిమారులు విన్నను, ప్రియభార్య యెప్పుడు కనఁబడినను, సన్మిత్రము నెన్నఁడు చూచినను విసువు జనింపక యెప్పటికిని క్రొత్తగానే తోఁచునట్లు పురాణము లెంతచదివినను, ఎన్నిసారులు విన్నను, సంతోషజనకములే కాని యిసుమంత యేని భారము గలిగింప నేరవు. ఇప్పటివలె నప్పుడు బహుగ్రంథసాహాయ్య మపేక్షింప వలసిన యావసరము లేకయె విజ్ఞానప్రజ్ఞానముల ననుసంధించునట్లు గణితము—శకునము— స్వప్నము— సాముద్రికము—జ్యౌతిషము—భూగోళము—ఖగోళము—శారీరము—యోగము—మున్నగువ వెన్నెన్నో పురాణములయందే యిముడ్పఁబడినందువలన జనులు లోకజ్ఞానముఁ బడసి ధర్మ సంరక్షణ మొనరించుకోఁజాలిరి. లోకానుభవసిద్ధుఁడు, వృద్ధుఁడు నయిన గురుమహాశయునితోడి సంపర్కసంభాషణములందుం బోలె సకల పురాణేతిహాస శ్రవణపఠనములందును గౌరవ, విశ్వాసము లెట్టివారికిని సమకూడకపోవు.

---

## పురాణవిషయసంగ్రహము.

## సంస్కృతపురాణ విషయసంగ్రహము.

### (1) బ్రహ్మపురాణము.

ఇది బ్రహ్మ మరీచికిఁ జెప్పినది పదివేలగ్రంథము.

ఇందు రెండుభాగములు కలవు పూర్వభాగములో—దేవాసురుల— దక్షాదిప్రజాపతుల యుత్పత్తి, సూర్యచంద్రవంశవివరణము, ద్వీప-సముద్ర-వర్ష-స్వర్గ-పాతాళ-నరకవర్ణనము, పార్వతీజననము, తద్వివాహవృత్తాంతము, దక్షోపాఖ్యానము మున్నగునవి కలవు. ఉత్తరభాగములో—తీర్థయాత్రావిధి, పురుషోత్తమ—శ్రీకృష్ణచరిత్రలు, యోగకథనము, బ్రహ్మనిర్ణయము వర్ణింపఁబడినవి.

---

## (2) పద్మపురాణము.

ఇది బ్రహ్మచేఁ జెప్పఁబడినది. ఏఁబదియైదువేల గ్రంథము. ఇది యైదు ఖండములుగ విభజింపఁబడినది. (1) సృష్టిఖండములో—సృష్టి క్రమము, పుష్కరమాహాత్మ్యము, బ్రహ్మయజ్ఞవిధి, వేదపాఠము, దానధర్మకీర్తనము, పార్వతీవివాహము, తారకాసురోపాఖ్యానము, గోమహిమ, కాలకేయాదిదైత్య వధ, గ్రహపూజావిధి కలవు. (2) భూమిఖండములో— మాతాపితృపూజ్యత, శివశర్మోపాఖ్యానము, వృత్రాసురవధ, పృథుచరిత్ర, వేనుచరిత్ర, ధర్మవిషయము, నహుషయయాత్యుపాఖ్యానములు, శుద్ధ విశుద్ధ దైత్యవివరణము మున్నగునవి వివరింపఁబడినవి. [3] స్వర్గఖండములో—బ్రహ్మాండోత్పత్తి, లోకసంస్థితి, తీర్థవివరణము, నర్మదానది యుత్పత్తి, కురుక్షేత్రకాశీగయా ప్రయాగాది తీర్థమాహాత్మ్యము, వర్ణాశ్రమధర్మములు, కర్మయోగము, వ్యాసజైమినిసంవాదము, సముద్రమథనము మున్నగునవి తెలుపఁబడినవి. [4] పాతాళఖండములో—శ్రీరామ రాజ్యాభిషేకము, అగస్త్యాది మహర్షుల యాగమనము, రావణోపాఖ్యానము, రామచంద్రునికిఁ జేయఁబడిన యశ్వమేధోపదేశము, జగన్నాథవివరణము, బృందావనమాహాత్మ్యము, శ్రీకృష్ణుని నిత్యలీలలు, పృథ్వీవరాహ సంవాదము, యమ బ్రాహ్మణసంవాదము, కృష్ణస్తోత్రము, దధీచ్యుపాఖ్యానము, శివమాహాత్మ్యము, దేవరాతసుతోపాఖ్యానము, గౌతమోపాఖ్యానము మున్నగునవి కీర్తింపఁబడినవి. [5] ఉత్తరఖండములో—పర్వతోపాఖ్యానము, జాలంధరకథ, సగరోపాఖ్యానము, గంగా మాహాత్మ్యము, ప్రయాగమాహాత్మ్యము, అన్నాదిదాన మాహాత్మ్యము, ఏకాదశీమాహాత్మ్యము, విష్ణుసహస్రనామములు, కార్తికేయవ్రత మాహాత్మ్యము, మాఘస్నానఫలము, నృసింహావతారము, జంబూద్వీపాంతరగత తీర్థసమూహ మాహాత్మ్యము, భాగవతమాహాత్మ్యము, భక్తికీర్తనము, మత్స్యాద్యవతారములు, భృగుకర్తృక విష్ణుమహిమ పరీక్ష మున్నగునవి చెప్పఁబడినవి.

## (3) విష్ణుపురాణము.

ఇది పరాశరుఁడు చెప్పినది. ఎనుబదివేల గ్రంథము. ఇందు రెండు భాగము లున్నవి. ప్రథమభాగములో—ఆది సృష్టిక్రమము, దేవాదుల యుత్పత్తి, సముద్రమథనము. ధ్రువచరిత్ర, పృథూపాఖ్యానము, ప్రహ్లాద చరిత్ర, ప్రియవ్రతోపాఖ్యానము, ద్వీపవర్ష నిరూపణము, నరక పాతాళ వర్ణనము, భరతోపాఖ్యానము, ముక్తిమార్గకథనము, మన్వంతరవర్ణనము, వేదవ్యాసోద్భవము, నరకనివారక కర్మవిశేషములు, సర్వధర్మనిరూపణము, వర్ణాశ్రమధర్మనిర్ణయము, శ్రాద్ధవిధానము, సదాచారము, సూర్యచంద్రవంశవివరణము, శ్రీకృష్ణావతారము; శ్రీకృష్ణుని బాల్య, యౌవన, కౌమారలీలలు; అష్టావక్రోపాఖ్యానము; కలిచరిత్ర; చతుర్విధ లయములు; బ్రహ్మజ్ఞానము; మొదలగు విషయము లిందు వివరింపఁబడి యున్నవి. ద్వితీయ భాగములో—నానావిధ ధర్మకథలు, వ్రతనియమములు, ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, వేదాంతము, జ్యోతిషము మున్నగునవి నిరూపింపఁబడినవి. ఇది పురాణనిర్వచనమునకు మిక్కిలి తగియున్నది.

## (4) శైవపురాణము.

ఇది వాయుమూర్తి చెప్పినది. ఇరువదినాలుగువేల గ్రంథము. ఇందు రెండుభాగములు కలవు. పూర్వభాగమున—స్వర్గాదిలక్షణము, మన్వంతరభేదములలోని రాజవంశముల నిరూపణము; గయాసురవధ, మాసమాహాత్మ్యము, దానధర్మము, రాజధర్మము, స్వర్గమర్త్యపాతాళ సంచారుల నిర్దేశము, వ్రతాదులు స్పష్టపఱుపఁబడినవి. ఉత్తరభాగమున—నర్మదాతీర్థవర్ణనము, రేవాసాగర సంగమాది సకలతీర్థ వర్ణనము కావింపఁబడినవి.

---

## (5) భాగవతము.

ఇది శుకయోగీంద్రుఁడు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పినది. పదునెనిమిదివేల గ్రంథము. ఇది ద్వాదశస్కంధములుగ విభజింపఁబడినది. ప్రథమ

స్కంధమున—సూతునికడకు ఋషులరుదెంచుట, వ్యాసచరిత్ర, పరీక్షిదుపాఖ్యానము; ద్వితీయస్కంధమున—పరీక్షిత్తుకడకు శుకయోగివచ్చుట, బ్రహ్మనారదసంవాదము, అవతారకథనము, పురాణలక్షణము, సృష్టిక్రమము; తృతీయస్కంధమున—విదురోపాఖ్యానము, విదుర మైత్రేయ సంవాదము, సృష్టిప్రకరణము, కపిల సాంఖ్యయోగము; చతుర్థస్కంధమున—దక్షయజ్ఞము, ధ్రువచరిత్ర, పృథూపాఖ్యానము; పంచమస్కంధమున—ప్రియవ్రతోపాఖ్యానము, తద్వంశవర్ణనము, బ్రహ్మాండాంతర్గత లోకవిస్తరణము, నరకవిషయము; షష్ఠస్కంధమున—అజామిళోపాఖ్యానము, దక్షసృష్టిప్రకరణము, వృత్రాసురాఖ్యానము, వాయుగణజన్మము; సప్తమస్కంధమున—ప్రహ్లాదచరిత్ర, కర్మవాసనా సమాలోచనము, నరసింహావతారము; అష్టమస్కంధమున—గజేంద్రమోక్షణము, మన్వంతర నిరూపణము, సముద్రమథనవృత్తాంతము, బలిచక్రవర్తిచరిత్ర, వామనావతారఘట్టము, మత్స్యావతారకథనము; నవమస్కంధమున—సూర్యచంద్రవంశనిరూపణము; దశమస్కంధమున—శ్రీకృష్ణుని బాల్యకైశోర యౌవన లీలలు, భూభారహరణము; ఏకాదశస్కంధమున—శ్రీకృష్ణుఁడుద్ధవ నారదులకు కర్మభక్తిజ్ఞానలక్షణముల నిరూపించుట; ద్వాదశస్కంధమున—భవిష్యత్కలియుగ ధర్మాదివివరణము, పరీక్షితుని మోక్షలాభము, మార్కండేయచరిత్ర రసవంతముగఁ జిత్రింపఁబడినవి.

## (6) నారదీయపురాణము.

కలియుగమునుగూర్చి నారదుఁడు చెప్పినది. 22 వేల గ్రంథము.

ఇందు రెండుభాగములు కలవు. ప్రథమభాగమున:—సంక్షేపముగా సృష్టిప్రకరణము, నానావిధధర్మకథలు, మోక్షధర్మము, శబ్దోత్పత్తి, పశుపాశవిమోక్షణము, మంత్రశోధనము, దీక్ష, పూజ, కవచములు, గణేశస్తుతి, పురాణలక్షణము, దానము, దానకాలము, వివిధవ్రతములును నిరూపింపఁబడినవి.

ద్వితీయభాగమున:—ఏకాదశీవ్రతము, వసిష్ఠమాంధాతృ సంవాదము, రుక్మాంగదోపాఖ్యానము, వసుశాపము, కాశీగంగాదిమహిమ, పురుషోత్తమ క్షేత్రము, ప్రయాగాది తీర్థమాహాత్మ్యము, గౌతమోపాఖ్యానము, బృందావన మహత్తు, మోహినీచరిత్ర కలవు.

---

## (7) మార్కండేయపురాణము.

జైమినిమునికిఁ బక్షులు చెప్పినట్లు మార్కండేయుఁడు చెప్పినది. ముప్పదిరెండు వేల గ్రంథము.

ఇందు ధర్మనామక పక్షిగణము, బలరామతీర్థయాత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, మదాలస చరిత్ర, అలర్కచరిత్ర, సృష్టికథనము, భిన్నవిధ పుణ్యనిరూపణము, కల్పాంతము, యక్షసృష్టి, రుద్రాదిసృష్టి, మనువివరణము, దుర్గాకథ, మార్తాండజన్మవృత్తాంతము, ఖనిత్రచరిత్ర, అవిక్షిదుపాఖ్యానము, ఇక్ష్వాకుచరిత్ర, తులసీచరిత్ర, రామచంద్రోపాఖ్యానము, కుశవంశనిరూపణము, చంద్రవంశకీర్తనము, పురూరవశ్చరిత్ర, యదువంశకీర్తనము, కృష్ణచరిత్ర, యోగధర్మాదివిషయములు వివరింపఁబడినవి.

---

## (8) అగ్నిపురాణము.

భృగుమహర్షి యాగవిధిని బోధించినది. 80 వేలు. ఇందు సృష్టిప్రకరణము, విష్ణుపూజానియమము, అగ్నికార్యము, దీక్షావిధి, దేవాలయాది నిర్మాణము, ప్రతిష్ఠ, సాలగ్రామలక్షణము, పూజ, వ్యాసాదులు, బ్రహ్మాండనిరూపణము, తీర్థమహిమ, ద్వీపవివరణము, జ్యోతిశ్శాస్త్రము, షట్కర్మములు, హోమవిధి, ఆశ్రమధర్మములు, శ్రాద్ధవిధి, గ్రహయాగము, ప్రాయశ్చిత్తవిధి, వ్రతాదులు, నరకవర్ణనము, సంధ్యావిధి, గాయత్రీ పరమార్థము, లింగస్తుతి, రాజాభిషేకధర్మకృత్యములు, స్వప్నాధ్యాయము, శకుననిమిత్తవర్ణనము, యుద్ధము, దీక్ష, నీతి, రత్నలక్షణము, ధనుర్విద్య, వ్యవహారవిధి, ఆయుర్వేదము, పశుచికిత్స, నానావిధపూజావిధులు, శాం

తికర్మము, ఛందశ్శాస్త్రము, శబ్దానుశాసనము, ప్రళయము, బ్రహ్మజ్ఞానము మున్నగునవి తెలుపఁబడినవి.

## (9) భవిష్య పురాణము.

శతానీకుఁడు సుమంతునికిఁ జెప్పినది. 31 వేల గ్రంథము. ఇందు ఆదిత్యచరిత్ర, సృష్టిలక్షణము, సంస్కారలక్షణము, తిథినిరూపణము, తిథివిశేషములు, వైష్ణవపర్వము, శైవసౌరోపాసకభేద తిథినియమము, వివిధవ్రతనిరూపణము మున్నగునవి చెప్పఁబడినవి.

## (10) బ్రహ్మవైవర్తపురాణము.

అంబరీషునకు వసిష్ఠుఁడు చెప్పినది. 12 వేలు. ఇది నాలుగు ఖండములుగ విభజింపఁబడినది. (1) బ్రహ్మఖండమున—సృష్టినిరూపణము, బ్రహ్మనారదవివాదము, శివుఁడు జ్ఞానోపదేశము చేయుట. (2) ప్రకృతిఖండమున—నారదుఁడు సావర్ణికి కృష్ణమాహాత్మ్యము తెల్పుట, ప్రకృతి మాహాత్మ్యము, పూజాదికము; (3) గణేశఖండమున కార్తికేయ గణాధిపతుల జన్మవృత్తాంతము, పరశురామోపాఖ్యానము, పరశురామగణేశ్వరుల యుద్ధము, (4) శ్రీకృష్ణజన్మఖండమున శ్రీకృష్ణునిజన్మము, రాసక్రీడ, పూతనాదివధ, మథురాగమనము, కంసవధ, ద్వారకానిర్మాణము, జరాసంధవధ, నరకవధ, కృష్ణమహిమ మున్నగునవి యున్నవి.

## (11) లింగపురాణము.

శివునిగుఱించి నంది చెప్పినది.11 వేలు.ఇందు రెండుభాగములుకలవు. [1] పూర్వభాగమున రూపకల్పవివరణము, లింగోత్పత్తి, లింగపూజ, దధీచ్యుపాఖ్యానము, యుగధర్మనిర్ణయము,భువనకోశవర్ణనము,త్రిపురాసురోపాఖ్యానము, లింగప్రతిష్ఠ, శివవ్రతము, సదాచారక్రమము, ప్రాయశ్చిత్తవిధి,

కాశీవర్ణనము, అంధకోపాఖ్యానము, వరాహచరిత్ర, నృసింహచరిత్ర, జలంధరవధ, శివ సహస్రనామములు, దక్షాధ్వరధ్వంసము, మదన భస్మము, పార్వతీ పరిణయము, వినాయకోపాఖ్యానము, శివనృత్యము, ఉపమన్యూపాఖ్యానము; (2) ఉత్తరభాగమున—విష్ణుమాహాత్మ్యకీర్తనము, అంబరీషోపాఖ్యానము, సనత్కుమార నందిసంవాదము, శివమాహాత్మ్యము, సూర్య పూజావిధి, శివపూజావిధి, దానప్రకరణము, శ్రాద్ధప్రకరణము, ప్రతిష్ఠావిధి, గాయత్రీమహిమ మొదలగునవి వర్ణింపఁబడినవి.

---

## (12) వరాహపురాణము.

భూదేవికి వరాహమూర్తి చెప్పినది. 24 వేలు. ఇందు రెండు భాగములు కలవు.

పూర్వభాగమున—రభ్యచరిత్ర, శ్రాద్ధవిధి, గౌరీజననము, వినాయకాద్యుపాఖ్యానము, వ్రతనిర్ణయము, అగస్త్యగీత, రుద్రగీత, మహిషాసురవధార్థము త్రిశక్తులు దేవిగా నుద్భవించుట, తన్మాహాత్మ్యము, తీర్థములు, తీర్థమాహాత్మ్యము, తీర్థశ్రాద్ధ విధి, ద్వాత్రింశదపరాధప్రాయశ్చిత్తము, యమలోకవర్ణనము, కర్మవిపాకము, విష్ణువ్రతనిరూపణము, [2] ఉత్తరభాగమున—పులస్త్యకురురాజసంవాదము, సర్వతీర్థమాహాత్మ్యము, బహువిధ ధర్మలక్షణములు మున్నగునవి వర్ణింపఁబడినవి,

---

## (13) స్కాందపురాణము.

ఇది యీశ్వరుఁడు కుమారస్వామికిఁ జెప్పినది. 100,000, లక్ష. ఇందేడు ఖండములు కలవు. (1) మాహేశ్వరఖండమున—దక్షయజ్ఞము, సముద్రమంథనము, పార్వతీవివాహము, కార్తికేయజననము, తారకాసుర యుద్ధము, పంచ తీర్థాఖ్యానము, తారకవధ, బ్రహ్మాండవివరణము, తీర్థవివరణము, పాండవోపాఖ్యానము, మహావిద్యాసాధనము, మహిషాసురవధ; [2] వైష్ణవఖండమున—పృథ్వీవరాహాఖ్యానము, కులాలో

పాఖ్యానము, పురుషోత్తమ మాహాత్మ్యము, అంబరీషోపాఖ్యానము, ఇంద్రద్యుమ్నోపాఖ్యానము, రథయాత్రావిధి, డోలాయాత్ర, యోగమోక్షనిరూపణము,దశావతారకథనము, తీర్థమాహాత్మ్యము, వ్రతవివరణము, మాస మాహాత్మ్యము, యోగమాహాత్మ్యము, త్రయోదశ తీర్థవివరణము, [3] బ్రహ్మఖండమున—గాలవోపాఖ్యానము, బహువిధతీర్థమహత్త్వము, ఋషివంశనిరూపణము, వర్ణాశ్రమధర్మములు, శ్రీరామచరిత్ర, జీర్ణోద్ధారవిధి, జాతిభేద, స్మృతిధర్మనిర్ణయము, దానమహత్త్వ, వ్రతమహత్త్వ, సాలగ్రామలక్షణము, జ్ఞానయోగము, శివమహిమ, శంబరోపాఖ్యానము, రుద్రాధ్యాయము; [4] కాశీఖండమున—వింధ్యనారదసంవాదము, పతివ్రతాచరిత్ర,అగస్త్యద్యుత్పత్తి,లోకవర్ణనము,గంగా,కాశీమాహాత్మ్యములు, కళావత్యుపాఖ్యానము,కార్యాకార్యనిరూపణము,గృహియోగిధర్మనిర్ణయము, దివోదాసోపాఖ్యానము, కాశీవర్ణనము, కాశీఘట్టమాహాత్మ్యము; [5] అవంతీఖండమున—మహాకాలయవనోపాఖ్యానము ప్రాయశ్చిత్తవిధి, తీర్థకథనము, లింగసంఖ్య, హిరణ్యాక్షవధ, అంధకవధ, దానధర్మము, ఋశ్యశృంగోపాఖ్యానము, బహువిధతీర్థవివరణము, [6] నాగరఖండమున— లింగోత్పత్తి, హరిశ్చంద్రోపాఖ్యానము, వృత్రాసురవధ నానావిధతీర్థములు,నదులు తత్ఫలములు,[7] ప్రభాసఖండమున—లింగవివరణము, శర్యాతిచైత్యసంవాదము, తీర్థకథలు, తదీయోపాఖ్యానములు మున్నగు భిన్నాంశములు నిందు విశదీకరింపఁబడినవి.

## (14) వామనపురాణము.

బ్రహ్మ చెప్పినది.పదునాలుగువేల గ్రంథము. ఇది రెండు భాగములుగ నున్నది. పూర్వభాగమున — దక్షయాగవినాశము, కామదహనము, ప్రహ్లాద నారాయణుల యుద్ధము, దేవాసురసంగ్రామము, దుర్గాచరిత్ర,తపత్యుపాఖ్యానము, పార్వతీజననము, తపస్సు, వివాహము, కౌశిక్యుపాఖ్యానము, అంధకవధ, జాబాలిచరిత్ర, వాయుగణజన్మవృత్తాంతము, బలిచక్ర

వ్రతకథ; ఉత్తరభాగమున—మాహేశ్వరీ, భాగవతీ, సౌరీ, గాణేశ్వరీ, సంహితలు మున్నగునవి విస్తరింపఁబడినవి.

---

## (15) కూర్మపురాణము.

కూర్మమూర్తి చెప్పినది. ఆఱువేల గ్రంథము.

ఇయ్యది రెండు భాగములు గలది. పూర్వభాగమున— వర్ణాశ్రమ ధర్మములు, విశ్వోత్పత్తి, కాలపరిమాణము, దేవీసహస్రనామములు, యోగములు, భృగువంశము, దేవాసురులయుద్ధవము, దక్షయజ్ఞము, కశ్యప వంశవివరణము, కృష్ణచరిత్ర, యుగధర్మము, కాశీప్రయాగాది తీర్థవర్ణనము, ఉత్తరభాగమున—శివగీత, వ్యాసగీత, తీర్థమహత్త్వ, వర్ణాచారములు, వృత్తులు మున్నగునవి కలవు.

## (16) మత్స్యపురాణము.

మత్స్యమూర్తి మనువునకుఁ జెప్పినది. 14 వేలు.

ఇందుమనుమత్స్యసంవాదము, బ్రహ్మాండోత్పత్తి, దేవాద్యుత్పత్తి, మన్వంతరనిరూపణము, పితృవంశవివరణము, శ్రాద్ధకాలము, చంద్రోత్పత్తి, చంద్రవంశకీర్తనము, కార్తవీర్యోపాఖ్యానము, భృగుశాపమున విష్ణు వవతరించుట, పూరువంశము, కర్మయోగము, వ్రతములు, దానములు, తారకోత్పత్తి, పార్వతీజన్మము-తపస్సు-వివాహము, కార్తికేయ జననము, తారకవధ, పితృగాథలు, సావిత్ర్యుపాఖ్యానము, ఉత్పాత గ్రహశాంతులు, వామనమాహాత్మ్యము, ప్రతిమాలక్షణము, తత్ప్రతిష్ఠ, భవిష్య ద్రాజవంశములు, మహాదానములు మొదలయినవి విస్తరింపఁబడినవి.

## (17) గరుడపురాణము.

విష్ణువు గరుడునికిఁ జెప్పినది. 16 వేలు. ఇందు రెండుఖండములు. పూర్వఖండమున—సృష్టిసంక్షేపము, పూజావిధి, దీక్షావిధి, యోగాధ్యా

యము, విష్ణుసహస్రనామములు, పూజా న్యాసాది పద్ధతులు, దేవప్రతిష్ఠ, దానధర్మములు, ప్రాయశ్చిత్తవిధులు, ద్వీప నరకవర్ణనము, జ్యోతిష సాముద్రిక వివరణము, రత్నపరీక్ష, తీర్థమహాత్మ్య, మన్వంతరనిరూపణము, గ్రహయాగములు, ఆశౌచవిధులు, చంద్రసూర్యవంశములు, అవతారములు, రామాయణము, హరివంశము, ఆయుర్వేదము, గృహస్థనిత్యకర్మవిధులు, యుగధర్మములు, రోగము, విష్ణుమహాత్మ్య, బ్రహ్మజ్ఞానము; ఉత్తరఖండమున, పునర్జన్మకారణములు, యమలోకమార్గము, షోడశశ్రాద్ధములు, యమపురి, ప్రేతపీడ, ప్రేతత్వహేతువు, తన్నివృత్తిసాధనములు, మృత్యుపూర్వ పశ్చాత్కార్యములు, నారాయణబలి, వృషోత్సర్గము, కర్మవిపాకము, కృత్యాకృత్యవిచారము, సప్తలోక వివరణము, బ్రహ్మజీవనిర్ణయము, ఆత్యంతికలయము మున్నగునవి కలవు.

---

## (18) బ్రహ్మాండపురాణము.

బ్రహ్మ చెప్పినది. 12 వేలు. ఇందు మూఁడుభాగములు కలవు.

పూర్వభాగమున.—కర్మనిరూపణము, బ్రహ్మోత్పత్తి, లోకసృష్టి, కల్పమన్వంతర వివరణము, బ్రహ్మమానససృష్టి, రుద్రోత్పత్తి, శివవిభూతి, ఋషిసృష్టి, ఊర్ధ్వాధోలోక, సప్తద్వీపవర్ణనము, యుగతత్త్వలక్షణములు, ప్రజాలక్షణములు, యజ్ఞము, పృథ్వీదోహనము; మధ్యమభాగమున —సప్తర్షిదేవాదిజననము, శ్రాద్ధవిధి, వైవస్వతసృష్టి, ఋషివంశనిరూపణము, అత్రీక్ష్వాకువంశకీర్తనము, యయాతిచరిత్ర, యదువంశము, కార్తవీర్యోపాఖ్యానము, సగరోత్పత్తి, పరశురామచరిత్ర, దేవాసురయుద్ధము, బలివంశనిరూపణము, భవిష్యద్రాజవంశనిర్ణయము; ఉత్తరభాగమున — భావిమానవచరిత్ర, ప్రళయము, కాలపరిమాణము, చతుర్దశలోక, నరక, శివపురి వర్ణనములు, ప్రాకృతికలయము, జీవులు కర్మానుసారముగఁ బొందు గతులు, బ్రహ్మవస్తుస్వరూపము మున్నగునవి విస్తరింపఁబడినవి.

## పురాణ సామరస్యము.

పురాణములయందు సామాన్య ధర్మబోధకము లివి, మతనిరూపకము లివి యని విభజింప వలను పడదు. మతవిషయికసందర్భములలోనే మానవలోక కళ్యాణస్థితికై వలసిన సర్వధర్మములు ననుసంధింపఁబడినవి. దేశకాల పాత్రముల ననుసరించి పరమార్థానుభవము నొందుటలో మాత్రము మతరూపములు భిన్నము లయినవి. ఆయా సందర్భములు వచ్చినప్పు డప్పటి పెద్దలు తమతమ మతోద్దేశముల బలపఱిచి, దృఢవిశ్వాసము నెలకొలిపి, సదాచరణములోనికిఁ దెచ్చుటకై, శైవము, వైష్ణవము, సౌరము, ఆగ్నేయము, శాక్తేయము నని భిన్నపురాణములు వెలువరించిరి. ఇట్లు, పురాణము లెట్టి భిన్నగతుల నొందినను, సృష్టిక్రమము—పుణ్యపాపవివరణము— దానధర్మములు— తీర్థమహాత్మ్యము— జ్యోతిషము—శకునము—స్వప్నము—ధనుర్విద్య—ఆయుర్వేదము—రాజర్షి చరిత్రములు—ప్రకృతివిలాసములు—ప్రళయము—బ్రహ్మజ్ఞానము మున్నగునవి ప్రాయికముగా నన్నిట సామరస్య మాత్రముననే కూర్పఁబడినవి. ప్రతిపురాణము నందు నిట్టి సాధారణధర్మములె చర్వితచర్వణముగా పునరుద్ధృతములగుట కేమి కారణ మని పరికింప, సనాతనధర్మ సంరక్షణమునకే, సదాచార ప్రవర్తనమునకే, సర్వజనమనోనికర్షణమునకే యని స్పష్టమగుచున్నది.

---

## పురాణ భేదము.

పూర్వోక్తము లయిన పురాణోపపురాణములె గాక, మఱికొన్నియు బయలు వెడలినవి. ఇవి, జల, స్థల, శైల, కాల మహాత్మ్యనిరూపకము లయి యున్నవి. ఇందలి కథాంశములు కొన్ని పురాణములనుండి కైకొనినవి; మఱికొన్ని స్వయముగా గ్రహించినవి. వీనినే విషయవిస్తరము గావించి పెక్కండ్రు ప్రత్యేకగ్రంథములుగ నాంధ్రమునను రచియించి యున్నారు. శైలివిషయమునమాత్రమివి ప్రబంధమూరము నేత్రొక్కినవి.

జలపురాణములు తీర్థమహాత్మ్యముం దెలుపుచున్నవి. గౌతమీమాహాత్మ్యము కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, సాగరసంగమమాహాత్మ్యమును కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడును, ఇటీవల మధిర సుబ్బన్న దీక్షితులుగారును రచించిరి.

స్థలపురాణములు క్షేత్రమహిమాదులఁ దెలియఁజేయునవి. శ్రీరంగమాహాత్మ్యమును భైరవకవియు, ఒడయనంబి విలాసమును అజ్జరపు పేరయలింగకవియు, కాళహస్తి మాహాత్మ్యమును ధూర్జటికవియు, సర్వపురమాహాత్మ్యమును కూచిమంచి తిమ్మకవియు, కాశీమాహాత్మ్యమును ముల్లపూడి వేంకటకవియు వ్రాసిరి.

శైలపురాణములు పర్వతప్రదేశములలో దేవతలు వెలసిన విశేషమును వివరించుచున్నవి. శ్వేతాచల మాహాత్మ్యమును బొబ్బిలి రంగరాయని కంకితముగా కొటికలపూడి వేంకటకృష్ణకవియు, వేంకటాచలమాహాత్మ్యమును తరిగొండ వెంకమ్మయు, శ్రీశైలమాహాత్మ్యమును నాగులూరి శేషనారాధ్యుఁడును, ఘటికాచల పాండురంగమాహాత్మ్యములు తెనాలి రామకృష్ణకవియు విరచించిరి.

కాలపురాణములు కాలవిశేషాదుల బోధించునవి. మాఘపురాణము, కార్తికపురాణము నీ తరగతిలోనివి.

మన యీ పవిత్రాంధ్రదేశమునందు మనము ప్రత్యహము త్రొక్కెడు ప్రతిస్థలమునందును, ఎక్కెడు ప్రతి పర్వతమునందును, మునిఁగెడు ప్రతి తీర్థమునందును, ఏదో యొక యీశ్వరమహిమ సువ్యక్తమై ప్రవిమల భక్తిరసము నావిర్భవింపఁజేయుచున్నది.

---

## పురాణాంధ్రీకరణము.

'ముఖే ముఖే సరస్వతీ' యన్నట్లు ఒకని కవితాధార వేఱొకనికి లేదు. ఒకనిశైలి మఱియొకనికి రాదు. 'పులినిజూచి నక్కవాత పెట్టు

కొన్నట్లు', ఒకని కవిత ననుకరింత మనుకొన్నను, తెచ్చిపెట్టుకొన్నట్టులే యుండును గాని యది యదికినట్టు కనుపట్టదు. 'కవితా వనితా చైవ స్వయమేవాగతా వరా' యనునట్లు, కవితాధార తనంత రావలసినదే కాని బలవంతముగా నిఘంటువులు చూచి మాటలేర్చి కూర్చిన కూరు పంతగా రుచింపనేరదు. కవిత కమ్మచ్చునఁ దీసిన బంగరు తీఁగలాగున సాఁగవలసినదే. పాదరసము ప్రాఁకినట్లు పరుగెత్తవలసినదే. అట్టిదే కవిత్వము.

మానవుల యభిరుచులయందు భిన్నత యెట్లో యట్లే, కవుల కవితా రసములయందును భేదము చూపట్టుచున్నది. ప్రబంధకవులు పెక్కండ్రు పూర్వమార్గములనే త్రొక్కినను, పురాణాంధ్రీకరణములలో మాత్రము పలువురు పలుతెఱంగులఁ బోయిరి. ప్రాథమికులు గాక యాధునికులు తమ యాంధ్రీకరణములయందు పురాణము లనుమాట మఱచిరో, తత్కాలీనమైన ప్రబంధగౌరవము నందుఁ గొనుపఁ దలఁచిరో, వర్ణనావిశేషములఁ గావించుచు వచ్చిరి. తత్తత్కాలిక ప్రభువుల యుత్సాహ ప్రోత్సాహముల మూలముననే యాంధ్రీకరణములు ప్రారంభింపఁబడినట్లు తత్త ద్రాజాంకితములే ప్రబల నిదర్శనములుగ నున్నవి. 'కవిర్వాచవిభుర్విభుర్వాచ కవిః' అన్నట్లు, కవి ప్రభువుల సమ్మేళనంబునఁగాని పరస్పరశోభ సంఘటిల్లదు.

మున్ను, ప్రభువులు లోకహితార్థము గ్రంథములు వ్రాయఁ బ్రోత్సహించి కృతు లందుచు వచ్చిరి. పిమ్మట, రాజులు స్వార్థమై కృతు లందఁ గోరిరి తరువాతి వారు నిరుత్సాహులై యుండ, తమంతఁ దామె కవులు కృతిపతులను వెదకి కృతు లిచ్చిరి. ప్రకృతము జనరంజనము మూలమున ధన సంపాదనార్థము బహుగ్రంథములు వ్రాయఁబడుచున్నవి.

ఇప్పటికిఁ దెలిసినంతవట్టు పురాణము లాంధ్రీకరించుటలో ప్రాథమికులు కవిత్రయమువారే సర్వసాధారణముగా మన యాంధ్రులు చదువుచు చదివించుచు, వచ్చుచున్న యభిమాన గ్రంథములు మూఁడు. భారత భాగవత రామాయణములు. ఐహికాముష్మిక ధర్మము లెల్ల నిందుపొందు

పడి యుండుటంబట్టి, వీని కింత ప్రాముఖ్యము కలిగినది. భారత మితిహాసము; భాగవతము పురాణము; రామాయణము కావ్యము. ఇట్లార్యులచే విభజింపఁబడినవి. తెనుఁగున పురాణములుగానే పరిగణింపఁబడుచున్నవి.

అదెట్టి దైవికమో కాని, యివి మూఁడును బహుకర్తృకములు గానే యున్నవి. ఇం దాద్యమయిన భారతమందే యాంధ్రప్రబంధమార్గము ప్రదర్శింపఁబడు చున్నది:—

ఉ. ఇమ్ముగ విశ్వకర్మ రచియించినకాంచనహర్మ్యతుంగశృం
గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వె తత్సమీ
పమ్మునఁ బాఱుచున్న ఘనపంక్తులయం దచిరద్యుతిప్రతా
నమ్ముల శ్రేణి సేయుచు నభారతమున్ విలసిల్లు నప్పురిన్. నన్నయ.

సీ. పటుమొయిల్ గప్పినఁ బాడఱి మసఁగాంతిఁ
గదలిన యమృతాంశుకళయుఁబోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి
చెలువు గుందిన సరోజినివిధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి చూపిన దీపకళికపగిది
ధూళిపైఁ బొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలిన లతిక భంగి

గీ. గంధకారికావేషంబుకతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱుఁపడి యుండఁ గాంచు
తనయ మహిషి చనుదెంచెఁ దగతిఁ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబు లవ్వేలఁదిఁ జూచి. తిక్కన.

శా. గీర్వాణప్రవిముక్తబాణపటలక్రీడావిముక్తంబులై
గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁకన్ దొల్లెఁ గల్పచ్ఛదా

నిర్వ్యాపృత్తాంబుద మండలోద్ధతమహా నిర్ఘాతపాతావధూ
తోర్వీభృద్ఘన గండశైలములతో నూహింపఁ దుల్యంబులై. ఎఱ్ఱన.

---

## భారతము.

గోదావరీ కృష్ణా మండలముల నడుమ వేఁగినాటికిఁ బ్రభు వయిన విష్ణువర్ధన బిరుదాంకితుఁ డగు రాజరాజ నరేంద్రున కంకితముగా, పదునొకండవ శతాబ్దము ప్రారంభమున నన్నయభట్టారకునిచే భారతములో నాదిపర్వము, సభాపర్వము, నరణ్యపర్వములోఁ గొంతవట్టును దెలిఁగింపఁ బడినవి. నన్నయకుఁ దరువాత రెండువందలయేండ్లకు, మనుమసిద్ధిరాజు కాలములో తిక్కన సోమయాజి విరాటాది పదునేను పర్వములు హరిహరాంకితముగ విరచించెను. ఇతనికి నూఱేండ్లతరువాత, నెల్లూరి మండలనివాసి యెఱ్ఱాప్రగడ యరణ్య పర్వశేషమును పూరించి కొదవ తీర్చెను. అరణ్యపర్వ మధ్యముననే నన్నయ గతించె నన్న భీతిచేతనే కాఁబోలు, తిక్కన దాని జోలికిఁ బోలేదు. మఱి యితరులుం బూనుకొన రైరి. ఏమి యుద్దేశించు కొనెనో కాని శంభుదాసుఁడు సాహసించె. సర్వేశ్వర సాహాయ్యంబున సంపూర్తిని గావించెను. అయిన, నందుఁ దా నేకృతిం గూర్పక రాజరాజనరేంద్ర కృతిగనే యుంచెను. ఇప్పటికి నదేమి ఘృణ్యమో యారణ్యపర్వకథ మొదటినుండి తుదదాఁకఁ జదువ రాదనియే యాచారము.

ఆంధ్రభాష కపూర్వగౌరవముం గొనివచ్చినవారిలో నగ్రగణ్యులీ కవిత్రయము వారే. ఆంధ్రభాషకు వీరు త్రొక్కినదే త్రోవ. వీరు ప్రయోగించినదే ప్రమాణము. ఇందుచేతనే పంచమవేద మనఁబరఁగు భారతము పరమ ప్రమాణమైనది; కావ్యలక్షణమైనది. ఇందు, నన్నయ యాదికవిగా జెప్పఁబడుచున్నాఁడు. ఇతనికిఁ బూర్వము ప్రసిద్ధ కవితారచనలు కానరామింజేసి యీ ప్రఖ్యాతి వచ్చినది. మున్ను, గానట బీసటగా నుండిన తెనుంగుబాసను సంస్కరించి రచనాప్రచారమునకుఁ దెచ్చినందున వాగనుశాసనుఁ డను బిరుద మితఁడు సంపాదించెను. ఇతని కవిత్వము

మృదుమధుర ధారాళధోరణియు, సమయోచిత రసస్ఫూర్తియుఁ, గలది. శకుంతలా దుష్యంతుల కథ యిందులకు నిదర్శనము. ఇతని కవిత్వమందు రెండువంతులు సంస్కృతపదములు నొకవంతు తెనుఁగుపదములుం గలవు. సాధ్యమగునంతవఱ కర్థబోధక మగునట్లు కవిత్వము చెప్పుటె యీతని యభిమతము. ఇతఁడు తన శైలియందు యతిప్రాస నియమములను భిన్నగతులుగ నీసపద్యములలోఁ జూపించెను. మొత్తముమీఁద నితఁడు పద్యగద్యముల నొకటి వెంబడి నొకటిగాఁ బొందుపఱుచుచు వచ్చెను. పద్యాదియం దున్న యాడంబరము పద్యాంతమున కుంటుపడుట చూడఁగా నప్పటి యాంధ్రభారతి తప్పటడుగులు వెట్టుచున్నదో యన్నట్లు చూపట్టును. నన్నయ తనకు నారాయణభట్టను వాఙ్మయ ధురంధరుఁడు చేదోడు వాదోడయినట్లు కృతజ్ఞతం దెలిపెను. వీరి యిద్దఱ కవిత్వశైలి విబుధులు నిపుణముగాఁ బరికింపవలసి యున్నది.

తిక్కన పంచమవేదము నాంధ్రీకరింపఁబూని వైదిక నిష్ఠాగరిష్ఠుఁడయిన సోమయాజి యయ్యెను. సంస్కృతాంధ్రకవితా ధురీణుఁడై యుభయ కవిమిత్రుఁ డనఁబరఁగెను. ఈ మహాకవియు నన్నయమార్గమునే ప్రమాణీకరించి, పద్యములతోను గద్యములతోను రచనాప్రణాళిక నను సంధించెను. ఈతని కవితాధార శివజటాజూట నిర్గతానర్గళ గంగాతరంగిణి భంగి నాంధ్రహృదయ క్షేత్రముల సరసగతులఁ బ్రవహించి ఫలవంతములుగఁ జేయుచున్నది. ఇతని కవిత్వమున సంస్కృతపదము లొకపాలును, తెనుఁగు పదములు రెండు పాళ్లును గలవు. దీర్ఘసమాసము లంతగాఁ గానరావు. రసస్ఫురణము గావించుటలో నీతఁడు పెట్టినది పేరు. కవిత్వము నవనవోన్మేషము నంది చదువువారికి, వినువారికి, హృదయంగమముగ నుండును. రచనాచమత్కృతిచే రసము చిప్పిలుచు నెంత చదివినను విసువు పుట్టింపదు. ఆంధ్రమం దింతరచనా విస్తృతి యొనర్చిన మేటి యింకొక్కఁడు గానరాఁడు. సంస్కృతపరమార్థము నాంధ్రావబోధ మొనరించుట కితఁడె మార్గదర్శి. రాజమండలికిఁ దన రచనామూల

మునకే సమకాలాచితముగ వీరశాంత రసోజ్జీవనములు గావించిన కవితా పట్టభద్రుఁ డితఁడే.

ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుఁ డను బిరుదు గలవాఁడు. పరమేశ్వర భక్తుఁ డగుటచే శంభుదాసుఁ డనియు వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇతఁడు నన్నయ తిక్కనల మార్గములనే యవలంబించి, సంస్కృతాంధ్ర జటిలముగా సరస రచన సమకూర్చినవాఁడు, మహాకవి ద్వయమధ్యమున నభేద్యముగఁ గవిత్వ వాహినిని నడిపింపఁ గలిగిన ధీరాగ్రగణ్యుఁ డితఁడు.

ఇంతటి మేటి కవులు వ్రాయుటం బట్టియే భారతమున కజరామరమైన ప్రశస్తి సంఘటిల్లినది. ఇందు చేతనే, 'తింటే గారెలె తినవలె, వింటే భారతమె వినవలె' నన్న లోకోక్తి ప్రవర్తిల్లినది.

పదునేడవ శతాబ్దములో నిమ్మలపల్లి పెద్దనామాత్యుని కృతిపతిగఁ జేసి చరిగొండ ధర్మనామాత్యుఁడు చిత్రభారతమును, పదునేనవ శతాబ్దమున బళ్లారి మండలమున ఆనెగొంది సంస్థాన ప్రభువగు పాలువగుండ భూపాలున కంకిత మిచ్చి పిల్లల మఱ్ఱి పినవీరభద్రుఁడు జైమినిభారతము (అశ్వమేధపర్వము)ను, రచియించిరి. భారతములోని హరివంశమును సంపూర్ణముగ నెఱ్ఱాప్రగడయు, ఉత్తరభాగమును నాచన సోమనాథుఁడును తెనిఁగించిరి. ఈ నాచన సోమనాథుఁడు సర్వజ్ఞుఁ డని పేరందిన వాఁడు. ఇతఁడు 1376 వ సంవత్సర ప్రాంతమందలి బుక్కరాయుని కాలము లోనివాఁడు. ఇతని కవిత్వము భారత కవిత్వమునకంటె నెసర్వవిధముల విశేషించిన దని ప్రసిద్ధి. ఇందు జాతీయములు మెండు; కవితాధార యనర్గళము

---

## భాగవతము.

పదుమూఁడవ శతాబ్దములో కడపమండలమునందలి యేకశిలానగర వాస్తవ్యుఁడు బమ్మెరపోతనామాత్యుఁడు శ్రీమద్భాగవతము నాంధ్రీకరించెను. ఇందుఁ గొన్ని భాగము లచ్ఛిన్నములుకాఁగా నైదవస్కంధము నొప్పన యాఱవస్కంధము సింగన్న, పదునొకొండు పండ్రెండు స్కంధ

ములు కారయ, పూరించిరి. పోతన సిద్ధునిరామమంత్రోపదేశప్రభావమున సహజ పాండిత్యమందినవాఁడు, భక్తిరసము గురిపించుటలో నింతటివాఁడు మఱిలేఁడు. కావునను సంస్కృతమునఁగల యిరువదిరెండువేల గ్రంథమును తెనుఁగున ముప్పదివేలుగఁ బెనిచియున్నాఁడు. ఇతని కవిత్వము శబ్దార్థాలంకారభూయిష్ఠమై దీర్ఘసమాసజటిలమై యున్నను లలితమై హృదయరంజకమై కర్ణరసాయనముగను యుండును. సమయోచితముగ రసము తొలఁకాడుచుండును. భక్తి నెవ్వినఁ బులకరిత్తించును. భాగవతము సర్వజనసమ్మతమైన గ్రంథరాజము. కావుననే యందలి రుక్మిణీకల్యాణము, ప్రహ్లాదచరిత్ర, ధ్రువోపాఖ్యానము, కుచేలోపాఖ్యానము, గజేంద్రమోక్షణము మున్నగుభాగములు ప్రత్యేకముగాఁ జదువుకొనుచున్నారు. నిఱుపేదయయ్యు, నయోచితముగ రాజాశ్రయము లభ్యమగుచున్నను, భక్తిని పెన్నిధిగనెంచి కృతిబహూకృతులఁదృణీకరించి మించిన యాత్మగౌరవముతో భగవదంకితముఁ గావించి చరితార్థుఁడైన మహానుభావుఁ డీఁతడొక్కఁడే యిప్పటికిఁ గన్పట్టుచున్నాఁడు. ఇతఁడువీరభద్రవిజయమును గూడ రచియించి యున్నాఁడు.

పంచొవిన్నగవ శతాబ్దమున దేవీభాగవతమును త్రిపురాన తిమ్మయదొర, తిరుపతివేంకటేశ్వరకవులు, దాసు శ్రీరామపండితుండును, దోనేరు కోనేరుకవులు బాలభాగవతమును ఆంధ్రీకరించి యున్నారు. ఇవంత వాడుకలో లేవు.

---

## రామాయణము.

పదుమూలవ శతాబ్దము మొదట భాస్కరమంత్రి ప్రతాపరుద్రుని కాలములోని సాహిణిమారునకుఁ గృతియిచ్చి వాల్మీకి రామాయణము నాంధ్రీకరించె. ఇందలి భాగములు కొన్ని జీర్ణములుకాఁగా బాలకిష్కింధాసుందరకాండములు మల్లికార్జున భట్టును, అయోధ్యాకాండము కుమారరుద్రదేవుఁడును, అరణ్యకాండము, యుద్ధకాండములో సగమును హుళక్కి భా

స్కరుఁడును, పెఱసగము నయ్యలార్యుఁడును, రచించినట్లు కన్పట్టుచున్నది. ఈరామాయణము కావ్యలక్షణములకు లక్ష్యమై, స్వభావోక్తులకు నిలయమై జీవితధర్మముల కాదర్శకమైయొప్పుచున్నది. అవతారకథావిశేషసంగతమగుటంబట్టి పుణ్యఫలప్రద మనుమాట యటుండనిండు జనోపయోగవిషయము లెల్ల నిండియుండినందున నిత్యపఠనార్హమైనది. దేవీనవరాత్రములందుఁగాని యేదేని కార్యసిద్ధికోరుటయందుఁగాని సుందరకాండ పారాయణము చేయింతురు. ఇట్టి విశేషము లీగ్రంథమునఁ గలుగుటంజేసి దీనిని పెక్కండ్రు పలువిధములైన గ్రంథములుగ విరచించిరి.

క్రీ॥ శ॥

1198 తిక్కన నిర్వచనోత్తర రామాయణము,

1230 రంగనాథుఁడు ద్విపదరామాయణము,

1420 మడికిసింగన వాసిష్ఠరామాయణము,

1530 మొల్ల మొల్లరామాయణము,

1732 కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుఁగురామాయణము,

1790 కంకంటిపాపరాజు ఉత్తరరామాయణము,

1870 వేల్పూరి వేంకటేశ్వరకవి విచిత్ర రామాయణము,
కోటంరాజు నాగయ్య అధ్యాత్మ రామాయణము,
ఘట్టు వేంకటరామకృష్ణకవి పట్టాభిరామాయణము,
గోపీనాథం వేంకటకవి గోపీనాథరామాయణము,

మఱియు నిటీవలఁ గొందఱు వ్రాసి వాసి గాంచిరి. ఇందు కూచిమంచి తిమ్మకవి కవిసార్వభౌముఁడనఁ బడినవాఁడు. ఇతఁడు రచించినన్ని యాంధ్రప్రబంధములు ఆధునికులలో నెవ్వరును వ్రాసియుండలేదు. ఇతని కవిత్వము మృదుమధురము. రసవంతము, శైలిధారాళము, వర్ణనము లితని సొమ్మనవచ్చును. అచ్చతెనుఁగునఁ గావ్యములు చెప్పినవాఁడు, తనకు బిరుదమిచ్చిన మాధవనృపతికి సైతము కృతి యొసంగక తనకృతులెల్ల పీఠికాపురకుక్కుటేశ్వర స్వామికి సమర్పించిన మహానుభావుఁడు.

రంగనాథుఁడు ద్విపదకావ్యము వ్రాసినను, ప్రబంధ గౌరవము నిలిపి సమయ సముచితముగా నానారసములను ధారాళశైలిని బ్రవహింపఁ జేసిన కవిశిఖామణి.

కంకంటిపాపరాజు తన ఉత్తర రామాయణములో పురాణశైలిని మాని ప్రబంధపాకము ప్రదర్శించిన సరస కవితా ధురంధరుఁడు.

ఆంధ్ర వధూమణులలోఁ గవిత్వము చెప్పుటయం దగ్రగణ్యురాలు మొల్ల. ఈమె కవితాశైలి జాతీయమై సరసమై తనరారుం గావుననే పరీక్షాపతనీయ మయ్యెను.

గోపినాథము వెంకటకవి సంస్కృతమునకు సరిగ నాంధ్రీకరించిన కవి. ఈతని రసగుంభితశైలి విన్నచో నాధునికమో ప్రాథమికమో వేర్పఱుప శక్యము గాదు, ముద్దులు మూటగట్టుచుండును.

---

## పురాణములు.

1180 పిడుపర్తి సోమనాథుఁడు బసవపురాణము,

1325 మారనకవి ప్రతాపరుద్ర సేనానాయకుఁడగు నాగయగన్న మంత్రి కంకితమిచ్చి మార్కండేయ పురాణము,

1340 ఎఱ్ఱాప్రగ్గడ నరసింహస్వామి కృతిగా నృసింహపురాణము,

1400 శ్రీనాథమహాకవి స్కాందపురాణము నందలి కాశీఖండము వీరభద్రారెడ్డి పేరను, భీమఖండము బెండపూడి యన్నయ మంత్రి పేర, తురగా రాజకవి నాగర ఖండము.

1420 మడికిసింగన కందనమంత్రికిఁ గృతి యొసంగి పద్మపురాణము, దీనినే కమలనాథుఁడు 1350 లోను,

1460 పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి నారదపురాణము, దీనినే 1600 లో నల్లాడ నరసింహకవి యాంధ్రీకరించిరి.

శ్రీనాథకవి నైషధాద్యనేక గ్రంథకర్త. బహుధరాధీశ సంమాన మాననీయుఁడు. పరమ శివభక్తికిని కవిత్వ మహత్త్వమునకును అతని కృతు

లే నిదర్శకములు. శివవీరభద్రకవి యొక్క కవిత్వతత్త్వమంత గాక దైవ మహత్త్వమునందును ప్రసిద్ధుఁడు 'వాణి నా రాణి' యని సభలోఁ జెప్పి కవి బ్రహ్మ యని మెప్పొందినవాఁడు.

నంది సింగయ ఘంటమల్లయలు శ్రీకృష్ణదేవరాయల తండ్రి నరసింహదేవరాయలకుఁ గృతియిచ్చి వరాహపురాణము రచించిరి. వీరిద్దఱు మేన మామ, మేనల్లుండ్రు. కలసియే గ్రంథములు వ్రాయుచువచ్చిరి. జంటకవులలో వీరె ప్రాథమికులు. వేదాంతగ్రంథము ప్రబంధరూపమునఁ గూర్చి రసము కురిపించిన మహాఘనులు.

1500 వెన్నెలకంటి సూరన కృష్ణా మండలములోని రావూరి రాఘవరెడ్డి పేర విష్ణుపురాణము వ్రాసె.
దీనినే యిటీవల సీతారామ సిద్ధాంతికూడ రచించె.

1500 లింగమగుంట తిమ్మకవి మత్స్య, వామనపురాణములు,

1508 ఎర్దనపూడి పెద్దయమంత్రి పురుషోత్తమ పట్టణనివాసి దాసరి చిన గంగయ్య చౌదరి కంకితము చేసి వాయుపురాణము,

1530 పింగళి సూరన గరుడపురాణము.

తెనాలి రామకృష్ణకవి లింగపురాణము, వ్రాసిరి. పింగళి సూరన యిప్పటి నవలాప్రక్రియగానే కళాపూర్ణోదయమనెడి యద్భుత చరిత్రము చిత్రించినవాఁడు. ఈతని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు మించిన ప్రౌఢ ప్రబంధము లేదందురు. ద్వ్యర్థికావ్యమును రచించుటలో నగ్రస్థానము వహించినమహాత్ముఁడు. రామకృష్ణకవి కూలంకషప్రజ్ఞాశాలి.

1550 వాసిరాజు రామన బృహన్నారదీయము తెల్గించె. శ్రోత్రి లంక మృత్యుంజయుఁడు 1800లో దీనినే విరచించినాఁడు.

1600 మనువంశపురాణము. భాస్కరపంతులు కన్యకాపురాణము,

1700 కొండూరి వేంకటకవి భార్గవపురాణము,

1800 అత్తలూరి పాపయామాత్యుఁడు కందుకూరి యమృతలింగము

గారి పేర చెన్నబసవపురాణము,

,, పట్టిమట్టి సోమనాథకవి బిక్కనవోలి కామారెడ్డి పేర స్కాందపురాణములోని సూత సంహితను.

,, కోడూరి వేంకటాచలకవి ముకురు ముకువాగకు ప్రభుని కంకిత మొనర్చి శివరహస్యఖండము,

,, శ్రీధర మల్లె వెంకటరామకృష్ణకవి జ్యోతిషుల్బన పుత్త్రిల ప్రేరణమున బ్రహ్మోత్తరఖండమును,

1850 వేంకటగిరి సంస్థానకవి గోపీనాథము వేంకటకవి బ్రహ్మవైవర్తము నందలి శ్రీకృష్ణ జన్మఖండము వ్రాసిరి.

1898 చిల్కపాటి రామానుజశర్మ కల్కిపురాణము, మండకామేశ్వరకవి కూర్మపురాణము,

1910 జనమంచి శేషాద్రిశర్మ. బ్రహ్మాండపురాణము, పాద్యముగా నాంధ్రీకరించిరి.

బ్రహ్మాండపురాణ మింతకు మున్నె రేవూరి యెల్లనకవి రచించినట్టు కన్పట్టుచున్నది.

మహాపురాణములలో బ్రహ్మ, శివ, భవిష్యోత్తర, అగ్ని పురాణములు, స్కంద, బ్రహ్మవైవర్త శిష్టభాగములు, నృసింహభార్గవనులు తక్కఁ దక్కిన యుపపురాణములు, నాంధ్రీకరింపవలసి యున్నవి. పురాణములు పెద్ద వగుటచేఁ జాలవఱకుఁ జిన్నచిన్న భాగములనే, అందు రసవంతములైన, భారతాదులందు లేని, ప్రజలకు సంబంధించిన, భాగములనే తీసి పూర్వు లాంధ్రీకరించుచు వచ్చిరి. ముద్రితాముద్రితము లం దిందుఁ గొన్ని యలభ్యములు గాకయున్నవి.

ఆంధ్రభారతీసముద్భోధనావసరసమాగమమున భాషాభిమాన మానసీయుల దృక్పథమునం బడి యీపురాణాదర్శములు సర్వ ధర్మసందర్శకము లై చిరనూతనశోభతోఁ జెన్నొందుఁ గాక !

# పు రా ణ శై లి.

భావబోధక మైన దే కాని యేదియు హృదయరంజకము కానేరదు. కావుననె లోకసామాన్యమునకుఁ గావలసిన వర్ణాశ్రమధర్మములు, నిత్యకర్మములు, విధినిషేధములు, రాజనీతులు, లోకనీతులు, దాస్యవందనాది భక్తిలక్షణములు బోధించుటకై ద్రాక్షాపాకమునను పురాణములు రచింపఁబడినవి. కృతికర్తల పాండిత్య మహత్త్వము వెల్లడింప నివి యేర్పడినవి కావు. వేదవిహిత ధర్మములను సుగ్రాహ్యములు గావించుటయే పురాణోద్దేశము. తత్కర్తలు, తమతమ బుద్ధిబలము కొలఁది, కవితయందును, విశేషవైశద్యమును జూపఁ జొచ్చిరి. పురాణములయందు భావ గాంభీర్యము గాని, శబ్దకాఠిన్యము గాని, యన్వయ సందిగ్ధత్వము గాని, లేశమును గానిపింపదు. శైలి సరళమై, మనోహరమై జనసామాన్యగ్రాహకమైన ధారాళధోరణి నలరారు చున్నది. సంస్కృతమున 'అనుష్టుప్' శ్లోకము లట్ల యాంధ్రమున సీస,గీత, కంద, చంపకోత్పలః మత్తేభ, శార్దూల పద్యములతోనే కథావిధానము నడపఁబడుచున్నది. చరిత్రాంశముల, పురాణకథల, రచనలకు ద్విపదలు సహితము సహకారు లగుచున్నవి. పురాణాదులయందు మధ్యమధ్య సందర్భానుసారముగా విషయబోధము గలిగింప ననువై, బహువిధ చిత్రగతులు గల గద్యములు సులభశైలిని హృద్యములుగఁ గూర్పఁబడుచున్నవి. ప్రబంధమధ్యగత గద్యములన్ననో, శబ్దార్థాలంకారాడంబరములతో నిండియుండును. అదినె ప్రత్యేకవచన రచనలు కానరావు. గద్యములవీడి పద్యములతోనె కథ నడుపఁ బడెడిది.

పురాణము లాంధ్రీకరించుటలో మక్కికి మక్కిగాక కొంతవట్టు స్వేచ్ఛ నొసఁగఁ బడుటచే శైలి తీఁగతీసినట్లు సాఁగుచు వచ్చినది. ఇట్లు భాషాంతరీకరించిన కవు లందఱు ప్రాయికముగా మూలగ్రంథములందలి

కథలు కొన్ని తగ్గించి, కొన్ని హెచ్చించి, కొన్ని మార్పులు కావించి వివిధమార్గములఁ బోయిరి.

## విషయ విస్తృతి.

పురాణేతిహాసము లందలి స్వల్పకథా సూచనములు సంగ్రహించి ప్రబంధములలో విశేషించి రసపోషణము కావించుచున్నారు. ఇందులకు నిదర్శనముగా, భారతములో నన్నయభట్టారకుఁ డారణ్యపర్వమున నలోపాఖ్యానమునందు నలుఁడు దమయంతీ ద్వితీయుఁడై యడవులకు వెడలు సందర్భమున,

క. అడవులలో నాతోఁ గడు, నిడుములఁ బడఁ జాల వరుగు మిందుముఖీ యి
ప్పుడు నీబంధుజనంబుల, కడ కనవుడుఁ దరుణి శోకగద్గద యగుచున్.

అని వ్రాసినదానికి, శిరిప్రగడ ధర్మనామాత్యుఁడు తన నలచరిత్ర మనెడు ప్రబంధమునందు—

క. అడవుల నావెంబడిఁ గడు, నిడుమలు పడనేల మనల కింతయు మేలొం
దెడునంతకుఁ దలిదండ్రుల, కడఁ జేరుట నీతిగాదె? కంజదళాక్షీ!

అని వ్రాయుటతో మాత్రము తృప్తి నొందక,

సీ. క్రూరసత్త్వవిహార ఘోర మీ విపినంబు
మందిరారామమే? యిందువదన!
శైవాలజంబాల సహిత మీమడువు కే
ళీసరోవరమె? నాళీకగంధి!
యతుల కార్కశ్యకర్కశ కాయితం బీశిల
తూలికాతల్పమే? తోయజాక్షి!
నిబిడ కంటక సమన్వితము లీ వ్రతతులు
హేమడోలికలె? మత్తేభయాన!

గీ. భూరికర్ణకఠోరఝిల్లీరవంబు,
కుకపికానీకనాదమే ? సుందరాంగి !
ఏల నవయంగ నాతోడ నిచట నీకు ?
పుట్టినింటికిఁ జనఁ గాదె ? పువ్వుఁబోఁడి!

అని, పట్టణసిద్ధ సుఖములకు విరుద్ధము లయిన యరణ్యవాస కష్టములను జక్కఁగా సరిపోల్చి యెక్కుడుఁగ వర్ణించియున్నాఁడు.

భాగవతములో సహితము, బమ్మెర పోతనామాత్యుఁడు, కుచేలోపాఖ్యానమున—కుచేలునితో సుశీల 'మన దారిద్ర్యమును విష్ణుసందర్శనము చేసి పోఁగొట్టు' మని చెప్పు సందర్భమున—

గీ. బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ
గాన నేఁగి దారిద్ర్యాంధకారమగ్ను
లయిన మము నుద్ధరింపుము హరికృపాక
టాక్షరవిదీప్తి వడసి మహాత్మ ! నీవు.

అని సంగ్రహముగా వ్రాసిన దారిద్ర్యవిషయమును భట్టుప్రభువు తన కుచేలోపాఖ్యాన ప్రబంధమునందు,

సీ. రూపింప నిర్మల రూపంబు వెడలించు
రక్తమాంసముల భారము లడంచు
నుద్యోగములకునై యూహ సేరఁగ నీదు
మగల కింతులకును బగలు సేయు
బహుళంబులైన లోభంబు లుత్పాదించు
సూనృతవాక్యంబు చూఱవుచ్చుఁ
జాల దురాశావిచారంబు గల్పించు
మానంబు చెడ బతిమాలిపించు

గీ. సకలదృశానంద వనమున కగ్నికీల
యతిశయాక్రాంత చింతావిహారభూమి

భూరి దుఃఖంబులకు నెల్లఁ బుట్టినిల్లు
ప్రజల కిఁక లేమికంటెఁ బాపంబు గలదె?
అని, విస్తరించి చెప్పియున్నాఁడు.

---

## విషయ భిన్నత.

'మహామునీనాం మతయశ్చ భిన్నాః' అన్నట్లు, పురాణములలో ముఖ్య కథా విషయములలోనే భేదము పొడకట్టుచున్నది.

విష్ణుపురాణమునందును, భాగవతమునందును, ధ్రువచరిత్రము చెప్పఁబడినది. ఈ రెంటింటిలో ధ్రువుఁడు పరిభవింపఁబడుట, పరితపించుట, భగవత్ప్రసాదమున నత్యున్నతపద మందుట సామ్యములేయైనను, విష్ణుపురాణములో:—

"క. సురుచియు సునీతియును నను, నిరువురు భార్యల వరించి......."

అని యుత్తానపాదునకు సురుచి ప్రథమభార్యగాఁ జెప్పఁబడియుండఁగా, భాగవతములో:—

"క. వినుము సునీతియు సురుచియు, ననుభార్యలు గలరు వారియందు..."

అని సునీతి ప్రథమభార్యగాఁ జేర్కొనఁబడినది.

విష్ణుపురాణములో:—

"......ఇందునే, యుండఁగ నొల్ల వేల్పులకు
నున్నతి స్థానపదంబునందునే, యుండెద......"

అని ధ్రువుఁడు తనంతనే తపము సేయఁబోయినట్లుండఁగా, భాగవతములో:—

క. విను నాడిన గుణ సురుచి, జనములు సత్యంబు లగును సర్వేశ్వరునిం
దవఁ గల హరిచరణంబులు, గను జనకుని యంక మెక్కఁగాఁ దలఁచితేని'

అని. తల్లిమాటలను బట్టి పోయినట్టున్నది.

విష్ణుపురాణములో:—

సప్తమహర్షులు ధ్రువునకుఁ బ్రత్యక్షమై ద్వాదశాక్షరి నుపదేశించి నట్లుండఁగా,

భాగవతములో:—

నారదమహాముని వచ్చి వాసుదేవమంత్రము నుపదేశించి నట్లున్నది.

విష్ణుపురాణములో:—

మధువనము 'తనకుఁ దపంబు సేయఁ దగినపట్టుగాఁగ నిశ్చయంబు చేసి'

అని, మధువనమునఁ దప మొనర్ప ధ్రువుఁడే నిశ్చయించుకొన్నట్లుండ,

భాగవతములో:—

క. వరయమునాతటమున నగు
హరిసాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యము నై
పరఁగిన మధువనమునకును
సరసగుణా! చనుము మేలు సమకూఱు నటన్.

అని, నారదుఁ డుపదేశించిన ట్లున్నది.

విష్ణుపురాణములో:—

ధ్రువుని ఘోరతపంబునకు వెఱచి, సురపతి యోగు లనేకులను ప్రేరేపఁగా, వారు పెక్కు తెఱంగుల నాతనిం గలంచియు, నతఁడు ధైర్యుఁడై యుండుట గాంచి సునీతిరూపమున నొక్క మాయావినిం బనిచి తపంబు సాంతే మరల్ప హితోపదేశ మొనరించినట్లు చెప్పంబడిన విషయము

భాగవతములో—లేనేలేదు

భాగవతములో, ధ్రువుఁడు మాసక్రమమున ఫల, పర్ణ, జల, వాయు భక్షకుఁడై, షష్ఠమాసమున నిరుచ్ఛ్వాసుఁడయి ఘోరనిష్ఠమయిఁ దపం బొనర్చినసంగతి విష్ణుపురాణములోఁ గానంబడదు. విష్ణుపురాణములో, భగవంతుఁడు ప్రసన్నుఁడు కాఁగానే ధ్రువుఁడు తోడనే స్తుతించినట్లుండఁగా

—భాగవతములో, ధ్రువుఁడు నిశ్చేష్టితుఁడయి యుండ, వతనితలఁగ వంచి విష్ణువు తనచేతిశంఖముతో నతని కపోలతలమునంట, నతఁడు చైతన్య మంది సంస్తుతించిన ట్లున్నది. విష్ణుపురాణములో, మాతృసహితుండవై ధ్రువపదమందు మని శ్రీహరి వరమిచ్చిన ట్లున్నదానికి మాఱు, భాగవతములో 'నీ విర్వదియాఱువేలయేండ్లు నేలయేలి పిదప ధ్రువస్థాన మొందు' మన్న ట్లున్నది.

---

## మూలాధిక్యము.

స్కాందపురాణమునందలి బ్రహ్మోత్తరఖండము నాంధ్రీకరించుటలో శ్రీధరమల్లె వేంకటరామకవి మూలాధిక్య మొనరించినందుల కీక్రింద నిదర్శింపఁ బడుచున్నది.

మూలము:—

శ్లో॥ కైవల్యమార్గదీపోయ మవిద్యాసింధుబాడబః।
మహాపాతకదావాగ్ని స్సోయం మంత్రష్షడక్షరః॥

ఆంధ్రము—

మ. కలుషధ్వాంత దివాకరం బమృతమార్గస్వచ్ఛదీపంబు ని
శ్చల తాపత్రయదావపావకము సంసారాబ్ధిపోతంబు ని
ర్మల కళ్యాణఫలప్రదంబు విలసన్మంత్రాధిరాజంబు నై
యలరుక్ శైవషడక్షరంబు నిఖిలార్యస్తుత్యమై నిత్యముక్.

ఇందు, కైవల్యమార్గదీపమను విశేషణ మొక్కటి తక్క, మూలములోని యవిద్యాసింధుబాడబ మనుటకు సంసారాబ్ధిపోత మని, మహాపాతకదావాగ్ని యనుటకు తాపత్రయదావపావక మని,వినిమయము చేయఁబడుటయేకాక తక్కినవిశేషణము లెక్కువగాఁ జేర్పఁబడినవి. ఇట్లు, సకలపురాణములయందును గోచరించును.

## శైలీభేదము.

సందర్భానుసారముగా, పురాణశైలి కథాంశములతోడను, వివరణాంశములతోడను, వర్ణనాంశములతోడను, చింతనాంశములతోడను, వితర్కాంశములతోడను నిండియుండి సమగ్రరసస్ఫూర్తిని వెలయించుచున్నది.

---

### కథాంశము.

చ. సరసవిదర్భదేశమున సత్యరథుం డనుభూవరుండు భా
సురతరధర్మశీలుఁడు యశోధనుఁ డాశ్రితరంజనుండు నై
నిరతము ధారుణీతలము నీతిపథంబున నేలు చుండఁగా
నరిగె ననేకవత్సరము లానరపాలునకున్ సుఖంబుగన్.

ఉ. అంతఁ గృతాంతతుల్యులు మహాబలవంతులు దుర్మదాంధు ల
క్రాంతజయాభిలాషులు ససైన్యులు నై చనుదెంచి శత్రుభూ
కాంతవరుల్ విదర్భకటకంబునఁ దన్నగరంబుముట్టు న
త్యంతపరాక్రమంబు వెలయన్ విడియించిరి సర్వసేనలన్.

(స్కాందపురాణము)—బ్రహ్మోత్తరఖండము.

---

### వివరణాంశము.

ఉ. ఎంగిలితోడ గోవును మహీసురవహ్నుల నంటినట్టియా
వెంగలికేలు కుండశిఖి వేమఱుఁ గాల్చెద రట్లు కైరవా
ప్తుం గమలాప్తుఁ జక్కులను బోలఁగఁ జూచినవారికన్నులం
దింగిల మిడ్డవా రదె నరేశ్వర! కర్మఫలంబు దప్పునే?

మ. జననిం దండ్రి సహోదరున్ జెలియలిన్ జ్ఞాతిన్ గురున్ వృద్ధు వి
ప్రుని గోవున్ శిఖి వల్కఁ దన్నినయతిక్రూరాత్మపాదంబులన్

ఘనతీవ్రానలతప్త శృంఖలలతో గాఢంబుగాఁ గట్టి ప
ట్టినవాఁడున్ దొడబంటినిప్పుకలలో డిందున్ మహీవల్లభా !

మార్కండేయపురాణము.

## వర్ణనాంశము.

చ. పొలుపుగ నెల్లనాఁడు నుడివోవక వెల్లుగఁ బూచుతీఁగెలం
దెలుపులు మీఱి తోయనిధితీరవనంబులు చూడ్కికప్పుడే
నెలమి యొనర్చు వేల్పులచలేంద్రుసిఁ గవ్వముచేసి త్రచ్చుచోఁ
జిలికిననాఁటి యయ్యమృతశీకరసేకము వాయదో యనన్.

ఉ. ఱెక్కలతోడి కొండలనెఱిన్ దనలోన నడంచికొన్న నీ
పెక్కు బలారి పంచెనొకొ యీజలపూరము పేర్మి యంతయున్
దక్కువసేయ నన్నక్రియ దండడి నెందును పేర్చి పెల్లగా
నొక్కట నీరు గ్రోలెడుఁ బయోదసముచ్చయముల్ పయోనిధిన్.

సీ. సిరిపుట్టినిల్లు రాజీవలోచను సెజ్జ
పట్టు మహీకాంత కట్టుచీర
గిరులు డాఁగెడు గొంది గిరిభేది పగఱకు
బలుకోట బడబాగ్ని బ్రదుకుచోటు
పటుపయోధరములపాలి ప్రపాసీమ
యమృతాంశుపాడవున కనుగలంబు
మరియాదలకు గుఱి మహిమల కందువ
యఖిలరత్నములకు నాకరంబు

గీ. సురత భవనంబు వాహినీసుందరులకుఁ
గూర్మి నిల్కడ గంభీరగుణము నెలవు
తనరునొప్పిదముల కెల్లఁ దానకంబు
వనధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె?

నృసింహపురాణము.

## చింతనాంశము.

ఉ. అన్న! కుమారచంద్ర! తగునయ్య? నిరంతరదుఃఖవార్ధిలో
నన్నిటు ముంచి యీవిధమునన్ భయదాటవులం దశంబు సే
యన్నడ తెంచి తిట్టినిను నన్యులు మెత్తురె? పిన్నబిడ్డలన్
వెన్నుఁడు మెచ్చి యెన్నఁ డొసఁగెన్ వరముల్ నినువంటివారికిన్?

శా. ఆరం బండినపైరు పోనిడిచి దుర్వ్యాపారచిత్తంబుతో
ఘోరారణ్యములోన మ్రోడు నఱకన్ గొడ్డండ్లు సేయించిన
ట్లీరాజ్యంబు సమస్తము న్విడిచి నీ వేలా తపోనిష్ఠకున్
జేరన్ వచ్చితి భావికాలఫలముల్ చింతించి సత్పుత్రికా!

ఉ. దట్టపు లజ్జతో సవతితల్లి దురుక్తుల నెమ్మనంబునం
బెట్టి విరక్తి పుట్టి పటుభీషణ వృత్తిఁ జరింప నేల? నీ
కిట్టి చలంబు చాలఁగల దేని మహీతల మెల్ల నేలఁగాఁ
బట్టము గట్టు నేర్పున కుపాయ మెఱింగితి రమ్ము పుత్త్రికా!

శా. నోముల్ పెక్కులు నోఁచి యాజ్ఞ్యవ్రతతపోనుష్ఠానకర్మంబు లు
ద్దామప్రీతి నొనర్చి సత్సుతుని గాఁ దండ్రీ నినుం గాంచితిన్
నామాట ల్వినుము రాజ్యభోగములకున్ రమ్మింక రాకుండినన్
నీమీఁదన్ బడి ప్రాణము ల్విడిచెదన్ నిక్కంబుగా నిచ్చటన్.

విష్ణుపురాణము.

సీ. సాధకీలితరత్నశకల మొక్కటి చాలు
భాస్కరతేజంబుఁ బరిహసింపఁ
బొలుపొందు నవచూతభూజ మొక్కటి చాలు
నఖిలలోకముల కిష్టార్థ మొసఁగ
నభినుతింపఁగను వామాక్షి యొక్కతె చాలుఁ
గ్రతుభోజనాంగనాగర్వ మడఁప
బరికింప నచ్చోటిపురుషుఁ డొక్కఁడె చాలు
నస్మదాదుల కనిత్యతను దెలుప

గీ. మహిమతో ని ట్లలోకసామాన్యధర్మ
ములకుఁ దానక మయ్యుఁ బ్రమోద మొంపవ
వివిధపరిపూర్ణమై నిత్యవిభవములకుఁ
దానకంబన విలసిల్లుఁ దత్పురంబు.

మత్స్యపురాణము.

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బనరించి ఘనంబుగ విత్తమింతయే
నీని తెలంగఁగానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁ డని కాక త్రిశార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే ?

భాగవతము.

## వితర్కాంశము.

ఉ. కర్మము చూడఁగాఁ బురుషకారమె యౌ నని కొందఱందు రీ
కర్మము దైవమంచు నిదికాదు స్వభావమటంచుఁ గొందఱీ
కర్మమురీతిఁ బల్కుదురుగా! యిఁకఁ బౌరుష దైవకర్మముల్
పేర్మి ఫలప్రవృత్తికటు పేర్చు స్వభావము తాను చెప్పుడున్.

చ. ఇదియిటు లౌను గాదిదిటు లియ్యవి రెండునుగావు రెండు నా
సదమలరీతిఁ జెప్పుడు సత్త్వయుతుల్ సమదర్శనుల్ కృపా
హృదయులునైన మీరిజను లీవిధిఁ జెప్పుడు రిట్లు భూత సౌ
ఖ్యదుఁడగు శంకరోద్భవుఁ డఖండచమత్కృతిఁ జేసె పృష్టులన్.

బ్రహ్మాండపురాణము.

పై పద్యములనుబట్టియే పురాణములయందలి ధారాళధోరణి గ్రహింప నగునై యున్నను, మఱికొన్ని ప్రాచీనాంధ్రపురాణముల యందు సహిత మెంతపదలాలిత్యము, ఎంతశయ్యాసంపద, మెచ్చులు గుల్కుచు వచ్చుపడి యున్నదో, యీక్రింది పద్యములను బట్టియు విస్పష్టము కాఁగలదు.

ఉ. మిక్కిలి శీతలాంబువులు మేనికిఁ గీడు మహోష్ణవారిచేఁ
బొక్కు శరీర మీయుభయమున్ దొరలించిన నింపొనర్చు ని
ట్లొక్కనయంబ యొండె భయ మొండె నొనర్పక తద్వ్యయంబుఁ దా
నిక్కువెతింగి చూపుమనుజేంద్రునకున్ హితులౌదు రందఱున్.

చ. ఘనతరకష్టలోభిఁ దమకంబునఁ జంపెదనంతయుల్క నె
మ్మనమునఁ బుట్టెనేని విషమారణకర్మకృపాణముఖ్య సా
ధనములు గూర్పనేల? ప్రమదంబున డగ్గఱి కానుపీస మి
మ్మనుటయ చాలు వాని నిమిషార్ధమునన్ మృతినొందఁ జేయఁగన్.

వరాహపురాణము.

ఉ. ఆతరుణీలలామకుఁ బ్రియంబుగ వే చని కాంచె వాజగ
త్పూతము నక్షయార్తి పరిభూతివిధానసమర్థ సత్ఫల
వ్రాతము నవ్యపుష్పమకరందవిలోలుపమత్తషట్పదో
పేతము దత్తనిర్జరసమీహితజాతముఁ బారిజాతమున్.

పద్మపురాణము.

ఉ. ఇంద్రుఁడ వీవు దుఃఖపడ నేటికిఁ గౌశికమౌనిచేయు ని
స్తంద్రతపంబు మాన్పుటకు శక్యము గా దన నేల ధీరతన్
రుంద్రమతిన్ సుఖింపుము నిరూఢిగ నే నిదె చక్కఁ జేసెదన్
జంద్రముఖీవిలోకనము సంగతిఁ జొక్కరె యెట్టివారలున్ ?

వాయుపురాణము.

మ. ఇతఁడా శ్రీగిరిమల్లికార్జునుఁడు సామీ! తప్ప కాగాయె నీ
మతిలో నేమి తలంచి దైవ మని సంభావించి కాన్పింపఁ జా
చితి? నే వెఱ్ఱిని గాను వేలుపని దర్శింపంగ నాతోడ నా
చతురత్వంబులు? చాలు! దేవునిఁక దాఁచంబోక కాన్పింపవే.

చెన్నబసవపురాణము.

ఉ. శాంతులు నీతిపారగులు సభ్యు లహింసకు లప్రమత్తు లా
గంతుకు లాహితాగ్ను లుపకారులు కోవిదు లప్రతిగ్రహుల్
దాంతులు పావనుల్ పరమధార్మికు లాశ్రితు లీశ్వరార్చన
స్వాంతులు సత్యవాదు లనవద్యులు పంక్తికి యోగ్యు లారయన్.

కూర్మపురాణము.

---

# పురాణమణిమంజరి.

## భారతము - ఆదిపర్వము.

---

### (1.) ఉదంకుండు పౌష్యమహాదేవికుండలంబులం దేఁ బోవుట.

వ. అయ్యుదంకుండు గురుహితకార్యధురంధరుం డయి గురుపత్నీనియోగంబునం బౌష్యుం డను రాజుదేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరం బోని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్కదివ్యపురుషుం గని వానిపనుపున వృషభగోమయభక్షణంబు సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతిత్వరితగతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె. 1

తే. ఏను గుర్వర్థ మర్థినై మానవేశ!,
కడఁగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్కఁ
దండితారాతి! నీదేవికుండలమ్ము,
లిమ్ము నాపూన్కి యిది సఫలమ్ము గాఁగ. 2

వ. అనినం బౌష్యుం డిట్టిమహాత్మునకుఁ గాంచితిఁ గృతార్థుండ నైతి నని మనంబున సంతసిల్లి యుదంకున కిట్లనియె నయ్యా మదీయధర్మపత్ని యక్కుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొ మ్మనిన నుదంకుం డంతఃపురంబునకుఁ జని పౌష్యమహాదేవిం గానక క్రమ్మఱి పౌష్యుపాలికి వచ్చి నీదేవి నెందును గానక యిట వచ్చితి నీవ యక్కుండలంబులు దెప్పించి యిమ్మనిన నుదంకునకుఁ బౌష్యుం డిట్లనియె. 3

క. భూవినుత! నిన్నుఁ ద్రిభువన,పావను నశుచివని యెట్లు పలుకఁగ నగున
ద్దేవి పవిత్ర పతివ్రత, గావున నశుచులకుఁ గానఁ గా దనవద్యా. 4

వ. అనిన విని యుదంకుం డప్పుడు దలంచి యావృషభగోమయభక్షణంబున
నైన యశుచిభావంబునఁ గాకేమి యప్పరమపతివ్రత మదీయదృష్టిగోచర
గాకున్న దయ్యె నని పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం బ్రక్షాళిత
పాణిపాదవదనుం డయి యాచమించి పౌష్యానుమతంబున నద్దేవి
యొద్దకుం జనిన నదియును నమ్మహామునికి నమస్కరించి కుండలమ్ము
లిచ్చి యిట్లనియె. 5

క. తక్షకుఁ డీకుండలము ల,పేక్షించుచు నుండు వాఁ డభేద్యుఁడు మాయా
దక్షుండు వానివలన సు,రక్షితముగఁ జేసి చనుము రవినిభతేజా! 6

వ. అనిన నుదంకుం డట్ల చేయుదు నని యద్దేవి వీడ్కొని రాఁ బౌష్యుం
డయ్యా! నీ వతిథివి మాయింటఁ గృతభోజనుండవై పొమ్మని క్షణి
యించిన నొడంబడి యుదంకుండు గుడుచుచో నన్నంబు కేశదుష్టం
బైన రోసి కరం బలిగి యిట్లపరీక్షితం బైనయశుద్ధాన్నంబు పెట్టి
నాఁడ వంధుండ వగు మని శాపం బిచ్చిన నల్పదోషంబున నాకు
శాపం బిచ్చినవాఁడవు నీ వనపత్యుండ వగు మని ప్రతిశాపం బిచ్చిన
నుదంకుండు నే ననపత్యుండఁ గానోప దీనిం గ్రమ్మఱింపు మనినఁ
బౌష్యుం డిట్లనియె. 7

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రితుల్యము జగన్నుత విప్రులయందు, నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్. 8

## తక్షకుండు కుండలంబు లపహరించుట.

వ. కావున నాకశక్యంబు నీయిచ్చినశాపంబు గ్రమ్మఱింప ననిన నుదంకుం
డట్లేని నీకు నల్పకాలంబున శాపమోక్షం బగు నని పౌష్యునకు ననుగ్ర

హించి మగిడి పోవునెడ గురుపత్నికిఁ గుండలంబు లీఁగంటి నని మనంబున
సంతోషించి చనువాఁ డెదుర నొక్క జలాశయంబు గని శుచిప్రదే
శంబునఁ దన చేతికుండలంబులు పెట్టి యాచమించు చున్నంతఁ దన
తోడన వచ్చి తక్షకుండు నగ్నవేషధరుం డై యక్కుండలంబులు గొని
పాఱిన నుదంకుండును వానిపిఱుందన పాఱి పట్టికొనుడు. 9

క. విడిచి దిగంబరవేషము, విడువక మణికుండలములు విషధరపతి యే
ర్పడ నిజరూపముతో న,ప్పుడ యహిలోకమున కరిగె భూవివరమునన్.

వ. ఉదంకుండును వానితోడన తగిలి యవ్వివరంబున నురగలోకంబున
కరిగి నాగపతుల నెల్ల నిట్లని స్తుతియించె. 11

చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీధర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ జాయక శయ్య యైనయ
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

చ. అరిదితపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁ గాచినమహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయినవాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 13

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాపసం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులు నైనమహానుభావు లై
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్. 14

ఉ. గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁ డై
ధాత్రిఁ బరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్ 15

వ. అని యిట్లు నాగకులంబు నెల్ల స్తుతియించి, యందు సితాసితతంతుసంతాన
పటంబు ననువయించుచున్నవారి నిద్దఱ స్త్రీలను ద్వాదశారచక్రంబుం
బరివర్తింపించుచున్న వారి నార్వురఁ గుమారుల నతిప్రమాణ తురం
గంబు నెక్కినవాని మహాతేజస్వి నొక్క దివ్యపురుషుం గని విపులార్థ
వంతంబు లైనమంత్రంబుల నతిభక్తియుక్తుండై స్తుతియించినం
బ్రసన్నుండై యద్దివ్యపురుషుం డయ్యుదంకున కి ట్లనియె. 16

క. మితవచన! నీయథార్థ, స్తుతులఁ గతిప్రీతమానసుఁడ నైతి ననిం
దితచరిత! నీకు నభివాంఛిత మెయ్యది దానిఁ జెప్పుము చేయుదు ననినన్.

వ. ఉదంకుండు గరంబు సంతసిల్లి యిన్నాగకులం బెల్ల నాకు వశం బగు
నట్టులుగా ననుగ్రహింపు మనిన నప్పురుషుం డట్లేని నీయశ్వకర్ణరంధ్ర
ధ్మానంబు సేయు మనిన నట్లె యని తద్వచనానురూపంబు సేయుడుఁ
బత్త్రిణంబు. 18

శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథుమనముల్ భేదిల్లెఁ గల్పాంతసం
జాతప్రోత్థితబాడబానలశిఖాశంకాధికాతంక మై. 19

తక్షకుండు కుండలంబులం దెచ్చి యుదంకున కిచ్చుట.

క. శంకరనిభుఁ డగు విప్రుభ,
యంకరకోపాగ్ని యొక్కొ యనుచును జాతా
తంకుఁ డయి కుండలంబు లు,
దంకునకును దెచ్చి యిచ్చెఁ దక్షకుఁ డంతన్. 20

## (2) దుష్యంతమహారాజు చరిత్రము.

వ. అత్రసునకుఁ గాళింది యనుదానికి నీలుండు పుట్టె వానికి రథంతరి యను
దానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్యసాధారణగుణయుక్తుండై. 1

క. బాలవారణములఁ బట్టెడు, లీలను వివమాటవీచలితకేసరిశా
ర్దూలేభశరభములఁ దన, బాలత్వమునంద యొగిచి పట్టుచుమఱియున్.2

క. ఉర్వీరుహనివహముతోఁ, బర్వతములు వెఱికి యొండుపర్వతములపైఁ
బర్వఁగ వైచుచు యౌవన,గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుం డై.3

శా. ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగమ
ర్యాదాలంకృత మైనభూవలయ మాత్మాయత్త మై యుండఁగా
నాదిత్యాంశుసమీరదుర్గమమహోగ్రారణ్యదేశాళితో
నాదిక్షత్త్రచరిత్ర నేలె నజితుం డై బాహువీర్యంబునన్. 4

క. ఆతనిరాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో
కాతంకక్షయశంకా,పేతం బై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్. 5

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థి యయి యాదిత్యహ
యంబులకంటె వడిగలవాహంబులు పూనినరథం బెక్కి యాజానేయ
తురంగారూఢు లైనయాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశస్త్రహ
స్తకృపాణపాణులయిన వీరభటసహస్రంబులతోఁ జని వనంబున నమ్మృ
గంబులం జుట్టుముట్టి. 6

క. కలయఁగ నార్పును బొబ్బయు,
నులివున నవ్విపిన మనుమహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంతిమహా,
బలమందరనగము సత్త్వభయజననం బై. 7

క. సరభసపరిచలితమహా, శరభ ద్విపరిపు వరాహశార్దూల మన
ద్విరదాదిప్రకరభయం, కరవనమధ్యమున నృపతి గడుఁ గడిమి మెయిన్.8

క. ఒసరిలి సఱచుమృగముల, నేసియు డాసినమృగముల నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా,వ్యాసక్తి నపారఘోరవన్యమృగాలిన్.9

వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపెడువేడుక నతిదూరంబున కరిగిన
నాతనిరథవేగంబు ననుగమింప నోపక యధికక్షుత్పిపాసాపరవశు

లయి పదాతు లయ్యాయుప్రదేశంబుల విశ్రమించి రంత దుష్యంతుండు
కతిపయామాత్యపరిజనపురోహితసహితుండై కొండొకవేల యరిగి ముం
దట నొకపుణ్యనదీతీరంబున వివిధసురభికుసుమఫలభారవినమ్రతరు
లతా గుల్మపరిశోభితం బయినయొక్కవనంబు గని. 10

క. అమరపతిఖాండవమునకు,
రమణను వైశ్రవణుచైత్రరథమునకు సమా
నముగా దీనిని భూభా,
గమునకు రచియించెనొక్కొ కమలజుఁడు దయన్. 11

వ. అని దానిరమణీయభావంబుఁ బొగడుచుఁ జనుదెంచి యవ్వనంబు
సొచ్చునప్పుడు. 12

చ. అతిరుచిరాగతుం డయినయాతనికిన్ హృదయప్రమోద మూ
తతముగ నవ్వనంబునలతాలలనల్ మృదులానిలాపవ
ర్జితకుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్టి రైరి సం
పతదళినీనినాదమృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్. 13

వ. మఱియును. 14

క. కాఁడవిఁ బలుచుమృగముల, నాఁడకం దిరిగి డస్సియున్నతనిశ్రమం
బాఁగఁ బెడఁ బరితాపము, దీఁగఁ బై వీచె వన్నదీపవనంబుల్. 15

మానిని. ఏచి తనర్చి తలిర్చినక్రొవ్వుల నిమ్మగుమావుల సొంపములం
బూచినమంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదఁగులం
గాచి తెడంగుగఁ బండినయాసహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కిం పెసఁగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్. 16

కవిరాజవిరాజితము.

చని చని ముందట హవ్యహవిర్ఘృతసౌరభధూమలతాతతులం
తొవఁగినక్రూఁకులకొమ్మలమీఁద నపేతలతాంతము లైనను గా

యనిమధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెంతయుఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్రనివాసము దా నగు నంచు నెదన్. 17

వ. ఇట్లు హృదయసుఖావహంబగుచున్న యవ్వనంబులో నరిగియరిగి యనవరత
మహాద్విజపఠ్యమానపదక్రమవేదధ్వనులను నవిచ్ఛిన్న హూయమానా
గ్నిహోత్రస్వాహాశబ్దంబులను ననేకమునిగణప్రణీతవచనవిషయవిభాగ
వినిర్ణయన్యాయనిపుణవిద్వత్సంభావణఘోషంబులను బ్రతిపక్షదుర్విభే
దప్రమాణవిచార్యమాణవేదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులనుం జేసి
శ్రోత్రియంబు యజ్ఞప్రయోగప్రవీణులైన యాజ్ఞికులకును విహితానుష్ఠా
నాసక్తు లయినయనుష్ఠాతలకును నధికతపోనిరతు లయినమహాతపోధ
నులకును నివాసంబయిన పుణ్యనదీతీరంబునం దద్దయు రమ్యం బయి
గంగాతీరంబున నరనారాయణస్థానంబునుంబోలె జగత్పావనం బగు
చున్న కణ్వమహామునియాశ్రమంబు గని యందు. 18

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు,
చదివెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండుకరులును గరికర,
శీతలచ్ఛాయఁ దచ్చికరాంబు
కణములచల్లనిగాడ్పాసపడి వానిఁ,
జెంది సుఖంబున్న సింహములును
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి,
పెట్టునీవారాన్నపిండతతులు

తే. గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు,
చున్నయెలుకలుఁ బిల్లులు నొండొరులసహజ
వైరివర్గంబులయుసహవాస మపుడు,
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది. 19

వ. ఇక్కాశ్యపుం డైనకణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నా
వచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. 20

చ. ఎలయునమాత్యులం దగినవారల నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజదళాయతాక్షి సం
కలమిళితాళినీలపరికుంచితకోమలకుంతలన్ శకుం
తల యనుకన్యకం గనియెఁ దన్మునివల్లభుమందిరంబునన్. 21

వ. అదియును ననంతవిలాసంబున జయంతుంబోనిదుష్యంతు నెఱింగి య
తిసంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలం బడిగి
యున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనియె. 22

ఉ. క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి మెందుఁ బోయిరొకొ వా రనినన్ విని యాలతాంగి వా
రిచ్చటనుండి యాక్షణమ యేఁగిరి కానకుఁ బండ్లు దేర మీ
వచ్చు టెఱింగిరేని జనవల్లభ ! వారును వత్తు రింతకున్. 23

వ. వారు వచ్చునంతకు నొక్కముహూర్తం బుండునది యనిన విని య
క్కోమలివినయంబునకు మృదుమధురవచనంబులకు సంతసిల్లి దానిం గన్య
కఁగా నెఱింగి మనోజరాజ్యలక్ష్మియుంబోని దానిసర్వలక్షణలక్షితంబు ల
యినసర్వావయవంబులుం జూచి సంచలితహృదయుండై నీవెవ్వరికూఁతు
ర విట్టిరూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరి విందుల కేల వచ్చి త
ని యడిగిన నది యి ట్లనియె. 24

## శకుంతల దుష్యంతునకుఁ దనజన్మక్రమం బెఱింగించుట.

క. జగతీవల్లభ ! యే న,త్యగణితధర్మస్వరూపుఁ డని జనములు దఱ్
బొగడఁగ జగదారాధ్యుం, డగుకణ్వమహామునీంద్రునాత్మజ ననినన్. 25

చ. ఇది మునికన్యయేని మతియేలొకొ యీలలితాంగియందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పుడు కింకను నమ్మ నేరవ

ర్యాద విజితేంద్రియుం డనఁగ నిమ్మనిఁ బాయక యుండు నట్టి కాం
ఎది కలరూ వెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాకుమాయురా 26

వ. ఇట్లు దుష్యంతుం డాశకుంతలజన్మం బెఱుంగ వేఁడి వెండియు దాని
కి ట్లనియె. 27

తే. ఉత్తమాశ్రమనిష్ఠితుఁ దూర్ధ్వరేతుఁ,
డైనకణ్వమహాముని యనఘచరితుఁ
డట్టిముని కెట్లు గూఁతుర వైతి దీని,
నాకు నెఱుఁగఁగఁ జెప్పుము నలిననేత్ర. 28

వ. అని యడిగిన నారాజునకు శకుంతల యి ట్లనియె. 29

క. ఇక్కమలాక్షి శకుంతల,
యొక్కఁడిచుది దీనిజన్మ మెవ్విధ మని త
న్నెక్కఁ మునినాథుఁ డడిగిన,
నిక్కౌశ్యపు లర్షిఁ జెప్పి రేను వినంగన్. 30

వ. నాజన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పినవిధంబు చెప్పెదఁ
జిత్తగించి విను మని యాదుష్యంతునకు శకుంతల యి ట్లనియె. 31

సీ. అనఘుఁడు రాజర్షి యై తపశ్శక్తి మై, బ్రహ్మర్షిభావంబుఁ బడసి యున్న
నన్మునీశ్వరుఁడువిశ్వామిత్రుఁడతిఘోరతపము సేయుచునున్నఁ దత్తపమున
కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరోగణములలో నగ్రగణ్య యైన
దాని మేనక యనుధవళాక్షిఁ బిలిచి విశ్వామిత్రుపాలికిఁ జని తదీయు

ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నా దైన,
దేవరాజ్యమహిమఁ దివిరి నీవు
గావు మనిన నదియుఁ గడుభయంపడి యమ,
రేశ్వరునకు మ్రొక్కి యిట్టు లనియె. 32

చ. వనజభవప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్యశోక మ
న్వననిధిలోన ముంచినయవారితసత్త్వుఁడు నిమ్నఁ దొట్టియా

యనిమిషు లెల్ల వానికి భయంపడు చుండుదు రట్టియుగ్రకో
పనుకడఁ జిప్ప డేఁగు మని పాడియె యిప్పని నన్నుఁ బంపఁగన్. 33

ఉ. అమ్ముని యల్గి చూచుడును సాక్షణమాత్రన గోత్రధారుణీ
ధ్రమ్ములు వ్రయ్య నయ్యెసుము దక్కఁగ నంబుధు లింకు మూఁడులో
కమ్ములు దిద్దిరం దిరుగు గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బిమ్మినయట్టికోపపరుపాలికి భామలు వోవ నోడరే. 34

వ. అయినను నానేర్చువిధంబున నమ్మునివరుచిత్తంబు మెత్తపఱచి చిత్త
జాయత్తం బగునట్లుగాఁ జేసెద నని వాసవు వీడ్కొని మేనక తనకు
మందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి హిమవత్పర్వతప్రదేశంబునం
దపంబు సేయు చున్న విశ్వామిత్రుతపోవనంబు సొత్తెంచె నంత.

క. చల్లనిదక్షిణమారుతి, మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాధ
మ్మిల్లకుసుమాంగరాగస,ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్. 36

చ. అనిమిషకాంతయున్ నవలతాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలస విలాసగతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వరప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతిసం
జననమహాతపశ్చరణసంయతచిత్తు నిరస్తచిత్తజున్. 37

క. అంబుజలోచన గని వినయంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయవ్యా,జంబున విహరించుచుండె సఖులుం దానున్. 38

చ. అలసతి యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుమ్రోల నున్న నా
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి చాలపై
వలు వెడలన్ బయల్పడియె సల్లకుచంబులుఁ గక్షయుగ్మముల్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్. 39

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ, గందర్పనిశాతసాయకంబులు వెలుచన్
డెందముఁ గాఁడిన ధృతి సెడి, కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్.

వ. మేనకయు విశ్వామిత్రుసిష్టంబునకుం దగినకామోపభోగంబులం బెద్ద

కాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక పుట్టిన దీని మాలిని యనునొక్కయేటి పులినతలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె విశ్వామిత్రుండును దపోవనంబునకుం జనియె నంత నమ్ముని ప్రభావంబున. 41

ఆ. చెలఁగి లేఁత సేయుచిఱుతుకదానిఁ గ్ర,
వ్యాదఘోరమృగము లశనబుద్ధిఁ
బట్టకుండఁ బెట్టుపలఁ గప్పి రక్షించు,
గాని శకుంతతతులు గూడి యుండె.

వ. అంత నేను శిష్యగణంబులతోడ సమిత్కుసుమఫలాహారణార్థంబక్కడకుం జని యమ్మాలినీపులినతలంబున శకుంతరక్షిత యై యున్నకూఁతు నత్యంతకాంతిమతి నవనీతలంబున కవతరించినతరుణశశిరేఖయుం బోని దాని నెత్తికొని వచ్చి శకుంతరక్షిత యవుటం జేసి శకుంతల యనునామం బిడి కరంబు గారవంబునం బెనిచితిమి. 43

మధురాక్కర. తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత
యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురువులు వీర
లనఘ! యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబును గురువులు 44

వ. అనం బరఁగినశాస్త్రార్థంబున నేను దీనికి భయత్రాతను నగుటం జేసి గురుల మిదియును మాచే నభివర్ధిత యగుటం జేసి మాకు హృదయానందిని యైనకూఁతురనిక ణ్వమహాముని యమ్మునికిం జెప్పినవిధంబంతయు పవిస్తరంబుగా శకుంతల చెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున. 45

దుష్యంతుండు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట.

చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిష్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్త్రి యని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద యెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పు డుండ నా
స్పద మయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్. 46

వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయందు దత్కోమలాంగి
యనురాగం బుపలక్షించి యి ట్లనియె. 47

క. ఈవల్కలాజినములకు, నీవన్యఫలాశనముల కీవిటపకుటీ
రావాసములకు నుచితమె, నీవిలసితరూపకాంతి నిర్మలగుణముల్. 48

ఉ. ఈమునిపల్లె నుండు టిది యేల శరం బనురాగ మొప్పఁగా
భామిని! నాకు భార్య వయి భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగ నందు మనిందితేందుపా
దామలతుంగహర్మ్యముల హారిహిరణ్మయకుట్టిమంబులన్. 49

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రా,
జాపత్యమును రాక్షసంబు నాసు
రంబు గాంధర్వంబు రమణిఁ బైశాచంబు,
నను నెనిమిదివివాహములయందుఁ,
గడుఁ బ్రశస్తములు సత్క్షత్రియవంశ్యులకు గాం,
ధర్వరాక్షసములు ధర్మయుక్తి,
నీకును నాకును నెమ్మిఁ బరస్పర,
ప్రేమంబు గాముండు పెంపఁ దొడఁగెఁ

ఆ. గాన నెడయఁ జేయఁగా నేల గాంధర్వ,
విధి వివాహ మగుట వినవె యుక్తి.
మనిన లజ్జఁ జేసి యవనతవదన యై,
యాలతాంగి యిట్టు లనియెఁ బతికి. 50

క. కరుణానిరతులు ధర్మ,స్వరూపు లింతకు మదీయజనకులు సమదెం
తురు వారు వచ్చి నీ కి,చ్చిరేని పాణిగ్రహణము చేయుము నన్నన్.

వ. అనిన దానికి దుష్యంతుం డిట్లనియె. 52

తే. తనకు మతి తాన చుట్టంబు దాన తనకు,
గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ
వనజనేత్ర! గాంధర్వవివాహ మతిర,
హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు. 53

వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు సెప్పి శకుంతల నొ డంబఱిచిన నది యి ట్లనియె. 54

చ. నరనుత ! నీప్రసాదమున నా కుదయించినసందనుక్ మహీ
గురుతరయౌవరాజ్యమునకుక్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు మెన్నితో
నిరుపమదాన! య ట్లయిన నీకును నాకును సంగమం బగున్. 55

వ. అనిన విని శకుంతల కంతయు సంతోషంబుగా దానికోరినవరం బిచ్చి గాంధర్వవివాహంబుననభిమతసుఖంబులనుభవించియకొల్లమలివీడ్కొని నిన్నుఁ దోడ్కొని రా నస్మత్పౌ్రధానవర్గంబుఁ గణ్వమహామునివా లి కిం బుత్తెంచెద నని యూఱడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం జనియె నిట శకుంతలయుఁ దనచేసినదాని మునివరుం డెఱింగి యలిగె డునో యని వెఱచుచుండె నంత నమ్మహాముని వనంబుననుండి కందమూ లఫలంబులుగొని చనుదెంచి లలితశృంగారభావంబునలజ్జావనతవదనయు నతిభీతచిత్తయునై యున్నకూఁతుంజూచితనదివ్యజ్ఞానంబున నంతవృత్తాం తంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వవివాహంబువిధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కి ట్లనియె. 56

తే. తల్లి! నీకులగోత్రసౌందర్యములకుఁ,
దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె నీదుగర్భమునవాఁ డఖిలభువన
వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుతుఁ్డు. 57

వ. నీధర్మచరితంబునకు మెచ్చితి నీవు గోరినవరం బిచ్చెద వేఁడు మనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మువునంద తగిలి యుండను నా కు ద్భవిల్లెడుపుత్త్రుండు దీర్ఘాయురైశ్వర్యబలసమన్వితుండును వంశకర్త యుఁ గాను వలయు ననిన నమ్మహాముని కరుణించి దానికోరినవరం బి చ్చి యథాకాలవిధుల గర్భసంస్కారరక్షణంబులు సేయించి యు న్నంత వర్షత్రయంబు సంపూర్ణంబైన శకుంతలకు భరతుం డుదయించి

కణ్వనిర్వర్తితజాతకర్మాది క్రియాకలాపుం డయి పెరుఁగుచుఁ గరతలా
లంకృతచక్రుండును జక్రవర్తిలక్షణలక్షితుండును సింహసంహననుండును
దీర్ఘబాహుండును ననంతజవసత్త్వసంపన్నుండును నై పరఁగుచు. 58

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరుచు వారాహ వ్యాళ శార్దూల ఖ
డ్గ మదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంతభూ
జములం దోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవక్రీడలన్. 59

వ. ఇట్లు వనంబులోనిసర్వసత్త్వంబులను దనమహాసత్త్వంబునం జేసి దమి
యించుచున్న యాతనిం జూచి యాశ్చర్యం బంది యందఱును నెల్ల
వాతనికి సర్వదమనుం డనునామంబుఁ జేసిరి కణ్వమహామునియు న
క్కుమారు నుదారతేజోరూపవిక్రమగుణంబులకు సంతసిల్లి వీఁ డఖిలభు
వనయౌవరాజ్యాభిషేకంబునకు సమర్థుం డగు నని విచారించి యొక్క
నాఁడు గూఁతున కిట్లనియె. 60

ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను,
నెద్దకాల మునికి తద్ద తగదు
పతులకడన యునికి సతులకు ధర్మువు,
సతుల కేడుగడయుఁ బతుల మావె. 61

## కణ్వమహాముని శకుంతలను దుష్యంతుపాలికిం బంపుట.

వ. కావున నీవిక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగుమని మహాతపో
ధనులైనశిష్యులం గొందఱఁ దోడు పంచిన శకుంతలయు దౌష్యంతిం
దోడ్కొనిదుష్యంతుపాలికి వచ్చి సకలసామంతమంత్రి పురోహిత
ప్రధాన పౌరజనపరివృతుండై యున్నయారాజుం గనుంగొని. 62

క. గురువాశ్రమంబునను ను,
న్నరుదుగఁ బతివలనఁ గనినయనురాగము నా

దరణము నను గ్రహింబును,
గరుణయు సంభ్రమము నపుడు గానక యెదలోన్. 63

క. ఎఱుఁగఁడో కొ నన్నా నెఱిఁగియు,
నెఱుఁగనియట్లుండునో కొక్కొ యెడ దవ్వగుటన్
మఱచెనో కొ ముగ్ధ లధిపులు,
మఱచెరె బహుకార్యభారమగ్నులు గారే. 64

చ. తలఁపఁగ నాఁడు పల్కినవిధం బెడఁ దప్పఁగఁ జూచెనో కొక్క చూ
డ్కులు విరసంబులై కరము క్రూరములైననిమిత్తమేమియో
కలయఁగఁ బల్కరించి రుపకారులు నై రని నమ్మియుండఁగా
వలపదు బుద్ధిమంతులు నవ ప్రియులైనధరాధినాథులన్. 65

వ. అని తలంచి చింతాక్రాంతయై శకుంతల వెండియు నాత్మగతంబున. 66

క. మఱచినఁ దలఁపింపఁగ నగు,
నెఱుఁగనివాఁ డెల్లపాట్లు నెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని,
కఱటిం దెలుపంగఁ గమల గర్భునివశమే. 67

వ. అయినను వచ్చి మిన్నక పోవం గాదు కావున నాపూర్వవృత్తాంతంబెల్ల నెఱింగించి యే నిక్కువారుం జూతు నని మనంబున నిశ్చయించి శకుంతల యారాజున కిట్లనియె. 68

క. జననాథ ! వేఁటనెపమున,
గానని కణ్వాశ్రమమునకున్ వచ్చి ముదం
బున నందు నాకు నీయి,
చ్చినవరము దలంపవలయుఁ జిత్తములోనన్. 69

క. బాలార్కతేజుఁ డగునీ,
బాలుఁడు నీకొడుకు వీనిఁ బౌరవకులర
త్నాలంకారు నుదారగు,
ణాలయు యువరాజుఁ జేయు మభిషేకములోన్. 70

వ. అనిన విని దుష్యంతుండు దాని నంతయు నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె ని ట్లనియె. 71

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి,
దానవో మిన్నకయ యనుచితంబులు పలుకం
గా నేల యరుగు మంబురు,
హానన! యొందుండి వచ్చి తందులకు వశిన్. 72

వ. అనిన విని వెలవెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కొందమ్మిరేకులవలనఁ దొరంగుజలకణంబులపోలెఁగోపారుణితనయనంబులబాష్పకణంబులు దొరఁగం దలవాంచి యారాజుం గటాక్షించుచు హృదయసంతాపంబు దన కుఁదాన యుపశమించుకొని, పెద్దయుంబ్రొద్దు చింతించి శకుంతల యా రాజున కి ట్లనియె. 77

ఆ. ఏల యెఱుక లేనియితరులయట్ల నీ,
వెఱుఁగ ననుచుఁ బలికె దెఱిఁగి యెఱిఁగి
యేన కాని దీని నెఱుఁగ రిం దొరు లని,
తప్పఁ బలుక నగునె ధార్మికులకు. 78

చ. విమలయశోనిధీ పురుషవృత్త మెఱుంగుచు నుండుఁ జూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్యహోపదా
ర్థము; లివి యుండఁగా నరుఁడు దక్కొనఁ జేర్చునె తన్ను బ్రుచ్చిలన్.

క. నాయెఱిఁగినట్ల యున్నియు,నీయిచ్చినవరము ధారుణీవర! యెఱుఁగున్
నాయందుఁ దొంటియట్టుల, చేయు మనుగ్రహ మవజ్ఞ చేయం దగునే.

క. సతియును గుణవతియుఁ బ్రజా,
వతియు నను వ్రతయు నైనవనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచునతిదు,
ర్గతి పాపముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 81

క. సంతతగృహమేధిఫలం,
బంతయుఁ బడయంగ నోపు ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా,
వంతుఁడు దాంతుండుఁ బుత్త్రవంతుండు నగున్. 82.

వ. మఱియును. 83.

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు,
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ,
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేకకారణం బున్నత,
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ,
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

ఆ. తెట్టిఘట్టములను నెట్టియాపదలను,
నెట్టితీఱములను ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను,
నొనరఁ జూడఁ గనినజనుల కెందు. 84

వ. మఱియు భార్య పురుషునం దర్ధం బగుటం జేసి పురుషునకు మున్న పరేత యైనపతివ్రత పరలోకంబునం దన పురుషుం గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుఁ దనకు మున్న పురుషుఁడు పరేతుం డైనఁ బదంపడి తాను బరేతయై తనపురుషుంగూడ నరుగు నట్టిభార్యనవమానించుట యధర్మంబు మఱియునుంబురుషుఁడు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లుఁ గావున నఙ్గా దఙ్గా త్సమ్భవసి యను నిది యాదిగాఁ గలవేదవచనంబులయందును జనకుండును బుత్త్రుండు నను భేదంబు లేదు. 85

క. విను గార్హపత్య మనువ,
ల్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్ల వెలుఁగును,
జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్. ౮౬

క. తాన తననీడ నీళ్లల,
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత! త
త్సూను జనకుండు సూచి మ,
హానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్. 87

వ. పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్రః యనువేదవచనంబు గలదు
గావునఁ బుణ్యాచారుం డయినపుత్త్రుం డుభయపక్షంబులవారి నుద్ధరిం
చుఁ గావున. 88

క. నీపుణ్యతనువువలనన, యీపుత్త్రికిఁ దుద్భవిల్లె నెంతయు నొప్పన్
దీపంబువలన నొండొక, దీపము ప్రభవిల్లినట్లు తేజం బెసఁగన్. 89

మ. విపరీతప్రతిభావ మేమిటికి నుర్వీనాథ! యీపుత్త్రిగా
త్రపరిష్వంగసుఖంబు నీకొనుము ముక్తాహారకర్పూరపాం
డ్రపరాగప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రిగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కదా శీతమే. 90

క. అనఘుఁడు వంశకరుండై,
పెనుపున నీసుతుఁడు వాజపేయంబు లనూ
బొనరించు నని సరస్వతి,
వినిచె మునులు వినఁగ నాకు వినువీథి దెసన్. 91

క. భూరిగుణు నిట్టిసుతలని,
స్తారకు దారకు నుదారధర్మప్రియ ని
ష్కారణము తప్పఁ జూడఁగ,
సారమతీ! చను నె నాఁటిసత్యము గలుగన్. 92

చ. సుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె సూనృత
వ్రత ! యొకబావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడఁగన్. 93
క. వెలయంగ నశ్వమేధంబులు వేయును నొక్కసత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము,వలననములుసూపుగౌరవంబున పేర్మిన్. 94
తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద,
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావ
యెఱుఁగు మెల్ల ధర్మంబులకెందుఁ బెద్ద,
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైనమునులు.
క. కావున సత్యము మిక్కిలి, గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమసం
భావితసమయస్థితి దయఁ,గావింపుము కొడుకుఁ జూడు కరుణాదృష్టిన్. 96
క. శ్రుతిపరుఁ డైనవిశ్వా,మిత్రునకుఁ బవిత్రయైన మేనకకును స
త్పుత్త్రి నయి బొంకు పలుకఁగ, ధాత్రీతలనాథ! యింతధర్మేతరనే. 97
వ. అనిన శకుంతలపలుకులు సెవియొల్లక దుష్యంతుం డిట్లనియె. 98
క. ఏ నెట నీ వెట సుతుఁ డెట,
యే నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు,
నా నిట్టు లసత్యభాషణం బుచితంబే. 99
క. పొడువునఁ బ్రాయంబునఁ గడుఁ,
గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడు కని యూతని నెంతయుఁ,
గెడమడుఁగుగఁ జూపఁ దత్తె యిందఱు నగఁగాన్.
వ. ఇట్టిలోకవిరుద్ధంబుల కేమోడుదు మయుక్తంబు లయినపలుకులు పలుకక
నీయాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంతసంతాపితాంతః
కరణయై. 101

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁబడితినొ కొ
మడువులు వేయు నిం కేల యిప్పాటినోములు దొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచున గందె డెందమున. 102

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశ యై బోరనఁ దొరఁగు బాష్ప
జలంబు లంతరంగ యు త్తిగొనుచు నింక దైవంబ కాని యొండుశరణంబు
లే దని యప్పరమపతివ్రత తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవ నున్న
యవసరంబున. 103

చ. కొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము పల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్. 104

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతలపతివ్రతాత్వంబును సత్యం
బును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపులపలుకు లతివ్యక్తంబు
లయి యాకాశంబువలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన
ని ట్లనియె. 105

తే. ఏను నీయింతియును గాని యెఱుఁగ రన్య,
లర్థిఁ గణ్వమహామునియాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము,
నెమ్మిఁ జేసిత దీనిఁ బాణిగ్రహణము. 106

తే. అన్యు లెఱుఁగమిఁ జేసి లోకాపవాద,
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందలు సెప్ప డెఱుఁగఁ,
జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ. 107

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలిం
గనంబు చేసి శకుంతలామహాదేవి నతిప్రణయగౌరవంబున సంభావించి

యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసు
ఖంబు లనుభవించి తనరాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యం
తుండు దపోవనంబున కరిగె. 108

## (8) ప్రాతికామి ద్రౌపదిని సభకుఁ దోడ్కొని వచ్చుట.

ఆ. అవనినాథు చేత నాజ్ఞాపితుం డయి, సూతనందనుండు ప్రాతికామి
పాండవాగ్రమహిషిపాలికిఁ జనిభక్తి, వినతుఁడగుచు నిట్టులనియె సతికి.

తరువోజ.

ధనసంపదలు నిజధరణి రాజ్యంబు, దనయులం దమ్ములఁ దన్నును నిన్నుఁ
దవర జూదంబాడి ధార్తరాష్ట్రులకు, ధర్మతనూజుండు దా నోటువడియె
వనజాక్షి! కౌరవవరుపని నిన్ను, వడిఁ దోడుకొని పోవ వచ్చితి నిపుడ
చను దెమ్ము కౌరవేశ్వరుకడ కనిన, జలజాయతాక్షి పాంచాలి యిట్లనియె.

ఆ. ఏయుగంబునందు నెట్టిదుష్కృతవుండు,
భార్య నొడ్డి యోటువడినభర్త
కలఁడె యిది వినంగఁ గడు నపూర్వం బయ్యె,
నిట్లు సేయునొక్కొ యిందుకులుఁడు. 3

తే. మున్న ద న్నోటువడి మఱి నన్ను నోటు,
వడియెనో నన్ను ము న్నోటువడి విభుండు
గ్రన్నఁ ద న్నోటువడియెనో యన్న! నాకు,
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని. 4

వ. ఎఱుంగవేని యుధిష్ఠిరు నడిగి వచ్చి మఱి నన్నుం దోడ్కొనిపోవ నగు
నని తోడ్కొని పొమ్మనినం బ్రాతికామి క్రమ్మఱి వచ్చి పాంచాలిపలు
కులు ధర్మరాజునకుం జెప్పిన దురోదరపరాజయదుఃఖితచేతస్కుం
డగుటం జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుం డైనఁ బ్రాతికామి
దుర్యోధనుం డిట్లనియె. 5

క. సందిగ్ధ మయినయర్థము, నిందఱసన్నిధిని యడిగి తెలియంగఁ గదా
సుందరిఁ బాంచాలేంద్రసుతం దోడ్కొని రమ్ము పొమ్ము తనయుఁ డనిపెన్.

వ. వాఁడును ద్రౌపదిపాలికిం బోయి దేవీ! నీయడిగినయర్థంబు నిర్ణయించు వారయి సభ్యులు నిన్నుం రాఁ బంచిరి రమ్మనిన దుర్యోధనుదుశ్చేష్టితంబునకు ధర్మరాజుసమ్మతంబునకు వెఱచి యక్కోమలి ప్రాతికామి కిఱుంద నేకవస్త్రయు నధోనీవియు నవిరళగళితనయనోదకబిందుసందోహపరిపీడ్యమానపీనస్తనపరిధానాంతరయు నగుచు సభకుం జనుదెంచి కురువృద్ధుసమీపంబున నున్నంత ద్రౌపదిం జూడ నోపక లజ్జితు లయి దుఃఖాయమానమానసు లయి తలలు వాంచి యున్న పాండవులవైలక్ష్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు దుశ్శాసనుం బిల్చి ప్రాతికామి వృకోదరునకు వెఱచు నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన. 7

ఆ. నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ,
బనుచు టెఱిఁగి కృష్ణ పంకజాక్షి
గడుభయంబు నొంది గాంధారియొద్దకు,
నరిగెఁ గడు నడంగి యతిరయమున. 8

చ. తడయక కౌరవానుజుఁడు దానిఱుందన పాఱి యింక నె
క్కడ కరుగంగఁ బోలుఁ జాలుకొం జను డెమ్మిట సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునఁ గురూత్తమునర్థమ కైతి నిశ్చయం
బుడమిని దమ్ముఁ గోల్పడిరి పార్థి! భవత్పతు లైనపాండవుల్. 9

వ. అనుచు డాయ వచ్చిన నేను రజస్వలను ముట్టకుండు మేకవస్త్ర నయి యున్నదాన మఱి గురుబంధుజనాధిష్ఠితం బైనసభకు నెట్లు రా నేర్తు ననిన నీ వేకవస్త్రవైన నేమి విగతవస్త్రవైన నేమి ని న్నెట్లుం దోడ్కొని పోదు నని బలాత్కారంబున. 10

ఉ. ఆవనజాననం గురుకలాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా

రావలిఁ జేసి పావనము లైనశిరోజములం దెమల్చి పా
పాపఁడుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమ మంది చూడఁగన్.11

వ. ఇట్లు వాతావధూతం బైనపతాకయుంబోలె దుశ్శాసనాపకృష్ట యై ద్రౌపది వికీర్ణకేశయు వివర్ణ వదనయు నై కర్ణదుర్యోధనశకుని సైంధవాదిదుష్టభూయిష్ఠం బైనసభకు వచ్చి కోపలజ్జాపరవశ యయి. 12

చ. అనుపమదైవయోగవశుఁ డయ్యె నవశ్యము ధర్మసంపదం
దనరున కాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ ద్రో
హక్కానె కురువృద్ధులార! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె నవిచారపరుం డయి దుర్మదంబునన్. 13

చ. ఇది యుచితంబు గా దనక యిక్కురుముఖ్యులు చూచు చుండ దు
ర్మదుఁ డయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి సర్వధర్మ సం
విదు లన నున్న యీభరతవీరులవంశము నేఁ డధర్మ సం
పద నతినింద్య మయ్యె నని భామిని కృష్ణఁ దలంచె భీత యై. 14

వ. ఇట్లు జగత్త్రయవిజయభుజవీర్యసనాథు లైననాథులు గలిగియు ననాథయుంబోలెఁ బాంచాలరాజపుత్త్రి భయార్తయై యార్తజనశరణ్యుం డైన జగన్నాథుజనార్దనుం దలంచుచుఁ గపటద్యూతమధుమదోన్మత్తుండయిన ధర్మపుత్త్రునిమిత్తంబున నుద్గతంబయినపాండవపరాజయదహనంబుఁదన రూక్షకటాక్షవీక్షణవచనంబులం బ్రవర్తించు చున్న దానిఁ జూచి దుఃఖితుం డై భీమసేనుండు ధర్మరాజున కి ట్లనియె. 15

క. ధనకనకరత్నవరవాహనధరణీరాజ్యములును నాయుధములు మ
మ్మును నోటువడుట యుచితమ,యినసన్నిభ! దీనికెల్ల నీకుఁడ వగుటన్.

క. ద్రుపదతనూజం బణముగఁ,
గపటద్యూతమునఁ జేయఁ గాఁ దగునె జనా
ధిప! యిది దుష్టద్యూతము,
నెపమునఁ బరిభూత యయ్యె నిక్కురుబులచేన్. 17

వ. శకునికైతవం బెఱింగియుఁ గాపద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మప్ర
వృత్తుండవైతివి కావున భవద్బాహుదాహంబు సేయ వలయు నని
కోపించి పలికినం బవనతనయునకు నర్జునుం డి ట్లనియె. 18

సీ. ధర్మతనూజుండు ధర్మువు దప్పినఁ,
ధరణీతలం బెల్లఁ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములకుఁ,
బరులచేఁ బిలువంగఁబడి విభుండు
గడఁగక విముఖుండు గాఁ జన దని శుభ,
క్షాత్త్రధర్మంబు లోకంబులందు
నిలిపెఁ దా నిది పతి నేరమియే దైవ,
వైపరీత్యం కైన వనరఁ దగునె
ఆ. గురుల ధర్మపరులఁ గోపించి ధీరుల,
తిక్రమింతుకే తదీయనిత్య
ధర్మగౌరవం బధార్మికు లగుమన్న,
పరులచేతఁ జెఱుపఁబడియె నిట్లు. 19

వ. అనుచు దుఃఖితు లగుచున్న పాండవులను దుశ్శాసనాపకృష్టయై
సభాంతరంబుననున్న ద్రౌపదిం జూచి వికర్ణుం డన్యాయశ్రవణకర్ణు
లై మిన్నకున్న సభ్యుల కి ట్లనియె. 20

క. సముచితవృత్తు లగుబు,
ద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీప్రశ్నవిచా
రము సేయవలయు నవిచా,
రమునఁ బ్రవర్తిల్లు టది నరకహేతు వగున్. 21

వ. ఇక్కురువృద్ధు లైనభీష్మధృతరాష్ట్రవిదురాదులును నాచార్యు లయిన
ద్రోణకృపాదులుం బలుక రైరి యున్నసభాసదు లెల్లం గామక్రోధా
దులు దక్కి విచారించి చెప్పుం డనిన నెవ్వరుం బలుక కున్న నే నిందు
ధర్మనిర్ణయంబు సేసెద నెల్లవారును వినుండు జూదంబును వేఁటయుఁ

పానంబును బహుభక్షణాసక్తియు ననునాలుగుదుర్వ్యసనంబులం దగిలినపురుషుండు ధర్మువుం దప్పి వర్తిల్లు నట్టివానికృత్యంబులు వేశానం దగవు గితవాహూతుం డై వ్యసనవర్తి యయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణధనం బయిన పాంచాలిఁ బణంబుఁ జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత యక్కోమలి నేకవస్త్రి నిటఁ దోడ్కొని తెచ్చుట యన్యాయం బనిన వికర్ణుపలుకుల కొడంబడక కర్ణుండు వాని కిట్లనియె. 22

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు,
బేల! నీకుఁ జెప్ప నేల పలికెఁ
జిఱుతవాని కింత తెఱసంటి పలుకులు,
సన్నె వృద్ధజనము లున్నచోట. 23

వ. నీవు ద్రౌపది నధర్మవిజిత యని పలికితి సభాసదు లెల్ల నెఱుంగ ధర్మజుండు దనసర్వస్వమ్ము నొడ్డి యోటువడినప్పు డిది వానికి వెలిగాదు గావున ధర్మవిజితయ యిట్లు గాని నాఁడు పాండవు లిందఱును దీని విజితఁగా నేల యొడంబడుదురు మఱి యేకవస్త్రి యై యున్న దీని సభకుం దోడ్కొని వచ్చుట ధర్మువు గా దంటి భార్యకు దైవవిహితుం డయినభర్త యొక్కరుండ యిది యనేకభర్తృక గావున బంధకి యనంబడు నిట్టిదాని విగతవస్త్రిం జేసి తెచ్చిన ధర్మవిరోధంబు లేదని కర్ణుండు వికర్ణువచనంబులకుం బ్రత్యాఖ్యానంబు సేసిన విని దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపు మని పంచిన దాని నెఱింగి. 24

క. కితవవ్యవసాయపరా,
జితు లగుటం జేసి బలిమి చెడి పాండుసుతుల్
ధృతిఁ దమపయిపుట్టము లా,
యతకీర్తులు మున్న పెట్టి రాసభ నున్నన్. 25

## దుశ్శాసనుండు ద్రౌపది గట్టినపుట్టం బొలుచుట.

సీ. ఇది సేయఁ దగ దని మది విచారింపక,
సద్గర్హితుండు దుశ్శాసనుండు
సెట్టన ద్రౌపది గట్టినపుట్టంబు,
సభలోన విడ్వ బాలంక లేక
యుడుగక యొలువఁగఁ బడియును న్నపనీత,
మైనతద్వస్త్రంబునట్టివలువ
లలితాంగిజఘనమండలమునఁ బాయక,
యొప్పుచు నున్న నయ్యువిదఁ జూచి
ఆ. సభ్యు లెల్ల నుదితసమ్మదు లయిరి దు,
శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమాన మయిన నొలువంగ నోపక,
యుడిగె లజ్జఁ బొంది యుక్కుదక్కి. 26

వ. ఇట్లు భీమసేనుండు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుండు సేసినయవ
మానంబు సూచి కోపరక్తాంతనయనుం డగుచు నంతకాకారంబున దంత
సందష్టదారుణముఖుం డయి యెల్లవారును విన నిట్లనియె. 27

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచు చుండఁగ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచు చుండ నని యాస్వాదింతు నుగ్రాకృతిన్. 28

వ. ఇట్లు సేయనైతి నేని పితృపితామహులగతిం దప్పినవాఁడ నగుదు నని
నతని యతిమానుషం బయినమహావ్యవసాయంబున కద్భుతం బంది
దిక్కులు చూడక ధిక్ఛబ్దముఖరితముఖు లగుచు సభాజనులు తమలో
సపుత్త్రకుం డయినధృతరాష్ట్రు నిందించుచు ద్రుపదరాజపుత్త్రివాక్యం
బులు విచారింపక వృద్ధరాజు లుపేక్షించి రను చుండి రంత మద్యత
కాలుం డయి విదురుం డెల్లవారిని వారించి యి ట్లనియె. 29

క. సుమతులు పాంచాలీప్రశ్నమునర్థము నేర్పడఁగ వి[illegible]డు పా
పము వొందు ధర్మసందేహము దీర్పనినాఁడు సభ్యు[illegible]సజ్జనులన్.

మత్తకోకిలము. ఈవికర్ణుఁడు బాలుఁ డయ్యును నేర్పరించి యథావిధిన్
దేవమంత్రియపోలె ధర్మవుఁ దెల్పె నీతనిబుద్ధి మీ
రేవగింపక చేకొనుం డిది యెల్లయందును ధర్మస
ద్భావ మొక్కని కేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే. 31

ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృతదోషఫలమునం దర్ధ మొందుదు, రనిరి ధర్మవేదు లైనమునులు. 32

ఆ. ధర్మ వెఱిఁగి దానిఁ దా నొండుగా లాభ,
లోభపక్షపాతలోలబుద్ధి
సభల నెవ్వఁ డేని సభ్యుఁడై పలుకు వాఁ,
డనృతదోషఫలము ననుభవించు. 33

వ. ఈయర్థం బితిహాసంబులయందు వినంబడుఁ దొల్లి ప్రహ్లాదునికొడుకు
విరోచనుండును నంగిరసుం డనువిప్రునికొడుకు సుధన్వుండును నొక్క
కన్యాప్రతిగ్రహనిమిత్తంబున నెల్లగుణంబుల నేన పెద్ద నేన పెద్ద నని
తమలో నిద్దఱును వివాదంబు సేసి ప్రహ్లాదుపాలికిం జని రందు సుధ
న్వుండు ప్రహ్లాదున కి ట్లనియె. 34

తే నీవు ధర్మవిదుండవు మావివాద,
మెఱిఁగి తీర్పు గుణశ్రేష్ఠుఁ డెవఁడొ నేనొ
చెప్పు మన్యథాబుద్ధి వై చెప్పితేని,
మఘవుకులిశంబు వ్రచ్చు నీ మస్తకంబు. 35

వ. అనినం బ్రహ్లాదుండు భయంపడి కశ్యపుకడకుం జని విరోచనసుధన్వులు
తన్ను వివాదనిర్ణయం బడిగినవిధంబును జెప్పిన విని వానికిం గశ్యపుం
డి ట్లనియె. 36

తే. సాక్షియును ధర్మదర్శియు సాక్ష్యవిధులు,
దప్పఁగాదు తప్పినను నధర్మయుక్తి

వరుణపాశ[illegible]సంబు వానిఁ గట్టి,
పాయ[illegible]ట నీళ్ళుక్కఁ దాయతముగ. 37

వ. ధర్మేతర బధర్మవిద్ధం బయి సభకు వచ్చిన దానిం దీర్పనిసభ్యు లధర్మవిద్ధు లగుదురు మఱి సభ్యులు కామక్రోధంబులు విడిచి యధర్మంబు వాపనిచోఁ దయ్యధర్మంబునం దొక్కపాదంబు సభ్యుల నొక్కపాదంబు భూపతిఁ దక్కినయది గర్తనుం బొందు సమంజసు లైన సభ్యులచేత విధ్వ్యక్తం బయ్యె నేని యధర్మంబు కర్తనుం బొందుఁ గావున ధర్మంబు దప్పక చెప్పవలయు ననినం బ్రహ్లాదుండు ధర్మమతి యై విచారించి తనకొడుకుకంటె గుణశ్రేష్ఠుఁడుగా సుధన్వుం జెప్పినఁ బుత్త్రస్నేహంబు విడిచి ధర్మువు దప్పక చెప్పి తని బ్రహ్లాదుం బ్రశంసించి సుధన్వుం డరిగెఁ గావున మీరును ద్రౌపదీప్రశ్నంబునందు ధర్మబుద్ధి సేయుం డని విదురుండు పలికిన దుర్యోధనుభయంబున సభ్యు లెవ్వరుం బలుక రయ్యిరి ద్రౌపదియు నట్లు సకలక్షత్త్రియ సమక్షంబున దుశ్శాసనుచేతం బరిభవింపంబడి దుఃఖిత యయి. 38

సీ. అవ్విధంబున నొప్పి యాస్వయంవరమునాఁ,
డఖిలభూపతులచే నట్లు నాఁడఁ
బడి పాండవులధర్మపత్ని నై గోవిందు,
చెలియల నై వీనిచేత నిట్లు
పరిభూత నగుచు సభామధ్యమున మహీ,
పతులచేఁ జూడంగఁబడితి నింత
వడుదు నే యిప్డు నాపలుకుల కెవ్వరుఁ
బ్రతివచనం బేల పలుక రైరి

ఆ. ధర్మ్యులార! యే నదాసినే దాసినే,
యొండుఁగఁ జెప్పి పనుపుఁ డెల్ల దాని
ననుచు వనరుచున్న నాపగాసుతుఁడు శాం,
తనవుఁ డిట్లు లనియె దానిఁ జూచి. 39

వ. అవ్వా ! నీప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరు[illegible] చెప్ప వలయుఁ
గానినాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని దెలియఁగ గ[illegible] దీనిఫలంబు
వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతు రని ప[illegible] చున్నయవ
సరంబున నక్కోమలిం జూచి నగుచు. 40

తే. తరుణి! యేవురకంటె నొక్కరుఁడ భర్త,
యగుట లగ్గు జూదంబున వాలి నోటు
పడనివానిఁగాఁ దగుభర్తఁ బడయు మింక,
ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత. 41

ఉ. అమ్ముదితక్ విభీతహరిణాక్షిఁ గలాపవిభాసికేశభా
రమ్మున నొప్పుదానిఁ దనరమ్యపృథూరుతలంబు నెక్కఁగాఁ
రమ్మని సన్నసేసె ధృతరాష్ట్రసుతాగ్రణిఁ డప్డు దాని దూ
రమ్మునఁ జూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్. 42

క. లయసమయదండధరని,
ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దనపలుకులు వి
స్మయసంభ్రమభయసంభృతు,
లయి విను చుండంగ నిట్టు లనియెన్ సభలోన్. 43

ఉ. ధారుణిరాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చినయిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తితచండగదాభిఘాతభ 44
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

వ. అని సర్వజనభయానకక్రోధావేశవివశుం డయి యాయుధంబు లున్న
వలనికి దృష్టులు సలుపుచు నగ్రజు ముగంబు సూచు చున్న భీమసేను
నతిరౌద్రాకారంబు సూచి భీష్మవిదురద్రోణాదు లిది కోపంబున కవ
సరంబు గా దని యాతనిం బ్రశాంతచిత్తుం జేసి రంత. 45

క. ధృతరాష్ట్రునగ్నిహోత్రా,
యతనంబున నఱచె నఱకు లగ్నులు కాంతి

దుర్మతు ల గారవర్తి),
తతివ్యా లధిక శోకతప్తులు లయ్యెన్. 46

క. క్రూరాత్ము దుష్ప్రద,వీరతు లగుధార్తరాష్ట్రవీరులకయ్యా
గారములు సెగసె సెంతయు,ఘోరంబుగఁగాకఘూకఘూత్కారంబుల్.

క. అట్టిమహోత్పాతంబులు, పుట్టినఁ గృప విదుర కలశభూ శాంతనవుల్
నెట్టన ధృతరాష్ట్రునకుఁ, బుట్టె నరిష్ట మని దిట్టమునఁ దమలోనన్. 48

వ. అంత నంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రు
కడకుం బోయి పాండవపరాజయంబును ద్రౌపదిపరిభవంబును దుర్ని
మిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనుం బిలిచి
యి ట్లనియె. 49

చ. పరమపతివ్రతన్ సతిఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిఁ గాఁ దలంచి ని
ష్ఠురములు పల్కఁగాఁ దగునె బాల్యము నాదిగ దుష్టభావనం
బెరిఁగితి నీవిమిత్తమునఁ బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్. 50

వ. వారలవలన నీదురాగ్రహం బుడుగు మని కొడుకును భంగించి సకల
బాంధవహితంబు సేయుం దలంచి ద్రౌపదిని బిలిచి శాంతవచనంబుల
ని ట్లనియె. 51

## ధృతరాష్ట్రుఁడు ద్రౌపది గోరినవరంబు లిచ్చుట.

క. సుందరి ! నాకోడండ్రుడ,యుం దధ్యర్చితవు నీవ యతిముదమున నీ
కొందగఁ బ్రియంబు సేసెద, నిందుముఖీ! వేఁడు పెద్ది యిష్టము నీకున్.

వ. అనినం బాంచాలి యి ట్లనియె. 53

ఆ. కరుణతోడ నాకు వరము ప్రసాదింప, బుద్ధియేని లోకపూజితుండు
మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు,వలనఁ బాయువలయు
వసుమతీశ ! 54

వ. అట్లయినం గురుకుమారుల గురువృద్ధజనలాలితుం డై పెరిఁగినప్రతి
వింధ్యు దాసపుత్త్రుం డన కుండుదు రిదియ నాయిష్టం బనిన నిచ్చితి
నింక రెండవవరంబు వేఁడు మనిన ద్రౌపది యి ట్లనియె. 55

క. సెమ్మిని ధర్మజుజనవుపుత్రు,దమ్ములుఁ దమయాయుధ[illegible]తమవర్మవరూ
థమ్ములయుఁదోడ సకలహి,తమ్ముగఁ గాయంగఫలయు[illegible]స్యాముపలనన్.

వ. అనిన ధృతరాష్ట్రుండు నీకోరినవరం బిచ్చితి నింక మూఁడవవరంబు వేఁడు మనిన ద్రౌపది యి ట్లనియె. 57

ఆ. వైశ్యసతికి నొక్కవరము సత్క్షత్రియ
సతికి రెండు శూద్రసతికి మూఁడు
విప్రసతికి నూఱు వేఁడఁ జన్వరములు,
గాన నింక వేఁడఁ గాదు నాకు. 58

వ. అనిన ధృతరాష్ట్రుండు కోడలిగుణంబులకు ధర్మం బెఱుంగుటకు సంతసిల్లి యనుజసహితుం డయినయుధిష్ఠిరు రావించి నీవు సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పుగొని యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున కరిగి సుఖం బుండుము నీకు లగ్గయ్యెడు మని పెండియు. 59

తే. నీవు నిత్యంబు వృద్ధోపసేవఁ జేసి, యెఱుఁగు దెల్ల ధర్మంబుల నెఱుక లేక
కడఁగి నీ కెగ్గు సేసె నాకొడుకు దీని,మఱచునది నీకు చేకొండ్లుగ నుపనేల.

క. మనమున వేర మిఁ దలఁపమి,
యును సమచిత్తుఁ డగుటయును గుణములు కై
కొని దోషంబులు విడుచుట,
యును నుత్తముఁ డయినపురుషునుత్తమగుణముల్. 61

వ. ఏను బుద్ధి లేక జూదం బుపేక్షించితి నల్పబుద్ధిసత్త్వుం డయినవృద్ధు నన్నును మీతల్లియయినగాంధారినిం దలంచి దుర్యోధనాదులు సేసిన దుర్నయంబులు చేకొన కుండునది సర్వశాస్త్రవిదుం డయినవిదురుండు మంత్రిగా సర్వధర్మవిదుండ వైననీవు రక్షకుండవుగా నిక్కురుకులంబునకు లగ్గగు నని ధర్మరాజుఁ బాండురాజురాజ్యంబునందు సమర్పించిన. 62

తరలము. తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రుల దైనభీ
కరపరస్పరకోపవేగము గ్రన్నఁ గాచి వితత్రిపా

గరనిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహాంకులఁ దనితోషులఁ బూని తద్దయుఁ బ్రీతితోన్. 63

(4) ధర్మవ్యాధుఁడు గౌశికునకు హింసాస్వరూపంబు చెప్పుట.

వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె నయ్యా! నీవు దొలుత
నాప్రవర్తనంబు గనుంగొని యిది హింసాబహుళంబు గాదె యని పలికి
తివి దాని కేను దగుతెఱంగు చెప్పితి నది యట్లుండె హింస యిట్టిది
యహింస యిట్టి దని విభాగింప నెవ్వరికి నేర నగు. 1

క. మును తమచేసినకర్మంబునఁ జావ నశించు భూతములు సంపెడువాఁ
డు నిమిత్తమాత్ర మింతియె,యని చెప్పఁగ వినమె యంచితాచారులచేన్.

వ. అదియునుం గాక. 3

క. ఫలమూలౌషధిశాకంబులుఁ బశుమృగతతులు భక్ష్యములుగా భూతం
బుల కజుఁడు సేసె ననియ,స్ఖలితంబుగ మ్రోయు శ్రుతులఁ గాదనవశమే.

సీ. అనఘ! యాశీనరుం డగుశిబి నిజగాత్ర,
హింస నింద్రాగ్నుల కిడఁడె మాంస
మతనికి లేదయ్యె నయ్య! యుత్తమగతి,
రంతిదేవుం డనురాజు దొల్లి
యనుదినంబును గోసహస్రద్వయంబుఁ దా,
వధియింపఁడే వేయివత్సరములు
దురిత మమ్మహితాత్ముఁ దొడరెనే వేదార్థ,
నిరతు లై యత్యంతనియతు లైన

తే. ధారణీసురముఖ్యు లధ్వరములందుఁ,
బశువధింపరె పశువులఁ బరమపుణ్య
గతులు గలుగవె వారికిఁ గడఁగి యగ్ను,
లధికమాంసార్థు లని శ్రుతులందు వినమె. 5



క. పితృదైవతకార్యములం, దతిభక్తిని మాంస మిడుట యుక్త్వా మఱియుఁ ద
త్పితృదైవశేషములు సస్మృతి భోజ్యము లనియు మనులమతములుగావే. 6

మ. హాలికుం డెంతయు నోజతో దునుఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యానో కాదొ వేయేల మ
ర్త్యులు నేలన్ జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కుజం
తులు హింసావిధి గాదనం గవశమే దోషజ్ఞ! యూహింపుమా. 7

చ. సలిలము నుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘటమైనటు లుండు నింతయుం
దలఁపరు హింస సేయమని తారు చరింతురు గొంద ఱిమ్మహిన్. 8

క. పనిపడి యహింస వ్రతముగఁ,
గొని వనమున నున్న మునులకుం దొడరదె హిం
సనము తరుమూలఫలశా,
కనిపీడన మదియు హింస గా దొకొ తలఁపన్. 9

తే. హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున,
నొక్కఁ డైనను దమతమయోపినట్లు
హింస తెరువున కడ గల్గి యేఁగవలయు,
నదియ చూవె యహింస నా నతిశయిల్లు. 10

వ. ధర్మంబు బహుప్రకారం బై యుండుఁ దదీయసూక్ష్మగతి దురవబో
ధంబు గావున శ్రుతిప్రమాణంబులవలనను వృద్ధాచారనిదర్శనంబుల
వలనను నెఱింగికొనునది, 11

---

## (5) ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట.

క. కని యుత్తరుండు గరుపా,
ఱిన మేనును దలఁకుమనము ఱిచ్చవడిన చూ

పును సైతో త్రుపడుచు ని
ట్లనియె దిగులు సొచ్చి యాబృహన్నలతోడన్. 1

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రంబు బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. 2

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గార్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢు లయినయా
శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే. 3

క. ఇట్టగు కెలుఁగక వచ్చితి, మెట్టోకొ మనళంగి వీర లిందఱును గదన్
కొట్టెదరు మనకు మార్కొనునట్టిపాలఁది గాదు భీతి యడరెడుఁ దోడ్తోన్.

ఉ. కౌరవసేనఁ జూచి పడఁకం దొడఁగెన్ మదిలోన మేను నీ
వూరక పోవు చున్కి యిది యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా. 5

వ. అనిన దరహాసితవదనుం డగుచు శతముఖతనయుం డతని కిట్లనియె. 6

చ. అసదృశలీలఁ గౌరవరథికావలిమీఁదఁ జనంగ నెత్తికే
మనలక యామిషంబు గొని మార్గము పట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము వేగ మరల్తము గాక యిట్టియుం
బసు లటు పోవఁగా మరలఁ బాడియె నీకు నరేంద్రనందనా. 7

ఉ. అంతిపురంబులోనఁ గలయంగ నెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద మెక్కి రయంబున వచ్చి యిప్పటిన్
దంతితురంగసద్భటకదంబముఁ జూచి కలంగు టొప్పునే. 8

ఆ. అనినపలుకులకు బృహన్నలఁ గనుఁగొని,
యొలుఁగు వడఁక నాతఁ డిట్టు లనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతులసంతోష,
మేల నాకు ననికిఁ జాల నేను. 9

వ. అనవుడు. 10

చ. తనభుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁ జూచి యొ
ట్లును దెగ కున్నఁ బోక యిది లోకముచక్కటి శూరు లైన దీ
నిని మది మెచ్చ రీబలము నీ దెసఁ జేటియుఁ జూడ దింతకున్
మును భయహేతు వైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తరిన్. 11

సీ. దెసలు వీఁటలు వాఱఁ దివురుచిందములతోఁ,
కాహళంబులకుఁ గలంగఁబడక
యురవడి సేనలు దెరలఁ దైఁ దోఁతెంచు,
ధూళి పెల్లడరినఁ దూలబోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన,
యుగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగ,
తతి వాటుతఱచునఁ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర బరవసమున,
నిత్తఱంగునఁ గలుగుక్రం దెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడఁ గాక,
దవ్వుదవ్వుల నిట్టైన నవ్వ రెట్లు. 12

చ. అనుదివిజేంద్రనందనున కమ్మనుజేశ్వరనూనుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యుదగ్రత సైన్యము లెన్ని యున్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి కాసట లేర యెవ్వరున్. 13

తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ,
నే యి దెట్టి యెడమాట లిట్టు లాడ
వారు గానక ముందఱఁ దేరు దోలు,
కొని రణంబునఁ బరికరుగుటయ! నీతి. 14

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 15

క. వెగ డొంది యిట్లు పలుకఁగ,
నగునే పగతురు ప్రమోద మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు,
దెగడం దా మగిడి పోక దీనత గాదే. 16

వ. అట్లుం గాక. 17

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దానం బెంపుమైఁ బిల్చి తో
డని తో డ్తెచ్చితి నీవు బంటుతన మట్లగ్గించి పాంచాలి దీ
వన లిచ్చ్ం దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త పోదునె భయోత్కంపంబు నీ కేటికిన్. 18

తే. చిత్తవృత్తి యుక్కించుక చిక్కఁబట్టు,
మిపుడ కౌరవసైనికు లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమును లావు వెరవు మెఱయఁ,
గదుపుఁ బెట్టించి పోదము గ్రమ్మఱంగ. 19

వ. అనుచు విప్పచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్ల
టిల్ల మానసంబు దల్లడిల్ల నాభూపాలభకుమారుండు. 20

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదు రెట్టు మేలు మేలు నను నాఁగకు నీ
క్రొవ్వెఱుఁగ దేని దలపడు, మెవ్విధిఁ జని లేమి యనుచు నెత్తినభీతిన్.

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గ విడిచి యతిరథసమునన్
ధరణికి లంఘించి వెసం, బురికొసకును లజ్జ పిటిఁబోవం బాఱెన్. 22

వ. ఇట్లు వాఱిపం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబుల
పగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును
నాందోళితరక్తాంబర యుగళాంచలుండును నగుచు నతని వెనుకం బఱచు
సమయంబున నిలిచి కనుంగొను కౌరవబలంబునందు. 23

ఉ. అజ్ఞలు కొంద ఱప్పు డపహాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయము మీఁదను దృష్టి నిల్పఁగాఁ

ప్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహులదీర్ఘతయుం బటుత్వత
త్త్వజ్ఞతయున్ గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్. 24

తే. ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును,
గలిగి యున్నది యొప్పు నూష్మలతసొంపు
వికృతవేషావృతంబునై వెలయు నితఁడు,
నివుఱు గవిసిన మెఱయునిప్పుఁ బోలె. 25

ఉ. బాహులచాయయుం గమనభంగియు నర్జునునట్ల దీన సం
దేహము లేదితండు తనతేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ జేడి యనఁ గీడ్పడి యుండెనొ కాక యీకురు
వ్యూహముతోడి కయ్యమున కొండొకరుం డిటు లొంటి వచ్చునే. 26

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొనిపోయిన నొండులు లేమిఁ జేసి యీ
క్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు వగం గడపంగ నెవ్వరుం
దొరఁకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్.

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ జాఱఁ జొచ్చె ని
ప్పురుషునిశౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. 28

వ. అనుచు నిశ్చయరహితహృదయుఁ డగు చుండ శుండాలరయలీలాసమ
రేఖం బగుగమనంబునం బురుహూతపుత్రుండు పదశతమాత్ర ప్రదేశ
పలాయితుం డైన భూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 29

సీ. వెలవెలఁ బాఱుచు వెగడొందుఁ బెదవుల,
తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్చుఁ,
బదములుఁ గరములుఁ గుదియ వడఁకు

హృదయంబు తటతట నదరంగఁ బలుకులు,
దీనదృష్టుల మోముఁ జేరిచూచు
వెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని,
ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప
తే. నిష్కళంకశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ,
లాష్టవైదూర్యములఁ దురగాఢ్యరథముఁ
గరటిదళకంబు నొకయూరుఁ బురము నొచ్చి,
నపుడ యిచ్చెద నీ కను వార్తుఁ డగుచు. 30
క. నాతోఁడి ప్రేమడింగకు, నాతుర రై యెదురుచూచునంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ జొడ, మాతుం బో నీఁగదే విశుద్ధచరిత్రా. 31

## అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁ గాఁ జేసికొనుట.

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుం
డు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి, 32
చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోఁడ నశక్యమేని య
త్తఱిఁ గది యేల నీ కుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁ జి
చ్చఱపిడు గట్టుల ట్టడరి కూరులమొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 33
క. అనుచు నొడఁబాటు లే కు,
న్నను నయ్యుత్తరుని నొగల నడుకొని విడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి
చనియె నరుఁడు జమ్మి సేర సన్నదలీలన్. 34

---

## (6) అభిమన్యుని వివాహమహోత్సవము.

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుండగుమత్స్యమహీనాథుండు
మాహాలార్తికాదిశిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నం బాసన్నం

బగుచు వచ్చె నని ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు ననుజ
సహితంబుగా నలంకృతుం డై వివిధప్రసాధనశోభితు లగుసమస్తబంధు
జనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్ర
గజారూఢుం జేసికొని యేనుంగులం జేరుగలవారువంబులను మట్టప్ర
దట్టంబు సేసికొని మణిగణంబులు నంబరనికరంబులుఁ బుష్పపుంజంబులు
ఫలప్రచయంబులు లోనుగాఁ గలయోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత నడవ
మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వంది
జనవాక్యసంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటు
మందిరంబున కేతెంచి శంఖవిజయఘంటాపణవాదినిక్వణంబులతోడ
నెదుర్కొని చల్లుసేసలు గైకొనుచుం జొత్తెంచిన. 1

క. విరటుఁడు సంభ్రమమును నా,
దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా
పరుఁ డై సమయసముచితా,
చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 2

తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు,
పుణ్యకర్మపరంపరఁ బూని నడప
నర్థిఁ గృష్ణయుధిష్ఠిరపార్థమత్స్య,
వరులు దెరయొద్ద నవ్వధూవరుల నిలిపి. 3

వ. సాంవత్సరికదత్తకాలకలావిశేషంబుల మంగళతూర్యంబులు సెలంగ
నత్తెర యెత్తించిన. 4

ఉ. వీనులఁ దియ్యమెక్క మును విన్కిఁ బరస్పరరాగవృత్తిలో
నూనినఁ జూచువేడుకల నువ్విళు లూరెడునెమ్మనంబు ల
చ్చో నొకయింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్న య
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. 5

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు. 6

సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బ్రాఁకి,
తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము,
నడుగులయొప్పుపై నల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ,
గలయంగఁ బలుమఱు మొలఁగు చుండు
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున,
నెగసి మోమునఁ జోఁకి మగిడి వచ్చు
తే. నొండొరువులతేఁ జెమటల నూని వ్రేఁగు,
పడినచాడ్పున నవయనభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్రలవిశాల,
నయనదీప్తులు నెఱకువ బయలుపడఁగ. 7
వ. తదనంతరంబ. 8
తే. ఒండొరులదోయిళుల నినుపొంపఁ జేయు,
నక్షత్రప్రకరంబు లన్యోన్యమస్త
కములఁ బోసిరి మందారకల్పలతలు,
విరులు గమియ నొండొంటిపైఁ గురియునట్లు. 9
చ. లలితతనూవిలాసముల లజ్జకతంబునఁ జేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవు సాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయునెడలం దగ నొందిన నూలుకొల్పి యి
ష్టులఁ బచరింతు రొండొరులమోహనమూర్తులపై వధూవరుల్. 10
తే. చిత్తమున గాఢరాగంబుచేతఁ జూపు,
తెఱఁగు దోఁపఁ గెంపారెడుతీఁగఁబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమైఁ గ్ర,
హించెఁ బల్లవాలంబిమత్తేభలీల. 11

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 12

క. పెనుఁగుడుట నిడినచూతం,
బును నవమాలికయుఁబోలెఁ బొలుపొంది రతం
డును నస్ముగ్ధయు నేకా,
సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్. 13

సీ. కోర్కులు గెడఁగూడుకొని పారమెత్తిన,
    చిత్తంబు లూఱటఁ జిగురు లొత్తఁ
బులకాంకురములకుఁ బలతాఁకు డై యిరు,
    మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దఱి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి,
    ఎడి చూపు లావట బయలుపఱుపఁ
జెమటలతావులు తమలోనఁ గలసి వే,
    ఱొక్కసౌరభమునై చొక్కు సేయ
తే. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి,
హోమసమయకృత్యంబుల నొనవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్మఁదేర,
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు. 14

---

## (7) శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రితో సంభాషించుట.

క. జలదస్వనగంభీరత, నెలుఁగొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం,బులు విన ధృతరాష్ట్రభూవిభున కిట్లనియెన్.

క. జననాథ ! నీయెఱుంగని,
పనులు గలవె యైనఁ దగవుఁ బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు,
నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్. 2

క. వృకోదరగతిఁ బాండవ,
కౌరవు లొడఁగూడి మనికి కార్యం బది నీ
వారసి నడపుము వా రన,
వీ రనఁ గురుముఖ్య ! నీకు వేఱుం గలదే. 3

చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ గొత్తుఁ బెంపునం
గరుణయుఁ గల్గి యుండు ననఁగా మతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్పనేటికిన్. 4

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం దెవ్వానిచందంబు లె
ట్లైన వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలిపొత్తుంబుల్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ ! 5

చ. వినుము సుయోధనాదు లగువీరు సధర్ములు గాక కార్యము
ల్గానక మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన కన్యాయంబువ
ర్తన మిది గాదు నాక వెడిదంపుఁ దనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బయిగోడ రేమియున్. 6

ఉ. కౌరవపాండవుల్ తెలుఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్వికిం
బోరిత మైన నింతకును బుట్టు. మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య ! గణుతించి యవశ్యముఁ గొందొనర్పవే. 7

తే. నీకు వీరలఁ దీర్పంగ నేర వచ్చు,
నధిప! తెలుఁగు నీపక్షమునయదియు కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె,
సిద్ధ మెవ్వారిఁ దెలి పొందఁ జేయ నేర్తు. ౮

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెంతటో యెన్నఁడూ యిచట నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా

రెందఱో వారు వీరు నని నిల్గుటకంటె భవద్బలంబులై
యుందఱుఁ గూడి యొప్పరె జనాధిప! శాంతి యొనర్పు మెమ్మెయిన్.

తే. జగతిఁ గలజనపతులు నీచరణపీఠ,
మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లిప్రజల,
యెడ విరోధంబు వాటించు టెంతమేలు. 10

క. నరనాథ! నీ వుపేక్షా,
పరుఁడ వయినఁ గౌరవులఁ బాండవులఁ దా
పరయఁగ భూప్రజ కెల్లను,
దురితం బొనరించినట్లు తుదఁ గీడు సుమీ. 11

క. కౌరవపాండవులం దె,
వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మే ల
ర్వీరమణ! చిత్తమున ని,
ట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లయినన్. 12

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరిత్తబవరంబున నాఁడి చావఁ బోవ నె
ట్లూరక యుండ వచ్చుఁ గడునొప్పెడు సేనలు వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వవచ్చునే. 13

ఆ. ఇట్లు గాక యుండ నీరెండుదెఱఁగుల,
వారిఁ గాచికొనుము వసుమతీశ!
నీదు ప్రాభవంబు నీతియు శాంతియు,
నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ. 14

వ. అని చెప్పి వెండియు. 15

## శ్రీకృష్ణుఁడు పాండవులు చెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. పాండవులు దండ్రి సచ్చిన ప్రజలు వారి,
నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁ దగునె,
పార పెంపంగ రక్షింపు గారవమున. 16

వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము తనపంపునం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జరిపితిమి మాతండ్రిసమయంబు ప్రతిపాలించి యే మర్ధరాజ్యం బెట్లునుం బడయుదు మని కృతనిశ్చయులమై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గా దట్లని చక్కంజెప్పునది తానుగలపడివేలేండ్లకుం దన్న కాని మఱియెఱుంగ మెట్టివార మైనను మమ్మును దుర్యోధనాదులు దలంపరు తనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు గొఱగాకున్నను గులంబు సాఁడి పెడకఁ జెల్లునని రని పలికి మఱియు ని ట్లనిరి. 17

ఉ. సారపుధర్మముక్ విమలసత్యముఁ బాపముచేతఁ బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁ బాలివి యైనయవస్థ సభ్యు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచేటగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్. 18

వ. అని యీసభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదులైనరాజులు నే మనియెదరనం డేను ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేకరూపం బైనసత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు సేయుండు. 19

ఆ. పాండవులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి,
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితం బగువిధ మెద్ది,
శక్య మెద్ది చెప్పుఁడ వాక్యవిదులు ! 20

క. అని పలికి మహారాజా !, విను మని ధృతరాష్ట్రితోడ వెండియుఁ దాని
ట్లని చెప్పె వాసుదేవుఁడు, తనమది నఱ లేక కార్యదశ దెలియంగన్.

ఆ. వారితండ్రిపాలు వారికి నిచ్చి నీ,
పాలు నీవుఁ బుత్రపౌత్రచయము
ననుభవించి సుఖుల రై యుండుఁ డిది బంధు,
మిత్రసుజనకోటి మెచ్చు తెఱఁగు. 22

క. ఎఱుఁగవె యజాతశత్రుని,
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిగు నె
త్తెఱఁగున ననువర్తించెనొ,
యెఱుఁగవె తగుచేఁత గలుగు టెఱుఁగవె యధిపా ! 23

వ. నీ వెఱుంగు దైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబునుండి పాండవా
గ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి. 24

ఉ. మన మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ మున్నతిఁ జేసి మహాభూతితో
మదిమది నుండ నీసుతుఁడు మంత్రులు సౌబలుఁడాద మార్చి సం
పద గొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే. 25

ఉ. దానికి నీ వొడంబడితి ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్న నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁ డై
దీనత నుండి పూన్కి పగఁ దీర్చియుఁ గూడి మఱంగఁ గోరెడిన్. 26

క. తనుఁ దాన పోటుఁ గాకే, మన వచ్చు నజాతశత్రునతిశాంతతయున్
వినయము గౌరవమును నే, జనపతులకుఁ గలవు చెపుమ సౌజన్యనిధీ !.

క. ఏ నిం తాడితి నీసం, తానం బిరుదెఱఁగునకు హితము గోరి భవ
త్సూనునిమతియతిలోభము, మాని-చి పాండవులఁ దెమ్ము మనుజాధీశా !

ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నా రటుఁ గాక మీ కది మనంబున కప్రియమేని యింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర ! రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్య మేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 29

చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె
ల్లను బ్రియ మంది సెమ్మనములం బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కునె మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం
దనువరి యెవ్వఁ డంచు నచలాకృతులై నెఱి నూర కుండఁగన్. 30

---

## (8) మంకి చరిత్రము.

సీ. మంకి నాఁ బరగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై,
ఎరింమ శిక్షింపవలయునట్టి
గుజ్జుకోడల జట్టిగొని ప్రీతి లంకించి,
యుండ లంకియలోన గండు మీఱి
పాఱె నకోఁడియల్ పడి యున్న చనుపలా,
ట్టేనుంగు పై నది యొగసి పఱప
నుభయపార్శ్వంబుల నురివోసిన ట్లవి,
వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి

తే. రత్నములఁబోనివత్సతరంబు లకట
వ్రేలు చున్నవి లొట్టెగ్గవెంటఁ దవిలి

యనుచు నిర్వేద మొంది యిట్లనియెఁ దన్నుఁ
గరుణతోడఁ గనుంగొనునరులతోడ. 1

తే. పారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు,
గంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి
కిచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె,
నేని యది దైవదత్తంబ యింత నిజము. 2

వ. కావున. 3

క. మనమునకు సుఖము గోరెదు,
జనులకు సర్వక్రియావిశారదభంగుల్
పొనుపడ విడిచి భరము లే,
కునికియె యూహించి చూడ సుర వెల్గంగిన్. 4

వ. అని పలికి యుద్దామం బైనకామంబు విడుపు పడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగు నే యనువిచారంబు వుట్టి తదీయోత్సారణం బూహించి యాచిత్తధర్మంబు నుద్దేశించి. 5

క. నీమూలం బే నెఱిఁగితిఁ, గామమ ! సంకల్పమూలన కలిగెదు సంకల్పామర్శరహిత మగుచేఁతో మ్రుదం దాల్తు నేను దుది యది నీకున్. 6

వ. అని కామం బనునది గోర్కి గావునఁ గోర్కియొప్పమి దేటపఱుపం దలంచి. 7

తే. సొమ్ము గోరినయంతన సుఖము గలుగ,
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగెనేని యనేకచింతల నొనర్చుఁ,
జెడుట చావుతోఁ దుల్య మయ్యెడుమ యేల, 8

వ. ఇచ్ఛానిరసనంబు సుఖం బని వెండియు. 9

క. శోకశ్రమతృష్ణలకున్, నీకలిమియె మూల మగుట నీ కగపడుతాఁ
జేకర్తవ్యము గానం, డోకామమ ! నిన్నుఁ దొలఁగి యుండెద సుఖినై.

క. నీ వాసపఱుప ధనములు, గావించెదఁ బో వినాశకముల నడుపఁగా
నీవశమె కాన నీచెడు, టేపగపుం దేదు పెనుప దేదైన్యంబున్. 11

చ. సులభమొ దుర్లభంబొ యని చూడ నెఱుంగవు గన్నదానిపై
నలముదు కామమా! యిడుమ లందఁగఁ జేయుదు నిందు టేమిటం
గలుగదు నీకు నీతెఱఁ గగాథరసాతలభంగి నీవు స
న్ఫలమునఁ బోవ కుండి నినుఁ బుచ్చెద బచ్చెనరూపుపోకలన్. 12

తే. ధనము చేటున విసివి నామనము నిన్ను,
నీడవిడిచె నో కామమ! యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెంది,
నాఁడ లోభాదు లొందవు నన్ను నింక. 13

తే. కామసుఖ దివ్యసుఖములకాంక్ష నొఱఁగు,
మేలిసోడశాంశంబులఁ బోల లేవు
గానఁ గామమ! నిను శత్రుకరణిఁ జంపి,
బ్రహ్మపురమున నుండెద రాజుఁబోలె. 14

వ. అని పలికి మంకి యివ్విధంబునం గోడెలు సచ్చినం బుట్టినని ర్వేదనం
బున సకలకామంబులం బరిత్యజించి దేవసముండై యుండె నని చెప్పిన
విని పాండవాగ్రజుం డేమిన ర్తనంబున నరుండు పీతశోకుం డగుచుఁ
జరించు నెద్దానంజేసి పరమగతి నడయు ననుటయు ననిమిషనదీనందనుం
డజగరచరితం బనునితిహాసంబు సీనును దాన నీయడిగినయర్థంబు దేట
పడు దానిం జెప్పెద నజగరనామధేయుం డగునొక్క బ్రాహ్మణుని
బ్రహ్లాదుండు శమప్రకారం బుపదేశింపు మని యభ్యర్థించిన నతం డతని
కిట్లనియె. 15

---

(9) భీష్ముఁడు ధర్మజునకు గరుత్మంతునిచరిత్రంబు సెప్పుట.

సీ. కశ్యపుభార్యలు కద్రువ వినత నాఁ,
గల రాతపస్వి వారలకు వరము

గరుణ నిచ్చెద నన్నుఁ గద్రువ వేఁడుర,
వినత యిద్దఱ వేఁడికొనిరి సుతుల
మునియు న ట్లగుఁగాక యనియెఁ బదంపడి,
యండముల్ వేయును నండయుగము
వరుసన యాకద్రువకు వినతకుఁ బుట్టె,
నవి కుండముల నిడి యరసి యుండి
తే. రవి సహస్ర మేనూ ఱేండ్లు నైన నుదయ,
మయ్యె నవ్వేయిద్రుగ్గుల నధిక బలముఁ
దేజమును గల్గి యాసర్పరాజి యొప్ప,
చుండె నా రెండు విరియక యుండె మఱియు. 1
క. వినసవతి యైనకద్రువఁ, గని పగపును మత్సరంబుఁ గదిరెడుమదితో
వినత కడుఁ వేగిరపడి, యనీతి నొక యండ మవియ నడిచె నరేంద్రా!
వ. అడిచిన నందు. 3
క. పుటుఁ గొక్కఁడు పూర్వాంగము,
గలిగి జనించుటయు వానిఁ గని తూసిగ
న్నుల నశ్రుజలంబులు వె,
ల్లొలుకఁగ శోకమున మునుఁగునుల్లముతోడన్. 4
వ. ...యపడి యుండ నయ్యండజంబు. 5
చ. ఇరువుర మేను పుట్టుదు మహీనపుమేనులతో మహాబల
స్ఫురణ వెలుంగ నెప్పుడుఁ బొందఁగ నీ కవియించి తిట్లు మ
త్సరమునఁ జాపలంబునను దత్ఫల మందుము నీసపత్నికిన్
నరవుడ వై పరింపు మని వారనిపెవ్వగ శాప మిచ్చినన్. 6
క. వెలవెలఁ బాఱుచు వడఁకుచు,
నలుకుచుఁ దనమోముఁ జూచునయ్యంగన న

వ్వొలుఁగు కృపఁ జూచి తల్లి!,
వలవ దడల నిది విధాతృవశ మయి వచ్చెన్. 7

వ. అని వెండియు. 8

శా. ఏనూ ఱేండ్లకుఁ బుట్టు నాయనుజుఁ డింకీయున్న యండంబు నె
ట్లైనన్ ధైర్యము గల్గి కావుము ప్రయత్నాసక్తిమై వాఁడు ద
ర్పానూనుండు బలాభిరాముఁడు మదీయన్యాప్తిమన్మూర్తి నీ
కానందంబుగ నీఁగు దాస్యము త్రిలోకాశ్చర్యసంపాది యై. 9

వ. అనిరయి నిట్లు ప్రథమపుత్రుండు వికలాంగుం డగుటకును శాపప్రాప్తికిని బరమనిర్వేదనంబు నొంది వినతయు నవ్విహంగంబు నిర్దేశించినకాలంబు ప్రతీక్షించి యయ్యండంబు రక్షించికొని యుండం దత్సమయసమాగమంబున. 10

చ. ఘనతరకంధరుండు దృఢకాయుఁడు దీప్తముఖుండు రక్తలో
చనుఁడు మహోత్తమాంగకుఁడు చారుసుసంగతపక్షసారమం
డనుఁడు పరిస్ఫురద్ద్యుతివిడంబితబాలదివాకరుండు లో
కనయనపర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా!. 11

క. ఆసమయంబున నరుణో,ద్భాసితగాత్రుండు దొలుతపట్టి యరుణుఁడు
ల్లాసి యగుచు రవిపరిచ,ర్యాసుఖ మెదఁ గోరి చనియె నంబరవీథిన్. 12

మ. జననిం బాసి జనించునప్డ తనయిచ్ఛం బక్షినాథుండునుం
జని పద్మోద్భవకల్పితంబు లగుభోజ్యంబుల్ శరీరంబు వ
ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ దగ్ ముద్దు సేయంగఁ గ్రీ
డనలోలత్వమునం జరించుఁ బరితుష్టస్వాంతుఁ డై యుల్లెడన్. 13

వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ. 14

సీ. చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి,
నెలుఁగించుగండుఁగోయిలలపొంపు

నలరుఁదేనియ గ్రోలి యున్న సోలంబుల,
మురియుచు తేఁటులనుమ్రోఁతయింపుఁ
దనిపండ్లరస మాని తమలోనఁ జెలఁగుచుఁ,
బలికెడురాచిల్కపదువురంగుఁ
గొలఁకులకొలఁకులఁ గూడి క్రీడించుచుం,
డెడునంచతండంబునడ బెడంగుఁ
తే. దరఁగఁ దేలుచుఁ బూఁదీవఁ దగులఁబడుచు,
వచ్చుచిఱుగాలిసోఁకును మెచ్చి మెచ్చి
తగిలి కొనియాడుచును వినతయును గద్రు,
వయును మున్నిటిచేరువవనమునందు. 15
వ. మెలఁగుచుండి రట్టియెడ. 16
చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చి గం
డరు వొనరించిరో హరుజటాస్థలికిం దొడవై నయేటిపె
న్నురువునఁ జేసిరో యన మనోజ్ఞసితచ్ఛవిఁ నుల్లసిల్లునుం
దరతురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్. 17
వ. నిజేచ్ఛమై వచ్చినయుచ్చైశ్శ్రవంబు నిట్లాలోకించి. 18
క. వినత హయ మింత యొప్పునె, యనూనధవళప్రభాఢ్యమై యని పలుకన్
విని కద్రువ యపరాంగం,బున నీలిమ దోఁచె నదియె భూపవరేణ్యా!.
చ. అనవుడు నమ్మృగాక్షి యిటు లాడితి నవ్వుల కాడితో నిజం
బునకునో నీదుచూపునకుఁ బోలినభంగియు చెప్పు మన్న న
వ్వనిత దరస్మితస్ఫురితవక్త్రముతో నిది యేటిమాట న
ల్లనియెడ గాన రాదె తెమలం బలుకం బని యేమి నావుడున్. 20
వ. వినత దెలియం జూచి. 21
ఉ. కాదని పూని పల్కుటయుఁ గద్రువ పన్నిద మేమి దీనికి
న్వాదిది యేల రిత్త యనినన్ విని యాసతి నిక్కమేని నీ

వేది పణంబుగాఁ దలఁచి యేర్పడఁ జెప్పితి దాని కేను సం
వాదము సేయుదాన గరువంబుగ నొక్కటి నిశ్చయింపుమా. 22

వ. అనిన వినిక ద్రువ వినతవదనంబునఁ జూడ్కి నిలిపి. 23

తే. నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను,
జేయఁగలదాన నేను గెల్చినను నీవు
నాకుఁ జేయంగఁగలదాన వీకడింది,
పన్నిదము సఱ మని తెగఁబాఱి పలికె. 24

క. ఆపొలఁతి యట్లు పల్కిన, శాపము ప్రేరేప నరుణజననికి నుత్సా
హోపేత మయ్యెఁ జిత్తం, బాపన్నిదమునకు నేమియనఁగల దధిపా!.

వ. ఇట్లు వినతయుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె నయ్యిరు
వురుఁ బంచమహాభూతంబులు సాక్షులుగాఁ బల్కి పన్నిదంబు సఱ
చిరి కద్రువ పతిపరిచర్యకుం గాలం బయ్యె మఱి వచ్చి యశ్వంబు
నాలోకింత మని శాపం బిడి యప్పటికిం జూపు దప్పించి యవ్విధంబున
మగిడి యరుగుదెంచిరి తదనంతరంబ. 26

సీ. కుటిలంపుఁదలఁపునఁ గొడుకుల రావించి,
కద్రువ యి ట్లనుఁ గన్నునీరు
దొరఁగంగ వారలతో నధిపాంతకు,
వినతయు నేనును వేడ్క నరిగి
యచ్చెరువ్వునఁ గడు నభిరామ మగునొక్క,
యశ్వంబుఁ గాంచితి మవ్వఘూటి
కేవలధవళంబు నా విని యొద్దార,
మునకు నే నది నల్లఁదనము గంటె

తే. వెనుక దెస నన్న వా దయ్యెఁ గనలి పన్ని,
దంబు సఱచితి మోడిన దాస్యవృత్తి
వచ్చు సవతికి నే నెట్లు వరవుడంబు,
చేయఁ దగుఁ దోఁక నల్లగాఁ జేయరయ్య!. 27

చ. అనవుడు వాసుకిప్రభృతు లక్కట ధర్మువు గాదు నీవు మా
చినతెరు వట్టిగెల్పు శుభసిద్ధి యొనర్చునె యట్లు గాక యొ
వ్వనితయుఁ దల్లి గాదె గరువంపుఁదనంబునఁ జూడ మాకు ని
ట్లనఁ దగునమ్మ! యి ట్లయిన నయ్యెను శాపము సేయ నెచ్చనే. 28

క. ఈవిధ మిమ్మెయి నైనం, గావింపఁగ వలయు ననుట గల్గినఁ బరదే
శావాసుల మగుదుము మము, నీ వింకం దగదు తల్లి! నిర్బంధింపన్. 29

క. అని రట్టియొడం గొందఱు, జననిఁ దొలఁగి యొక్కడేనిఁ జని రాభంగిం
జనినతనూజులఁ జేర్కొని, నెనరు విడిచి యానెలంత నిష్ఠురమతి యై.

{కద్రువ దనకొడుకులకు జనమేజయునివలన
నాశంబు గల్గునట్లు శపించుట.}

చ. అమృతకరాన్వయంబున మహాముని వేడ్క నరుండు పాండుభూ
రమణునిదేవి గొంతియుదరంబునఁ బుట్టి ధనంజయాదినా
మముల వెలుంగఁ దత్సుతునిమన్మఁడు సంభృతధర్మ మైనకీ
ర్తి మెఱయ నేల యేలు జనమేజయనాముఁ డరాత్యజయ్యుఁ డై. 31

ఉ. అతఁడు సర్పయాగ మనునధ్వరముం గుపితాత్ముఁ డై పితృ
ప్రీతిగఁ జేయఁ దద్దహనభీకరభూరిశిఖాప్రవేశసం
జాతదురంతతాపమునఁ జావఁగలా రని శాప మిచ్చెఁ ద
త్పాతకవృత్తికిన్ వెఱచి తక్కటినాగము లాభుజంగితోన్. 32

తే. నల్లగాఁ జేయువార మే మెల్లభంగి,
నాతురంగమపతివాల మని రయమునఁ
బోయి వాలధరోమముల్ పొదివి నీల,
రోమసంచయ మెరి కురుక్షితీశ!. 33

క. కద్రువ గర్వించి సంతో, షద్రితమతి యగుచుఁ బిలిచి సవతికిఁ జూపెన్
భద్రాత్మకయగు వినతయుఁ, దద్రోహంబెఱుఁగ కేమి దైన్యమునొందెన్.

క. నగుచుం గద్రువ వరవుడ,
వగుచు విచారంబు విడిచి యనుడు వినత య
ట్లగుఁ గాకని లజ్జయుఁ బెను,
వగయుఁ దొలఁగఁ ద్రోచి చేసె వరవుడము దగన్. 35

వ. ఇట్లు కపటజయంబునఁ గద్రువ సత్యవినయాదిగుణవతి యయినవినతం
దనకు దాసిం జేసికొని పరిహీనంబు అయినపరిచారికాకృత్యంబుల నిత్యం
బు నలంచుచుండెం బదంపడి యప్పరమసాధ్వి దనయగ్రతనయుం డాదే
శించినతెఱం గూహించి రెండవయండంబున జనియించినతనూజుం దలం
చుచు నాసపాటు గదిరినహృదయంబుతో దాస్యం బనాలస్యంబున
నడపు చుండ. 36

ఉ. యౌవనదర్ప మంది జవ మంతకు నంతకు నగ్గలింప మై
లా వధికంబు గాఁగ నుపలాలన సేయఁగఁ బద్మసంభవుం
డావిహగోత్తముండు హృదయంబున గర్వ మెలర్ప నుద్ధతుం
డై విహరింపఁ జూచి యొకయప్పుడు నారదుఁ డల్లఁ జేరినన్. 37

వ. అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు నమ్మునిపుంగవుం
డి ట్లనియె. 38

తే. దాసి యై సవతాలికిఁ దల్లి పనులు, సేసి నలఁగంగ నద్దెసఁ జింత వంత
లేక నీవిట్లు తిరుగుట తెల్లయగునె, యద్భుతోజ్జ్వలతేజ కశ్యపతనూజ.

చ. అనుడు విహంగనాథుఁడు మదంబకు దాస్యమురాకకుం గతం
బనఘవిచార ! యేది తెలియన్ వినిపింపవె యన్నఁ జెప్పె న
మ్మునివరుఁ డున్నరూపు హయముం గనుటాదిగఁ గద్రుకశ్యపాం
గనలచరిత్ర మాతని కఖండపరిస్ఫుటభాషణంబులన్. 40

ఉ. చెప్పినఁ గోపముల్ పగపుఁ జిత్తమునం గదురంగ వేలుపే
లప్ప హితంబు సేసెఁ జెలియల్ మను చున్నది పెంపుతోడ నం
చప్పుడ వాయువేగమున నయ్యెడకుం జని మాట యొద్దియుం
జెప్పక తల్లికిం బ్రణతి సేసె విషాదభరార్తమూర్తియై. 41

వ. కద్రువపాలికిం బోయి. 42

చ. పరమవినీతిమై నెఱఁగి బాంధవ మారఁగ నల్ల నిట్లనున్
గరుడుఁడు దారితారి పగఁ గందుచు నీచెలియల్ చరించుని
వ్వరవుడ పుంజరిత్రమున వచ్చెనె నీ కొకపేర్మి యాసతిం
గరుణ యొలర్పఁగా విడువ గౌరవసంపదఁ జేయు నెంతయున్. 43

ఉ. నీకును నేను బుత్రుఁడన నెప్పుఁ దగన్ ననుఁ జూచి గ్గొనఁ ద
ల్లీ! కృప సేఁత పెద్దయును లెస్స యధర్మము ధర్మ మన్నఁగల్
వా కవి యేల దాస్యకృతి నాజనయిత్రికి నివ్విధంబున
నాకయు దైవకృత్యమ మనంబునఁ గొంగుదు విడ్వ గ్గినన్. 44

వ. అనిన విని మొగంబు ముఱుకటించుకొనుచుఁ గద్రువ గరుత్మంతున
కిట్లనియె. 45

మ. బలవంతుండవు నేర్పుచందములఁ జెప్పం జాలి యొక్కతప
ల్కులఁ దేర్పం బని లేదు తల్లికి మదిం గూర్తేని నే పోయి లో
కులు నిన్నుం బ్రణుతింపఁ బె మ్మమృతముల్ ఘోరంపుదాస్యంబు నేఁ
డోలఁగం బెట్టెద మీ కనంత మగుసంతోషంబు సంధిల్లఁగన్. 46

చ. అన విని దాని కియ్యకొని యప్డు సుపర్ణుఁడు వోయి కశ్యపుం
గని తనభాషణంబులును గద్రువపల్కులుఁ జెప్పి తెచ్చువాఁ
డ నమృత మెట్లు నే నని యొడంబడి వచ్చితి నన్న నాతఁ డ
త్తనయునిఁ జూచి యుల్లము ముదంబును నచ్చెరువాటు నొందఁగన్.

క. అమృతంబు దుర్లభం బ,య్యమరుల కేనియు నతిప్రయత్నంబున గు
ప్తము సేసి యుండు వాసవుఁ, డమలచరిత! నీకు నగునె యట్టిది తేరన్.

వ. వినుము. 49

చ. ఉదకము రక్షకం బగుచు నుండఁగ నుజ్జ్వలవహ్ని యందునుం
బొదువఁ గృపాణశక్తిముఖఘోరితరాయుధహస్తులై బలో
న్నదులు మహోగ్రకోపులు ఘనస్థిరకాయు లనేకరాక్షసు
లొప్పదిగొని కావ నివ్వెలలో నమృతంబు సురక్షితస్థితిన్. 50

క. ఉండు నన విని విహంగవి,
భుం డల్లన నగుచు నీవు పుత్త్రిస్నేహా
ధ్యుండ వయి పలికితే బలి,
యుండ నుపాయజ్ఞుఁడను మహోజ్జ్వలతేజా! 51

మ. అనుమానం బగి యేల తెచ్చు నమృతం బన్నం గడుం బొంగి యా
తనిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి కశ్యపుఁడు పుత్త్రా! నిశ్చయం బట్లయే
ని విభవంబుం గమకంబునుం గలవు వానిం దిన్న లావెక్క నా
ఘనజంతుద్వితయంబు నీకు నెరగాఁ గల్పించితిం బోవనా!. 52

వ. అనుటయు సంతోషించి గరుత్మంతుం డాగజకచ్ఛపంబు లెచ్చట
నుండు నెబ్భంగివి యని యడిగిన నమ్మునీంద్రుం డవ్విహగేంద్రున
కిట్లనియె. 53

కశ్యపుఁడు గరుడునకు గజకచ్ఛపంబుల తెఱఁ గెఱింగించుట.

సీ. ప్రాక్పయోనిధిపొంతఁ బర్వతం బొక్కటి,
ఘనశృంగకలితాకాశ మగుచు
నురగధామంబున నొప్పు నచ్చేరువ,
వసియించు నొకమహావారణంబు
దానితటంబునఁ దామరకొల నబ్ధి,
ననుకరించుచు మధురాచ్ఛవారి

సంపద సొంపారు సమదలీలల నగ్గ,
జంబూనగంబుపై సంచరింప

తే. మిట్టఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క,
మట్టమై యది నునుపారు మహితమైన
యక్కొలన నీరు ద్రావఁగా ననుదినంబు,
నరుగు నయ్యిభవల్లభుఁ డనఘచరిత !. 54

ఉ. అంత నొకకచ్ఛపప్రవరుఁ డత్యధికం బగుకాయముగ్ బలం
బుం దనరగ్ వసించు జలముం గొనువాంఛ గజంబు వోయినం
జెందఁగ నీక సంగరముఁ జేయుఁ దెవంగుచు నీరు ద్రావ గా
రుం దెగి యుండు నిట్లు పగ నొప్ప మెలర్పఁగ నాఁడు నాఁటికిన్. 55

క. విను మధుకైటభు లనియెడు,
దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియు నై పు
ట్టినవారు దమ్మెఱుంగమిఁ,
బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్. 56

క. ఒంటిమెయి నుండఁగా ను,
క్కంటికి నాకచ్ఛపంబు గొరుం బట్టం
గంట మరిది యొక్కొక్కటన,
రెంటిం బొదువంగ వలయు రే వెర వారన్. 57

వ. అనుడు వైనతేయుండు. 58

ఆ. ఒకటి గొలనిలోన నుండు నొక్కటి గొండ,
మీఁద సంచరించు మీరు రెంటి
నడఁగ నొక్కమాట యడరి పట్టుట కృత్య,
మనియెదరు వశంబె యట్లు చేయ. 59

వ. అనిన నది యట్టిద యుపాయంబు సెప్పెద నాకర్ణింపుమని మున్ముని
వరుండు. 60

చ. కరిపతి నీరు ద్రావుటకుఁ గాఁ జనుదెంచినఁ గూర్మరాజు సం
గర ఘుర్ఘురించు చుండి తమకంబున నీళ్లలఁ బాసి వీఁకమై
దరి నడరంగఁ బట్టు నది తత్సమయంబున రెంటిఁ గూడ నీ
వెరవున నూఁది చిత్తమున వేగిరపాటు లేక పొంచుమీ. 61

వ. అని యుపదేశించిన వీడ్కొనుటకు వినతుం డయినతన్ను నత్యాదరంబునం గనుంగొని యత్తపోధనసత్తముండు నీవు గజకచ్ఛపంబుల నాహారంబుగాఁ గొనిన నీకుం ద్రిదశాహారంబు దేర దొరకొనుటకు సందేహంబు లే దనుపల్కు పల్కి పరమాశీర్వాదంబు లిచ్చిన. 62

మ. విని యుత్సాహము గందళింపఁగ వియద్వీథీగతుండై విమా
నని కాయంబులు దూలఁ బక్షతివితానస్ఫారదీప్తివ్రజం
బినరశ్మిప్రకరంబుఁ గీడ్పఱుపఁ బక్షీంద్రుండు చంచద్గతిం
జనియెం దా నురగాభిధాన మగునాశైలంబు పెందిప్పకున్. 63

క. చని యల్పశరీరుం డై
తను నెఱుఁగక యుండ మెలఁగి దా నుగ్రగజేం
ద్రునిఁ గాచి నీరి కది వో,
యునయప్పుడ వెనుకఁ జనియె నెలమి దలిర్పన్. 64

ఉ. దంతి సనంగ భూరిమదధారలగాలి యెఱింగి కూర్మ మ
త్యంతసముద్ధతిం గొలని కడ్డపడన్ వెస వచ్చె వచ్చినన్
దంతియు నీరువట్టున నుదగ్రపుఁగోపము సందడింప దు
ర్దాంతసముద్యమం బెసఁగ దానిపయిం గవిసెన్ మహోగ్రమై. 65

చ. కవిసి ఖరంబులైనమునికాళ్లను వ్రేయఁగ పాము నీరిలో
ను వెడల కుండి కూర్మ మతనుస్థిరతీవ్రనఖంబులం బదా
గ్రవిదళనంబు చేయఁగఁ గరంబున మోఁదఁగ వారణంబు దం
తవిహతి నొంపఁ గచ్ఛపము దారుణ మయ్యె రణంబు భూవరా!. 66

ఉ. ఇమ్మెయిఁ బోరి పోరి మది నేపున గోపము నగ్గలింపఁ గూ
ర్మమ్ము గడంగి నీర్వెడలి మత్తకరిన్ బడి నా[illegible]
గ్రమ్మున రెంటినిం బొదివి కచ్ఛపమున్ వలకాల వామపా
దమ్మున వారణంబును ముదమ్మునఁ బట్టి తగిల్చె గోళ్లలన్. 67

వ. ఇట్లు వినతపట్టి పట్టిన నవి దమయంగంబులు వ్రేలం బడ నడిచిపడు
టయు నతండు. 68

మ. వెలుచన్ గోళుల నొత్తి యగ్గజముఁ దాఁ బేలున్ వసం బేది మూ
ర్ఛల నొందన్ వెస నెత్తి మేఘయుగళీసక్తోల్లసద్గైరికా
చలవై హాయసకేలియో యన నభస్సంచారి యై యుబ్బున
గ్గలికన్ దవ్వుగఁ బాఱి యొక్క ఘనవృక్షం బయ్యెడం దోఁచినన్. 69

ఆ. దానిమీఁద నుండి వాని రెంటిని భుజిం,
పంగ మదిఁ దలంచి పంచయోజ
నములు నిడుపు గల్గు రమణీయశాఖపై,
గరుడుఁ డెలమి నెఱఁగెఁ గురువరేణ్య! 70

క. ఎఱిఁగినయప్పెనువ్రేఁగున,
విఱుగుటయును శాఖ చూచి విహగేంద్రుఁడు గ్రిం
దఱ మునుల నందుఁ గన్గొని,
వెఱపున నాత్మీయచిత్తవృత్తి గలంగన్. 71

తే. అవనిఁ బడ నీక శాఖఁ జంచువునఁ బట్టి,
పట్టి వారలమస్థితుల్ పల్లటిలక
యుండ వెరవున ధరియించి యొయ్య నెగయఁ,
జూచి యవ్వాలఖిల్యులు చోద్య మంది. 72

వ. వైనతేయుం డగుట మనంబుల ననుసంధించి కరుణించి. 73

క. ఈతఁడు దక్కఁగ నొరులకు, నీ తెఱఁగుబలంబు వెరవు నేల కలుగు నం
చాతరుశాఖ విడిచి చని, రాతని దీవించి యోగ్య మయ్యెడు నెడకున్. 74

వ. చనినఁ గరుత్మంతుండు సంతోషించెఁ దదనంతరంబ. 75

ఆ. విపులశాఖ నిచట విడచిన నిచ్చటి, జంతుకులము లెల్లఁ జచ్చు నింక
నేమి సేయువాఁడ నే ననునెవ్వఁగ, వృష్టె నవ్విహంగపుంగవునకు. 76

వ. అట్టియెడ. 77

తే. నిందితాచారయుతము పుళిందదేశ,
మంబుధిప్రాంత మీశాఖ యందు విడువు
మమరవరులపఁ పిఁడి విహగాధినాథ !.
యనునెలుంగు నభంబునం దావిహిల్లె. 78

క. విని సత్వరముగ నటఁ గాని,
చని యద్దేశమునఁ గల్గు జనములు మృతిఁ బొం
ద నతం డాచక్కటి నా,
ఘనశాఖయు నెమ్మనంబునం బడయక విడిచెన్. 79

వ. విడిచి భరితలీలంబుగా నొక్కశైలంబువిశాలతటంబునకుం బోయి. 80

క. కరిశచ్ఛపముల పెన్నె,
త్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడుఁ దుష్టిగఁ బక్షి
శ్వరుఁ డాని యధికబలబం,
ధురుఁడై యమృతమున కేఁగె దుర్గాంతగతిన్. 81

వ. ఇవ్విధంబున. 82

క. చని దానిచుట్టు మండెడు,
వనలంబును జూచి తన్మహత్తరజిహ్వాల్
దసికిన నెఱకలు గమరునో,
యనుతలఁపున బ్రహ్మఁ గాన నరిగె రయమునన్. 83

వ. అరిగి తచ్చరణంబులకుం బ్రణతుఁడై కేలు మొగిచి. 84

చ. వినతకు దాస్య మొందె నొకవెంటఁ దదీయనిరాసహేతువై
యనఘవిచార ! నాకు నమృతాహరణంబు విధేయ మయ్యె న

ప్పని మొయి నగ్ని చేత నగుఁబా టగు నన్యాజంతో భవద్గుణా
వననిధి నాశ్రయించుటకు వచ్చితి నా ర్తశరణ్య ! కావవే. 86

వ. అనుటయు. 8

చ. అతనికి బత్నలుం డగుట నంబుజగర్భుఁడు విన్న పైపయిన్
వితతము గాఁగ జిహ్వలకు వ్రేఁ గగునట్లుగఁ జాల వైచినం
బతగవరేణ్య ! ప్రకృష్టబడుఁ బావకుఁ డయ్యెడఁ జొచ్చి నీదువాం
ఛితము ఫలింప సత్వరతఁ జేకొను మయ్యమృతంబు నావుడున్. 87

ఆ. ఆత్మఁ బొంగి మ్రొక్కి యతఁ డాలమందలు,
పరపు లైనయెడల కరిగి యరిగి
కొండయంత వెన్న గూర్చి వేగమ కొని,
పోయి యమ్మహాగ్నిఁ బొదియ వైచి. 88

గరుడుఁ డింద్రుని జయించి యమృతంబు దెచ్చి
కద్రువకుఁ జూపుట.

శా. నీరుం బాయఁగఁ జల్లి రాక్షసులయున్నేమంబు మర్దించి హ్వా
త్మారోదారుఁ డరోగమయం బయిన యజ్ఞాలంబు వే ద్రచ్చి దు
ర్వార స్వైరవిహార మొప్ప నమృతగ్రాహం బొడంగూడుచుం
దారావీథిఁ జనం దొడంగె మగుడన్ దర్పం బెలర్పన్ వడిన్. 89

# భా గ వ త ము.

## దశమస్కంధము.

### (10). సత్యభామ చేసిన యుద్ధము.

మ. బలవంతుండు ధరాసుతుండు గని శుంభద్రాజబింబోపరి
స్థలశంపాన్విత మేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయుచున్
జ్వలనీలాంగుఁ గనన్నిమంగుఁ గుహనాచంగున్ రణాభంగునిన్. 1

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి
సంభ్రమంబున. 2

శా. వేణిన్ జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండలమరీచీజాలము ల్పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రాణేశాగ్రభాగంబునన్. 3

క. జన్యంబున దనుజునిదో,
ర్దైన్యము లడుపంగఁ గోరి చనుదెంచినసౌ
జన్యవతిఁ జూచి యదురా,
జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్. 4

క. లేమా! దనుజుల గెలువఁగ,
లేమా నీ వేల కడఁగి లేచితి విటు రా
లే మాను మానవేనియు,
లే మావి ల్లందికొనుము లీలం గేలన్. 5

వ. అని పలికి. 6

క. హరిణాక్షికి హరి యొసఁగెను,
సురనికరోల్లాసనమును శూరకఠోరా
సురసైన్యత్రాసనమును,
బరగర్వనిరాసనమును బాణాసనమున్. 7

శా. ఆవి ల్లంది బలంబు నొంది తదగణ్యానంతతేజోవిశే
షావిర్భూతమహాప్రతాపమున వీరాలోకదుర్లోకయై
తా వేగన్ సగుణంబు చేసి ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతోన్. 8

క. నారి మొఱయించె రిపునే,
నారింఖణహేతువైన నాదము నిగుడ
న్నారీమణి బలసంప,
న్నారీభాదకము మూర్ఛ నంద నరేంద్రా!. 9

సీ. సౌవర్ణకంకణఝణఝణ నినదంబు, శింజినీరవముతోఁ జెలిమి సేయఁ
దాటంకమణిగణధగధగదీప్తులు, గండమండలరుచు ల్గప్పికొనఁగ
ధవళతరాపాంగధళధళరోచులు, బాణజాలప్రభాపటలి నడఁప
శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథి, సైనికకలకలస్వనము నుడుప
తే. వీరశృంగారభయరౌద్రవిస్మయములు,
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
విషువుఁ దొడువుట దివుమట యేయు టెల్ల,
నెఱుఁగరా కుండ నని జేసె నిందువదన. 10

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
వితతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారము
న్జరగ న్గన్నులఁ గెంపు సొంపు బరఁగ న్జండాస్త్రసందోహము
స్స్మరసాయకసమూహము న్నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్. 11

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢపాదంబుతో
నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణకానీతస
ల్లలితజ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై. 12

సీ. బొమ్మపెండ్లిండ్లకుఁ బో నొల్ల నను బాల,
రణరంగమున కెట్లు రాఁదలంచె
మగవారిఁ గనినఁ దా మఱుఁగుఁ జేరెడునింతి,
పగవారి గెల్వ నేపగిదిఁ జాలెఁ
బసిఁడియుయ్యల నెక్క భయ మందుభీరువు,
ఖగపతిస్కంధ మేపగిది నెక్క
సఖులకోలాహలస్వనము లోర్వనికన్య,
పటహాభాంకృతుల కెబ్భంగి నోర్చె

ఆ. నీలకంఠములకు నృత్యంబు గఱపుచు,
నలసి తలఁగి పోవునలరుఁబోఁడి
యేవిధమున నుండె నెలమి నాలీఢాది,
మానములను రిపులమాన మడఁప. 13

సీ. వీణెఁ జక్కఁగఁ బట్ట నెరవెఱుంగనికొమ్మ,
బాణాసనం బెట్లు పట్టనేర్చె
ప్రాఁకునఁ దీఁగెఁ గూర్పంగ నేరనిలేమ,
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరసముత్యము గ్రువ్వఁ జాలనియబల యే,
నిపుణత సంధించె విశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్ప నేరనితన్వి,
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ

ఆ. బలుకు మనినఁ జెక్కుపలుక నిముగుద యే,
గతి నొనర్చె సింహగర్జనములు
నసఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ,
చారుసత్యభామ సత్యభామ. 14

శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ సుర ల్సారంగయూథంబుగా
నావి ల్లింద్రశరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగాఁ
దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్నిమగ్నంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్. 15

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు,
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై,
యలరుఁ బూఁబోఁడిచేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై,
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై,
తనరారు నింతిసందర్శనంబు

ఆ. హర్షదాయియై మహారోషదాయియై,
పఱచు ముద్దరాలిబాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార,
వీరరసము లోలి విస్తరిల్ల. 16

వ. ఇవ్విధంబున. 17

క. శంపాలతికలజాడిదపు,
టంపఱచే ఘోరదానవానీకంబుల్
పెంపఱ సన్నాహంబుల,
సొంపఱ భూసుతుని వెనుకఁ జొచ్చె న్వెచ్చెన్. 18

వ. అయ్యవసరంబునం గంసహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం
గరుణారసావలోకన ప్రసారియు మధురవచనసుధారసవిసారియుం
దదీయసమరసన్నాహనివారియునై యిట్లనియె. 19

క. కొమ్మా! దానవనాథుని,
కొమ్మభావమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ,
గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్. 20

వ. అని పలికి సమ్మానరూపంబులును మోహనదీపంబులును దూరీకృతచిత్త
విక్షేపంబులు నైనసల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దతికంబు చేసి
తత్కరకిసలయోల్లసితబాణాసనంబు మరల నందుకొనియె. 21

---

## (11). నృగచరిత్ర.

సీ. ధరణీశ! యొకనాఁడు హరితనూజులు రతీ,
శ్వర సాంబ గద చారు చారుభాను
లాదిగా యదుకుమారావలి యుద్యాన,
వనమున కతివైభవమున నేఁగి
వల నొప్ప నిచ్ఛానువర్తులై సుఖలీలఁ,
జరియించి ఘనపిపాసలను బొంది
నెటఁ దప్పి నీరల మన్వేషించుచును వేగ,
వచ్చుచో నొకచోట వారిరహిత
తే. కూపమును నందులో నొకకొండవోలె,
విపులమగు మేనియూసరవెల్లిఁ గాంచి
చిత్తమున విస్మయం బంది తత్తరమున,
దాని వెడలించువేడుక దగులుటయును. 1

చ. పరువిడి పోయి తెచ్చి ఘనపాశచయంబుల నంటఁగట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి కోయని యార్చుచు దాని నెమ్మెయిన్
దరలఁగఁ దీయలేక దగ దట్టుముగా మది దుట్టగిల్ల నొం
డొరుఁ గడవంగ వే చని పయోరుహనాభున కంత చెప్పినన్. 2

చ. విని సరసీరుహాక్షుఁ డతివిస్మితుఁడై జలశూన్యకూప మ
ల్లనఁ గదియంగ నేఁగి కృకలాసము నొక్కతృణంబుపోలె గొ
బ్బున వెడలించె వామకరము న్లలిఁ జొన్పి య దంతలోనఁ గాం
చనరుచి మేను గల్గి పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్. 3

వ. ఇట్లు నిల్చినం జూచి కృష్ణుం డతనివృత్తాంతం బంతయు నెఱింగియు
నక్కడిజనంబును గుమారవర్గంబును దెలియుకొఱకు నతనిచేతన తద్వృ
త్తాంతం బంతయు నెఱింగించువాఁడై యిట్లనియె. 4

చ. కనదురురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై
యనుపమకీర్తిశోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిననీకు నేమిగతి నూసరవెల్లితనంబు చొప్పడెన్
విన నిది చోద్య మయ్యె సువివేకచరిత్ర! యెఱుంగఁ జెప్పుమా. 5

క. అని యడిగిన మురరిపుపద,
వనజమ్ములు తనకిరీటవరమణు లొఱయన్
వినయమున మ్రొక్కి యిట్లను,
ఘనమోదముతోడ నిటలఘటితాంజలి యై. 6

గీ. విశ్వసంవేద్య! మహిత! యీవిశ్వమందుఁ,
బ్రకటముగ నీ వెఱుంగని దొకటి కలదె?
యైన నాచేత విన నిష్ట మయ్యె నేని,
యవధరింపుమా వినిపింతు నంబుజాక్ష! 7

శా. ఏ నిక్ష్వాకుతనూజుఁడ న్నృగుఁడ నా నేపారుభూపాలుఁడన్
దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ కొల్చి సం

మానింపం జతురంతభూభరణసామర్థ్యుండనై సంతత
శ్రీ నిండారినవాఁడ సల్లలితకీర్తిస్ఫూర్తి శోభిల్లఁగన్. 8

చ. పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతక మందు రటుండఁ దారకా
వలి సికతావ్రజంబు హిమవారికణంబులు లెక్కవెట్టఁగా
నలవడుఁ గాని నేను వసుధామరకోటికి దాన మిచ్చు గో
వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ! యేమి చెప్పుదున్. 9

వ. అదియునుం గాక. 10

చ. పొలుచుసువర్ణశృంగఖురము లొనరం దొలుచూలులై సువ
త్సలుగల పాఁడియావుల సుదాత్తతపోవ్రతవేదపాఠముల్
గలిగి కుటుంబులై విహితకర్మములం జరియించునట్టి వి
ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా!. 11

వ. మఱియు న్యాయసముపార్జితవిత్తమ్ముల గోభూహిరణ్య రత్ననివాస
రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజత శయ్యాది
బహువిధదానంబు లనూనంబుగ ననేకంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబు
లొనరించితి వాపీ కూప తటాక వన నిర్మాణంబులు సేయించితి నివ్వి
ధంబునఁ జేయుచో నొక్కనాఁడు. 12

క. అనఘాత్మ! కశ్యపాఖ్యుం,
డనువిప్రునకే నకల్మషాత్ముఁడనై యి
చ్చిన గోవు దప్పి నామం,
దను కలసినఁ దెలియ లేక తగ నాగోవున్. 13

క. ఒండొకభూమీసురకును,
మండనునకు దాన మీయ మసలక యావి
ప్రుం డాగోవుం గొని చను,
చుండఁగ మును ధారఁ గొన్న యుర్వీసురుఁడున్. 14

క. మది రోష మొందవ దోవతి,
వదలిన బిగియించుకొనుచు వడిఁ జని యిది నా

మొదవు నడివీథి దొంగిలి,
వదలక కొనిపోయె దిట్టివారుం గలరే. 15

చ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో నిపుడేను దీని నీ
జనపతిచేత ధారఁ గొని సాధుగతిం జన నీది యంట యి
ట్లనిన నతండు నేనును ధరాధిపుచే మును ధారఁగొన్న యా
వని విసిపింప నిద్దఱకు నయ్యె నపారవివాద మచ్చటన్. 16

వ. ఇట్లు విప్రులిద్దఱుం దమలోన నంతకంతకు మచ్చరంబునం బెచ్చు
పెరిఁగి కలహించి నాయున్న యెడకుం జనుదెంచి మున్ను నాచేతఁ
గోదానంబుఁ గొన్న బ్రాహ్మణుం డిట్లనియె. 17

సీ. మనుజేంద్ర! ప్రజ లధర్మప్రవర్తనముల,
నడవ కుండఁగ నాజ్ఞ నడపు నీవు
మనమున నేధర్మ మని యాచరించితి,
మును నాకు నిచ్చిన మొదవు దప్పి
వచ్చి నీమందలోఁ జొచ్చిన నప్పుడీ,
భూసురునకు ధార వోసి యిచ్చి
తగవు మాలితి నీవు దాతవు నపహర్త,
వైన నిన్నేమన నవనినాథ!

తే. యనినమాటలు చెవుల సోఁకినఁ గలంగి,
భూసురోత్తమ! యజ్ఞానపూర్వకముగ
నిట్టిపాతక మొఱసె నే నెఱిఁగి సేయఁ,
గొనుము నీ కిత్తు నొకలక్ష గోధనంబు. 18

క. అని మఱియును నవ్విప్రుని,
సునయోక్తుం ననునయించుచును నిట్లంటిన్
ననుఁ గావు నరకకూపం
బునఁ బడఁగాఁ జాలఁ బురుషపుంగవ! యనినన్. 19

గీ. ఎంత వేఁడిన మత్సరం బంత పెరిఁగి,
మొదల నా కిచ్చినట్టియయ్యెన్నదవె కాని
యొనయ నీరాజ్య మంతయు నిచ్చితేని,
యొల్ల నని విప్రుఁ డచ్చట నుండ కరిగె. 20

వ. అట్లతం డరిగిన నా రెండవ బ్రాహ్మణుం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివేలేరికోరు పాఁడి మొదవుల నిచ్చిన నైనను దీనిన కాని యొల్ల నని నిలువక చనియె నంతఁ గాలపరిపక్వంబైన నన్ను దండధరకింకరులు గొని పోయి వైవస్వతు ముందరం బెట్టిన నతండు నన్ను నుద్దేశించి యి ట్లనియె. 21

మ. మనుజేంద్రోత్తమ! వంశపావన! జగన్మాన్యక్రియాచార! నీ
ఘనదానక్రతుధర్మముల్ త్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్
మును దుష్కర్మఫలంబు నొంది పిదపం బుణ్యానుబంధంబులై
చనుసౌఖ్యంబులఁ బొందు పద్మజునియాజ్ఞన్ ద్రోవఁగా వచ్చునే. 22

వ. అని వేగంబునఁ ద్రోపించిన నే నపుడ పుడమిం బడి యీనికృష్టంబైన యీసరవెల్లిరూపంబుఁ గైకొంటి నింతకాలంబు తద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యంబుల యారక పోనేరవు నేఁడు సమస్తదురితనిస్తారకం బయినభవదీయపాదారవిందసందర్శనంబునం జేసి యీఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మకుండ నైతి నని పునః పునఃప్రణామంబు లాచరించి మఱియు ని ట్లనియె. 23

గీ. కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!
యప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్నుఁ జూడఁ గంటి నీకృపఁ గనుఁగొంటి,
నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి. 24

వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందునిపదంబులు తనకిరీటంబు సోఁకఁ బ్రణమిల్లి దేవా! భవదీయపాదారవిందంబులు నాహృదయారవిందంబునం బాయ కుండునట్లుగాఁ బ్రసాదింపవే యని తదనుజ్ఞాతుం డై యచ్చటి జనంబులు సూచి యద్భుతానందం బొంద నతుల తేజోవిరాజితం బైనదివ్యవిమానమం దాసీనుం డై గగనంబున కరిగె.

---

రమణీయతనులిప్తరక్తచందనచర్చ,
కలితసంధ్యారాగకాంతి నెనయ
మకుటనానారత్నమణిగణదీధితు,
లప్పర్జన్యకార్ముకప్రభల నీన
భూరివక్షంబునఁ బొల్చుహారశ్రేణి,
లలితబలాకాళి చెలువు నొలయ

తే. భయవిహుంకృతి గర్జలపగిదిఁ జెలఁగ,
మేచకాభ్రంబుకైవడి మేను వెలుఁగ
దృష్టి కకుబ్జ మారెను తేజ మెసఁగ,
వాఁడిమఁ గటిమిఁ గోఁ గను బ్రావృణ్మహిమ. 11

మ. పటువిస్ఫూర్జితపంక్తిమస్తకమణిప్రస్ఫారదంష్ట్రాగ్రుఁడుం
గుటిలభ్రూకుటిభీమభీమచటులక్రూరస్ఫులింగచ్ఛటో
ద్భటఘోరాగ్నిశిఖాకులేక్షణుఁడుఁ బ్రోద్దండప్రలంబోష్ఠసం
స్ఫుటసంస్పృష్టిలికదాశవక్త్రుఁడును జిహ్వోల్కకరాళాకారుఁడున్. 12

ఉ. హాటకశైలశృంగసముదంచితజూటుఁడు రత్నచిత్రిత
స్ఫాటికఖడ్గసంగతుఁడుఁ జారుదుకూలసమావృతాంగుఁడై
కోటులు కంకణక్వణనశోభితపాణులు చేరఁ జామర
ల్వాటఁగ వీవఁ బ్రాభవవిలాససమున్నతి లొప్ప నొప్పుచున్. 13

వ. నానారత్నచిత్రితంబును గాంచనమయంబును నైన యాస్థానంబునఁ బ్ర
హస్తప్రముఖులైనమంత్రులు పరివేష్టింప నమరసేవితుండైన దేవేంద్రు
నిమాడ్కి దేదీప్యమానుండై మెఱసియున్న లోకవిద్రావణు రావణుం
జూచి జగత్ప్రాణతనూభవుం డచ్చెరు వందుచు నంతరంగంబున. 14

క. ఈరూపము నీఘనభుజ,
పారము నీధృతియు నీసౌందర్యము వి

స్ఫారోదారగుణంబులు,
నీరాక్షసవిభునిశౌర్య మిట్లొప్పెడునే? 15

క. సాహసవర్తియు రాక్షస,
జాతుఁడుఁ గాకుండెనేని శక్రాదిసుర
వ్రాతంబున కధిపతి యై,
యీతఁడు లోకంబు లెల్ల నేలం దగఁడే? 16

వ. అని విచారించువృక్షచరుని రోషతామ్రాక్షుం డగుచు నిరీక్షించి రాక్ష
సచక్రవర్తి ప్రహస్తున కిట్లనియె. 17

క. నిను నెవ్వఁడు పుత్తెంచెను,
వన మేటికిఁ జెఱిచితీవు వడి రాక్షసభం
జన మేల చేసి తెవ్వఁడ,
వని యడుగుము నావుడుం బ్రహస్తుం డతనిన్. 18

క. కనుఁగొని తేజము చూడఁగ,
వనచరమాత్రుఁడవు కావు వచ్చినపని యం
దన నేయక భయ మందక,
వినిపించిన నిన్ను వేగ విడిపింతుఁ దగన్. 19

క. సురవరుఁడో దండధరుఁడో,
వరుణుఁడో ధనదుండో దైత్యవరుఁడో నన్నీ
పురి సార మరయఁ బంపిన,
యూరుబలుఁ డెవ్వండో నాకు నొప్పఁగఁ జెప్పుమా. 20

వ. అనినం బ్రహస్తున కనిలజుం డిట్లనియె. 21

క. హనుమన్నాముఁడ మారుత,
తనయుఁడ రఘురాముదూతఁ దపనప్రియనం
దనునకు సచివుఁడ నిక్కువు,
వనచరుఁడన్ సీత వెదక వచ్చితి నిటకున్. 22

క. దివిజారిదర్శనం బ,
న్యవిధముల న్నాకు దొరక దని వనభంగం
బు వడిం జేసితిఁ జేసితి,
బవరము నారక్షకాళికి బలములతోడన్. 23

ఉ. కరము విరించిచే వరముఁ గాంచినవన్ను శరంబుల న్సురా
సురులకుఁ గట్ట రా దవుటఁ జూ శరము స్రుక్కఁడనైతి లోకభీ
కరు దశకంఠు నొందుగతిఁ గాన నశక్యము గాన రాక్షసో
త్కరముల చేతఁ గట్టువడి కన్గొనువేడ్కతోడ వచ్చితిన్. 24

వ. అని పలికి రావణుం గనుంగొని. 25

క. ఇనజుఁడు నీతోఁ బుట్టువు,
నినుఁ గుశలం బడుగు మనియె న్నృపతియు రవినం
దనుఁడును నీకును బుద్ధులు,
వనరంగాఁ జెప్పు మనిరి తగవున నీవున్. 26

వ. వినుము దశరథుం డనురాజేంద్రునితనయుండు రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై తండ్రియానతిని వనవాసంబున కేతెంచి దండకారణ్యంబున వర్తిల్లు ఖరదూషణాదులం దునిమి యచటం దనపత్నిం గోల్పోయి యనుజుండుం దాను నెల్లదిక్కుల వెదకుచు ఋశ్యమూకంబుఁ జేరి యచ్చట సుగ్రీవునితో సఖ్యంబు చేసి యతనికిఁ బ్రియంబుగా వాలిం దునిమి తద్రాజ్యంబున కధిపుంగా సుగ్రీవుం బట్టంబుగట్టి సీతాన్వేషణంబు సేయింపు మనిన సుగ్రీవుండును గరుడానిలవేగులు మహాసత్త్వసంపన్నులు నగు ననేక బలీముఖకోట్ల సర్వలోకంబుల వెదకి సీత నరసి రం డని పనిచె నేనును రాఘవసుగ్రీవులయానతిని సముద్రం బవలీల దాఁటి లంకాపురి సొచ్చి యంతట వెదకి యయ్యశోకవనికామధ్యంబున నున్న జనకరాజనందనం గాంచితి ధర్మవిరుద్ధంబును గులనాశకంబు నగుపరదారాపహరణంబు నీయట్టి బుద్ధిమంతులు గావిం

తురే? ధర్మశీలుం డగువాఁడు సూ యనపాయసుఖంబులం బొందుఁ బాపశీలుండు వివిధాపాయదుఃఖంబు లనుభవించు నీవు పరకాంతం దెచ్చి పాపంబున కొడిగట్టి చెడ నున్నాఁడ వని పల్కి మఱియు. 27

సీ. చరణాగ్రమున నీభుజాదర్ప మడఁచిన,
 ధూర్జటివిలు లీలఁ ద్రుంచినైన
వాలపాశంబున వడి నిన్నుఁ గట్టిన,
 వాలి నొక్కమ్మునఁ గూల నేసె
నని నిన్నుఁ జెఱఁగొన్న యర్జునుఁ బోఁగొన్న,
 పరశురాముని వాఁడి భంగపఱిచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ,
 బదునాల్గువేవుర బొరిసమరె
తే. నమ్మహాధనుర్ధరున కెగ్గాచరించి,
హరిహరబ్రహ్మశక్రాదు లైన నతని
భయదనిర్ఘాతసంఘాతపాతిపాత,
బాణఘాతహతులు గాక బ్రతుకఁగలరె? 28

ఉ. ఈగవడి రాఘవాస్త్రశితతు లుగ్రతరార్చులు మింట నంట నీ
కరము లురంబు నంగములుఁ గంఠము లాస్యము లంఘ్రు లూరులున్
శిరములు మర్మము ల్కరులుఁ జించుచుఁ ద్రుంచుచు నుచ్చి పాఱుచు
న్నంత్రములు నేయుచు న్నిగుడ మూఁడుజగంబులు వాఁప నోపునే 29
శా. శ్రేణీభూతము లై దిగంతము లధిక్షేపించు సౌమిత్రిదో
ర్ధ్యానోగ్రోత్థితరత్నపుంఖగణనోద్ధూతస్ఫులింగచ్ఛటా
శ్రేణీజ్వాలధురీణబాణములు వర్షింపంగ నే వేళ స
ప్రాణత్రాణశరీరు లై నిలుతురే బ్రహ్మాదు లున్నందటన్. 30
మ. తురగస్యందనమత్తసామజభటస్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁ గాల్చి సైనికమహాభూతప్రత్తనుజశ్రేణి నె

త్యాతతదండము లెందును,
నూత యవధ్యుఁ డని చెప్పుదురు ధర్మవిదుల్. 39

వ. అని పల్క రావణుండు విభీషణుపల్కు లాదరించి. 40

క. తరుచరునకు వాలము ప్రియ,
కర మగుటను వీనితోఁకఁ గాలిచి నక్కఁ
చరు లందఱుఁ జూడఁగ నీ,
పుర మంతయుఁ గలయఁ ద్రిప్పు పుచ్చుం డనినన్. 41

వ. ఉద్ధతి రణకర్కశు లగురక్కసు లక్కపీంద్రుం గదిసి. 42

క. నానుమనివాలము పెరుఁగఁగ,
ఘనతరకార్పాసపట్టికాశ్రేణిం జై
కొని నూనెతోడ నానిచి,
యనలం బిడి మండ నూఁది రార్పులు నిగుడన్. 43

ఉ. అప్పుడు శుష్కకాష్ఠసనయజ్వలితాగ్నిసమప్రదీప్తుఁడై
యొప్పుచుఁ గీలజాలకలితోన్నతివాలము రాక్షపాలిపై
నిప్పులు రాలఁ ద్రిప్పుమను నిండినసంపడి నాయఁ జూఁడుమా
నెప్పక పౌరు లోలిఁ దనుఁ దద్దయు విస్మయ మంది చూడఁగన్. 44

క. రోమాంచాన్వితతను వు,
ద్దామభ్రమణభంగి మెఱయఁ బక్షిగోవ్య
ద్వ్యోమతలవాల మురుసౌ,
దామనిగతిఁ బనరెఁ బనట నురుబరుఁ డాత్మన్. 45

క. ఈకట్లు త్రెంచుకొని యా,
నాకారులఁ జంపునప్పుడు నానారక్షో
నీకంబులు గల వేగతిఁ,
జీకొని కడ తేనిరణముఁ జేయుదు నంకన్. 46

వ. కొంతతడ వేమైనం జేయ నిమ్ము సైరించెద మున్ను రాత్రి గానం జూడఁ గొప్పడ దీలంకాపురంబునం గలయశేషవిశేషంబులు దివాసమయం బున నీరక్కసులు త్రిప్పికొనం బోయి చూచెదం గాక యనుచుండ నంతలోఁ గాలకింకరభయంకరాకారు లగురాక్షసకింకరులు బలువి డిం గవిసి. 47

ఉ. ఉరవడి శంఖకాహళము లూఁదుచు దిక్కులు వ్రయ్య నార్చుచున్
భేరసి మృదంగనిస్స్వాణభేరులు ఘోషిల వ్రేయుచున్ ధుమో
ద్ధురబలుఁడైన వాయుసుతుఁ దోరపుఁద్రాసుల బల్మిఁగా మద
ద్విరదముఁ బోలెఁ గట్టి కొని వీథులఁ ద్రిప్పఁగఁ జూచి రక్కసుల్.

క. అని సీతో భాషించిన,
వనచరునిం బట్టి తోఁక వడిఁ గాలిచి యం
గన! పురిఁ ద్రిప్పుచున్నా,
రనవుడు నాపల్కు శస్త్రిహతిగతిఁ దాఁకన్. 49

వ. సీత యతిదుఃఖాక్రాంతయై యత్యంతనిష్ఠ నగ్నిదేవు నుద్దేశించి. 50

సీ. నాజీవితేశుఁడు నాథగ నుండుపంగ,
వడి సముద్రము దాఁటి వచ్చెనేని
పతి కృతజ్ఞుఁడు సత్యభాషావిశేషుఁడు,
నతిపుణ్యచారిత్రుఁ డయ్యెనేని
గురుకులశుశ్రూష కోరి చేయుదునేని,
యఖిలసన్నుతసాధ్వి నైతినేని
తపము సేయుదునేని దమశమాన్వితనేని,
నియతశీలవ్రతనిత్యనేని

తే. కలయు భాగ్యవిశేషము గలుగునేని,
నీవు నాపయి సత్కృపాన్వితుఁడవేని

పరఁగ నగ్ని దేవుఁడ! రామభక్తుఁడైన,
మారుతాత్మజునకు శైత్యకారి వగుము. 51

క. అని జనకజ యనలుస్రా,
ర్థన చేయఁగ ముందటం బ్రదక్షిణశిఖ లే
ర్చున నెగయఁ బ్రజ్వలించుచు,
ననలుఁడు హనుమంతునకు హిమాంశుం డయ్యెన్. 52

క. ఆరీడ వాలాగ్రంబున,
నాయతగతి మండుచున్న హుతాశనము ప్రా
లేయనగాకృతి శీతల,
మై యుండుట కరుదు వొంది యనిలజుఁ డాత్మన్. 53

క. రాముని సామర్థ్యమునకో,
భూమిజకారుణ్యమునకో పొందుగఁ జనకో
ద్దామ సహాయంబునకో,
నా మేను దహింప వీయ దనలత్రిశిఖల్. 54

వ. అనుచు సంతోషించి మహోత్సాహంబున. 55

సీ. బలువురు రక్కసుల్ బిగిచి పట్టినపాశము లెల్లఁ ద్రెంచికొం
చలఘురయంబులో నెగసి యార్చుచు గోపుర మెక్కి యచ్చటం
బలువిధి సూక్ష్మగాత్రుఁ డయి బంధము లన్నియు నూడ్చి యున్నతా
చలఘనదేహ మెప్పటివిశాలముగా ధరియించి చేపున్. 56

క. మును దోరణమునఁ బెట్టిన,
ఘనతరపరిఘంబు లీలఁ గ్రాలఁగఁ గేలం
గొని తనుఁ బట్టినపనుజుల,
మునుకొని పడి నేలఁ గూల మోఁది నడంచెన్. 57

క. వ్రాలి యిటు విక్రమించి వి,
శాలారుణవదనవారిజం బలరఁగ లాం

కీలాఖిలజ్వాలా,
మాలి యగుచు మెఱసె నంశుమాలియుం బోలెన్. 58

వ. ఇట్లు మెఱసి. 59

క. నావాలంబున మెఱసెడు,
పావకునకుఁ దృప్తి గాఁగఁ బైపైఁ గ్రవ్యా
దావాసము లాహుతులుగఁ,
గావించెద నింక ననుచుఁ గపిపతి కినుకన్. 60

మ. మింటఁ జటచ్ఛటధ్వనులు మేఘఘనధ్వను లై చెలంగ నిం
టింటికి దాఁటి వాలమున నేర్చి చిచ్చుఁ దగిల్చి దిక్కుల
న్మింటను విస్ఫులింగములు నిండఁగఁ జల్లుచు మంట లాకసం
బంట నొకండ యుగ్రత సమస్తగృహంబులుఁ గాల్చుచున్నెడన్. 61

చ. అవె యవె పెన్పొగ ల్నెగసె నక్కడ మండఁ గొడంగె నెల్లచో
ట్లవె ఘనవిస్ఫులింగములు నాకస మందెడుఁ బేర్చునర్చుల
ల్లవె హయశాలల న్రథగజాయుధశాలల ధాన్యశాలలన్
ద్రవిణతనుత్రశాలలను రావణుపట్టపుసర్వశాలలన్. 62

వ. అనుచుఁ గలవరంబునఁ బౌరు లిట్టట్టును బఱవం జొచ్చిరి. 63

## యుద్ధకాండము.

### (13) విభీషణువిషాదము.

రణమునఁ గొండవోలె రఘురామశరంబులఁ గూలియున్న రా
వణుఁ గని శోకవేగఘనవారినిధి న్మునుఁగుచు నావిభీ
షణుఁ డతిదీనుఁడై యడలు పైఁబడఁగఁ జాలక చేరవచ్చి తత్
క్షణమున విన్ననై యుఁ బలుచందముల న్విలపించె నేడ్చుచున్.

. అన్నా! దశకంఠ ! ఘోరసమరవ్యాపారనిత్యత్వసం
పన్నత్వంబున రూఢి కెక్కి విలసద్బాహాబలప్రౌఢిచే

నౌన్నత్యంబున మించి దైవగతిఁ దుట్యుచ్ఛిత్తిపైఁ నేఁడు వి
చ్చిన్నాశేషశిరఃకరుండ వయి హా! కీదద్గతిం దూలితే.

మ. సురలక్ష్మీకచకర్షణప్రవణము ల్కుంభద్రణోత్సిక్తముల్
హరశైలోద్ధరణప్రచండబలము ల్దార్వ్యక్షదుస్సాధముల్
హరిదంతద్విరదేంద్రదంతదళనవ్యాపారఘోరంబులుం
గరమై యున్న భవత్కరంబులు పతంగశ్రేణిపాలయ్యెనే! 3

క. సురతరుకుసుమశ్రేణీ,
సురుచిరమృదుతల్పమధ్యశోభిత మగునీ
యూరుతరదేహం బిప్పుడు,
పరుసనిసంగ్రామభూమిఁ బడఁ గా లయ్యెన్. 4

గీ. అర్కమండలతులితంబు లై వికచ,
తిమిరజాలకభేదనక్షమము లైన
విమలదీధితిమణికిరీటములు నేఁడు,
సడలి యంతంత నుగ్గులై పుడమిఁ గూలె. 5

క. ఎనసినగురువిక్రమమున,
ఘనతరభుజరాజిసత్త్వగౌరవమున న
త్యనుపముఁ డగు నీతో నెవ,
యనఁ జాలినవారు జగములందును గలరే.

సీ. నయశాలివై యుండి నరనాథసుందరిఁ,
దెచ్చి యీయాపదఁ దెచ్చుకొంటి
వల దని చెప్పినఁ జలమున నీభంగి,
నామాట లేమియు నమ్మవైతి
మనువంశనాథుని మనుజుఁగాఁ దలఁపక,
భూమినందన నిచ్చి పుచ్చవైతి

ప్రారంభైకఫలంబు లై పరఁగుదైత్యాధీశవృక్షంబు దా
నీరూపంబున రామహస్తి విఱిచెన్ హేలాసముల్లాసియై. 12

చ. కరయుగపంతదుర్జయము గర్వమదాంధము ఘోరచాపదు
ర్భరకగదున్నవాక్రమముఁ బద్మజవాశసముద్భవంబు ని
ష్ఠురతరుమండఖండనవిశాలతరం బగు దైత్యరాజసిం
ధురపతిఁ గూల్చె రాముఁ డనుదుర్జయసింహము బాణదంష్ట్రియై. 13

ఆ. నిబిడవిక్రమార్చి నిశ్వాసధూమంబు,
సాహసేంధనంబు సత్ప్రతాప
మయినరావణాగ్ని యారామజలదంబు,
చేల నార్పఁబడుట సిద్ధ మయ్యె. 14

— —

# హరివంశము.

## ఉత్తరభాగము. ఆ. 2

### (14) బలరామవ్రజగమనము.

క. తమపిన్ననాఁటియాటల,
క్రమ మంతయుఁ దలఁచి వేడ్క గడలుకొనఁగఁ జి
త్తమునందు గోకులాలో,
కమహోత్సవ మిచ్ఛగించి కర మిష్టమునన్. 1

మ. జలజాతేక్షణుతోడఁ జెప్పి తదనుజ్ఞం దా నొకండుక్ సను
త్కలకాంతారవిహారయోగ్య మగువేషం బొప్ప వ్రేపల్లెకుక్
లలిన్ సేఁగినఁ దన్నివాసులు మహోల్లాసాత్ములై యమ్మహా
బలు నంతంత నెదుర్కొనంగ నతఁడుక్ బంధుత్వధారేయతిక్ 2

క. కొందలకు మ్రొక్కి కొందఱఁ,
గొందఱు మ్రొక్కంగ వరుసఁ గొందఱఁ గుశలం
బందఁగ యడిగి కౌఁగిటఁ,
గొందఱఁ గదియించి ప్రణయకోవిదుఁ డగుచున్ 3

క. గోపికలు పొదివికొనఁగాఁ,
దీపారెడుచూడ్కితోడితిన్ననియుచితా
లాపములఁ బ్రియము సలుపుచు,
నాపోవనియింపుసొంపు లభినవములుగన్. 4

వ. ఉన్నంత గోపవృద్ధు లందఱు నతనిం బరివేష్టించి యుష్టగోష్ఠిం దగిలి
యిట్లనిరి. 5

క. స్వాగతమే యాదవకుల,
రాగవివర్ధన ! మహాత్మ ! రామ ! సుఖశ్రీ

బున సరసాన్నము ల్గుడిచి బుద్ధిఁ దనర్చినవారి కెందు శో
భన మగు టేమిసందియము బాంధవు లెవ్వరు మిమ్ముఁ బోలఁగన్. 10

క. రాచసిరి యుండియు న్మది,
యాచవికిం జొరదు నాకు వారికి నిచట బా
ల్యాచరణము లై మక్కువ,
యేచందంబులను మఱవ నెన్నఁడు రామిన్. 11

వ. అనిన సంతసిల్లి వారందఱు నతని నభినందించి మాధుర్యహృద్యంబులగు మద్యంబులును, సమధికాపేక్ష్యంబులగు భక్ష్యంబులును, భావానురూపంబులగు ననులేపంబులును, చేతోవిలోచనకల్యాంబు లగు మాల్యంబులును, ననేకంబు లాకల్యాణమూర్తికి సమర్పించినం బ్రీతుండై వివిక్తంబు రమణీయంబు నగు ప్రదేశంబున. 12

ఉ. గోపిక లంది యీఁ బసిఁడిక్రోర సుదారసుగంధిశీధు వి
చ్ఛాపరిపూర్తిగాఁ గొని వెసం గడు నుగ్గడువై ముదంబు స
వ్యాపకభంగి నంగము సమస్తము ఘూర్ణన మందఁ జేయు ను
ద్దీపిత మైన మోహము మదిం బరతంత్రత యావహింపఁగన్. 13

సీ. కనకపుప్రోగునఁ దనరెడుసురపంక్తి,
మాణిక్య సుత్ఫుల్లదామమున నమరి
నందు వెన్నెల పర్వ నెఱయుకైలాసాద్రి,
తెలుఁగువఁ జందనదీప్తి మెఱసి
చలదుల్క మగుశరజ్జలదంబుక్రియ నెక,
కుండలమణిదీప్తి గొమరు మిగిలి
ఘనభోగియుక్తమై తనరుపటీరంబు,
కటిఁ జేతిహాలమున నతిశయిల్లి

తే. తారకలలోఁ గలంకవిస్ఫారుఁ డగుచు,
నలరుపూర్ణేందువిధమున నతిపపిండు

నడుమ నీలాంబరద్యుతి వెడఁగు గాఁగ,
నధికధవళాంగరుచి నొప్పె నవ్విభుండు. 14

## (15) స్కందకృష్ణులయుద్ధము.

క. హరుఁ డరుగఁగాక యసురే,
శ్వరరక్షణ మింకఁ దొలఁగ నచ్చెనె నాకున్
హరి నొడుతుఁ బొడుతు మగఁటిమి,
యరుదుగ నని కార్తికేయుఁ డనికిం గడఁగెన్. 1

వ. ఇట్లు కుంభాండప్రహితం బగురథంబుతోడ నడరి యతండు. 2

ఉ. బాణసకోటి యుబ్బ వినతాసుతు మేనును గృష్ణు మేను ద
త్సూనుని మేను ముష్టికనిషూదను మేనును వాలురంపవె
న్నోనల నుంచి సాంద్రతరశోణితధారలు ధాత్రి నించినం
దా నొకచేతకున్ సమవధానము లేక మురారి ధీరతన్. 3

వ. ఒక్కింత సైరించి శార్ఙ్గనిర్ముక్తశరంబు లాశరజన్ముపై నిగిడింప రాహి
ణేయ రౌక్మిణేయులును సాయకసహస్రంబులం బరఁగించి రమ్మువ్వురు
మూఁడగ్నుల తెఱంగున మహాతేజంబు నూసి మహాసేను తేజంబు మట్టు
పడం జేర్చినం గోపించి కుమారుండు. 4

చ. జగములఁ జేర్చు నాఁటిరవిచాడ్పున దుస్సహదీప్తి నండమై
నెగడి సమస్తశాత్రవవినిర్మథనోత్సవసాధనం బనం
బ్రగుణవిభూతిఁ బెంపెసఁగు బ్రహ్మశిరం బనుసాయకంబు న
న్నగధరుమీఁద నేయ గగనంబున నిండె సురార్తనాదముల్. 5

మ. హరి యాలోన సమాహితాత్ముఁ డయి సర్వాస్త్రావమర్దక్రియా
పరుషోపక్రమమైన చక్రము నతిస్పర్థం బ్రయోగింపఁ ద
త్పరిపాతంబున షణ్ముఖాంబకము విధ్వస్తప్రభాజాలమై
పరమక్లీబత నొందె మేఘపటలప్రచ్ఛన్నసూర్యాకృతిన్. 6

గీ. బ్రహ్మశిర మివ్విధంబునఁ బ్రతిహతప్ర,
భావ మగుటయు నగ్నిసంభవుఁడు మఱియుఁ
దనకుఁ బ్రియసాధనం బయి తనరుశక్తి,
వైచెఁ దడయక హరిఁ గూల్చువాంఛఁ బేర్చి. 7

మ. చలదుల్కావలిమాడ్కి సంతతశిఖిజ్వాలాకరాళాకృతిన్
గలఘంటారతి మ్రోయ దిగ్గగనభాగం బెల్ల నొక్కింతయై
వెలుఁగ న్వచ్చుతదస్త్రముల్ దవి సుర ల్వీక్షించి విభ్రాంతిమై
జలజాతాక్షుఁడెస న్నిరాశు లయి చేష్టల్దక్కి రత్యంతమున్. 8

గీ. శక్తి కలవాఁడు కావున శక్తి నేర,
వచ్చునందాఁక సుస్థిరత్వమునఁ జూచి
చేర రావిచ్చి యుగ్రహుంకారమునన,
నిలిపె నమరు లెలర్ప నయ్యలఘుయశుఁడు. 9

క. అంతట నిలువక మఱియును,
నంతకవక్త్రానుకారి యగుచక్ర మతం
డంతయు వెస గుహుపైని,
శ్చింతత వైచుటకుఁ జక్కఁ జేత నమర్చెన్. 10

సీ. ఆసమయమ్మున మహాదేవుపనుపునఁ,
పార్వతిచైతన్యభాగ మైన
లంబాభిధాన లీలామూర్తి కాంచనా,
భరణదీధితు లెందుఁ బ్రజ్వరిల్ల
దిగ్వాసయై వచ్చి దేవసేనానికి,
నడ్డమై నిలువంగ నచ్యుతుండు
కని శీఘ్రమున దృష్టి క్రమ్మఱించి యి వేల,
నిశ్చితకార్యంబు నీవు చెఱచి

ఆ. తకట తొలఁగు తొలఁగు మట్లు కాకున్న వి,
తాఖుఁ గొనుచు వేగఁ జనుము పాసి
యేను జక్ర ముడిపి యిదె యూరకుండితి,
నళిన సంతసిల్లి యవ్యఘాతి. 11

వ. అమ్మహానుభావుపలికినయట్ల చేసె. 12

# మార్కండేయపురాణము.

## (16) పాతివ్రత్యమాహాత్మ్యము.

ఉ. దానవకేంద్రభూధరకదంబతురంగతరంగసంఘకాం
తానికురంబరత్నమహితం బయి లక్ష్మికిఁ బుట్టినిల్లనం
గా నభిరామమై భువనగౌరవవైభవయుక్తమై ప్రతి
ష్ఠానపురంబు వొల్చు విలసన్మహిమ న్జలరాశిచాడ్పునన్. 1

వ. అప్పురంబునఁ గౌశికుం డను విప్రుండు పూర్వజన్మపాపఫలంబునం జేసి.

చ. కరచరణాంగుళుల్ మతిగి గాత్రము దద్దయు గ్రుస్సి చీము నె
త్తురు దొరఁగంగఁ బెన్నతికి దుస్సహమై యుడియంగ ఘుర్ఘుర
స్వర మెసఁగంగ నీఁగ లనిశంబును జుమ్మని మూఁగుచుండ హే
యరసము మూర్తమైనయటు లాతతకుష్ఠరుజాభిభూతుఁడై. 3

చ. అలఁదురుచుండఁగా నతనియంగన పుణ్యచరిత్ర సాధ్వి స
త్కులజ పతివ్రతాచరణకోవిద రూపగుణాభిరామ ని
ర్మలివలతాంగి యాత్మవిభు మానుగ దైవముగా మనంబున
న్దలఁచుచు నిత్యభక్తిపరత న్తను నెల్లను బ్రీతి సేయఁగన్. 4

చ. ఉడుగక నాథుమైఁ దొరఁగుచుండెడు నెత్తురుఁ జీముఁ బల్లెఱుం
గడుగుచు నూనియుం బలయుఁ గాళ్లను జేతులుఁ దోమి తోమి యిం
పడరఁగ నీరు లారుచుఁ బ్రియంబునఁ జీరలు దాన కట్టుచుం
గుడుపుచుఁ గామభోగములఁ గోమలి యాతనిఁ బ్రీతుఁ జేయుచున్. 5

క. అతఁ డెంత యలిగి తిట్టిన,
మతిఁ గింకిరిపడక యెపుడు మాఱాడక యా
నత యగుచు నప్పతివ్రత,
యతని నతిశ్రేష్ఠుఁగాఁగ నాత్మఁ దలఁచుచున్. 6

వ. ఆరాధించుచుండ నొక్కనాఁ డమ్మహీదేవుండు నిజాంగన కిట్లనియె. 7

క. ఏ నొకగణికారత్నము,
మానుగఁ గనుఁగొంటి రాజమార్గంబున సా
ధ్వీ! నేఁడు వేడ్కయడరెను,
దానిగృహంబునకు నన్నుఁ దగఁ గొనిపొమ్మా. 8

ఉ. ఆనగుమోముచెన్ను శశియందును బంకరుహంబునందు లే
దానయనప్రభాలి మదనాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనికాంతి లతికావలియందుఁ బసిండియందు లే
దానలినాయతాక్షిలలితాకృతి నామదిఁ బాయ నేర్చునే. 9

సీ. మెఱుఁగారు లేఁదీఁగ మెచ్చనియత్తన్వి,
తనులత చెల్వంబు గనుఁగొనంగఁ
గలకంఠములయెలుంగులయేపు దీపించు,
నలపాత్రి ముద్దుఁబల్కులు వినంగఁ
గనకకుంభంబులకాంతి గైకొననియా,
కాంతచన్గవ బిగ్గఁ గౌఁగిలింపఁ
జిగురుటాకులనునుజిగిసొంపు దెగడున,
న్నపలాక్షి కెమ్మోవి చవిగొనంగఁ

ఆ. జిత్త మొనవుఁ దివుటఁ జిడిముడిపడియెడు,
నీవు ధర్మతత్త్వనిపుణహృదయ
వాలతాంగి నన్ను ననురక్తిమెఁ గూర్పు,
మన్మథాగ్ని నేను మ్రందకుండ. 10

క. ఇనుఁ డస్తమించెఁ జీఁకటి,
యును మొగులును నడ్డగించె నుగ్మలి నాకుఁ
జన శక్తి లేదు దర్పకు,
ననర్గళాస్త్రములు నెఱఁకు లాడెడుఁ దోడ్తోన్. 11

చ. అని మదనాతురుం డగు నిజాధిపు చెప్పినమాట యేర్పడ
న్విని వినయమ్ము భక్తియు వివేకముఁ బ్రీతియు నగ్గలింప న
వ్వనిత కడు న్బ్రియమ్మున వల్వ దృఢంబుగఁ గట్టి లంజెను
న్దన మొదువంగఁ బుచ్చికొని నాథుని మూఁపునఁ దాల్చి చెచ్చెరన్.

చ. తఱచయి నీలనీరదవితానము పైపయిఁ గప్పి యెంతయు
న్నెఱవఁగ నేలయు న్దిశలు నింగియు నిండఁగఁ బర్వ చాలఁ గ్ర
క్కఱిసిన చిమ్మచీఁకటి నిజేశ్వరుకోర్కి యొనర్చు వేడ్క న
త్తెఱవ గృహంబు వెల్వడి చలిత్వరితంబుగ నేఁగుచుండఁగన్. 13

వ. మార్గంబున బ్రోవ నొక్కయెడ. 14

ఆ. ముచ్చుగాఁ దలంచి చెచ్చెర నారెకు,
ల్పట్టి తెచ్చి కొఱుతఁ బెట్టినట్టి
మహితపుణ్యుఁ డైన మాండవ్యుఁ డను ద్విజో,
త్తముని యెడమమూఁపు దాఁకఁ బెట్టు. 15

తే. తాఁకుటయు మేను గదలి వేదనభరంబు,
గ్రొత్త యగుటయు నమ్మునీంద్రుండు గనలి
నన్ను నిట్లు నొప్పించిన నరుఁడు సూర్యుఁ,
డుదయ మగుటయు మరణంబు నొందుఁగాత. 16

పతివ్రతాశాపమువలన సూర్యోదయము లేమి,
దానిచే లోకోపద్రవమును.

చ. అను ముని శాప మిచ్చుటయు నా వనితామణి శోకతప్తయై
యినుఁ డుదయించు మత్పతికి నెగ్గు ఘటిల్లెడు నట్లగాని న
య్యినుఁ డుదయింపకుండుఁ గాక నేను బతివ్రత నైన నన్ను న
య్యినుఁ డుదయింపఁ గోడె వినుమిద్దివి నున్న సతీప్రభావముల్. 1

వ. అంతం ద్రియామ బహుయామమ్మై వర్తింపం దొడంగిన జగంబులు సంక్షుభితంబు లయ్యె నప్పుడు సుర లెల్ల భయంబున సురజ్యేష్ఠుం గానం జని యప్పతివ్రతామహానుభావంబు నెఱింగించి యిట్లనిరి. 18

సీ. ఆదిత్యునుదయాస్తమయములు లేకునికిఁ, జేసి కాలంబులు సిక్కువడియె
ననుదినస్నానసంధ్యాజపహోమాది, వివిధకర్మంబులు విరతిఁ బొందె
వేదాధ్యయనములు విధివిహితస్వధా, స్వాహాదు లాగి నిలుపంగఁబడియె
నిత్యనైమిత్తికకృత్యము లుక్కాఱెను సురా, తిథిపూజలడఁగె ధాత్రీతలమున

తే. నెలమి నేను హవిర్భాగములు పరిగ్ర,
హించి యాప్యాయనముఁ బొంది యీప్సితార్థ
ములను సస్యసమృద్ధియు వెలయ నరుల,
కొసఁగుటలు దప్పె జగముల కొదవె బెగడు. 19

వ. లోకవ్యవహారంబులు విచ్ఛిన్నంబులయ్యె నింక దివసోత్పత్తి యేవిధంబున నగునని విన్నవించిన విరించి కరుణించి యిట్లనియె. వినుఁ డాపతివ్రతామాహాత్మ్యంబు పతివ్రతచేతనే కాని చక్కంబడదు గావునఁ బరమ పతివ్రతయుఁ దపస్వినియు నైన యత్రిభార్య ననసూయ నిక్కార్యంబు సక్కంబెట్టు మని ప్రార్థింపుఁ డనిన నమరు లాపుణ్యవతికడ కరిగి బహువిధంబులం బ్రార్థించిరి. 20

ఉ. అతులితనిత్యసత్యవతి యైనపతివ్రతయాజ్ఞ నయ్యహ
ర్పతి యుదయింపమిం గడు విపత్తశఁ జేడ్పడె నిన్నిఁ గాన ని
చ్చలితమి దినంబు మాకు దయసేయుము తొల్లిటియట్లు కాఁగ వి
శ్రుతిసుచరిత్ర! యన్న ననసూయ సురాళిఁ జూచి యిట్లనున్. 21

ఉ. అనుపమ మాపతివ్రతమహత్త్వము దాని నధఃకరింపరా
దనిమిషులార! చెప్పెద నుపాయము చేతఁ బదీయుఁడైన భ
ర్తను దెగకుండఁ జేయుఁడు యథాస్థితి నుండఁగ నేను నచ్చెద
ద్దన మనివం గరం బలరి దేవత లట్టుల చేయఁ బూనినన్. 22

## అనసూయకును కౌశికపత్నికిని సంవాదము.

ఆ. అనసూయాదేవియు దేవగణసహితయై యాపతివ్రతారత్నంబుసదనం
బున కరిగి దానిక్షేమం బడిగి యిట్లనియె. 23

క. దేవతలకంటె నధికుం,గా వల్లభు మదిఁ దలంచి కల్యాణీ! సం
భావింతె యతనివచన,శ్రీవిభవము సూచి సంతసిల్లుదె యిపుడున్. 24

క. పతిశుశ్రూషణమున నే, నతులఫలప్రాప్తనైతి నభిమతఫలముల్
పతిశుశ్రూషానియతిని, సతతముఁ బడయంగ వచ్చు సతులకు సాధ్వీ!.

మ. వ్రతము ల్మంత్రజపోపవాసములు తీర్థస్నానము ల్యజ్ఞదా
నతపఃకర్మము లాచరించుచును నానాథంగుల న్నిత్యము
న్వృతి యాయాసనసహిష్ణుఁడై కడఁగి సంపాదించుపుణ్యంబులో
సతి శుశ్రూషలఁ గైకొను న్మతియుఁ దా సాఁబాలు ధర్మస్థితిన్. 26

తే. స్త్రీజనంబుల కుపవాసతీర్థదాన,
దేవపూజావ్రతాదుల తెరువు వలదు
పతిసమారాధనవ్రతపరతఁ జేసి,
సుగతి వారికిఁ దంగేటిజున్ను సుమ్ము. 27

ఉ. ఓ పతిధన్యురాలవు వినీతవు పుణ్యచరిత్ర వింతయుం
దైవముకంటె నెక్కుడుగఁ దత్పరతం బతి గారవింతు పూ
జావినయోపచారముల సంతతముం బరితుష్టుఁ జేయు దీ
భూవలయంబున న్సతులు పోలరు నిన్నుఁ బతివ్రతామణీ ! 28

చ. అని యిటు లత్రిపత్ని ప్రియమారఁగఁ బల్కినపల్కు కౌశికాం
గన విని ప్రీతిఁ జిత్తము వికాసము నొందఁగ నీయనుగ్రహం
బునఁ గృతకృత్యనై యమరపుంగవదర్శనయోగ్యనైతి న
న్ననిశము భర్తృభక్తినియతాత్మకఁగా నొనరింపు భామినీ ! 29

క. అని పలికి యాసతి మదీ,య నిలయమున కేఁగుదెంచి తత్పావరణం
బున నీవు నీకు చేసే, పని నేయుదు నర్థిఁ జెప్పు భవ్యచరిత్రా ! 30

వ. అని యడిగిన నప్పతివ్రతకు ననసూయ యిట్లనియె. 31

తే. ఇనుఁడు నీయాజ్ఞనుదయింప కునికి నిపుడు,
సృష్టిఁ జీఁకటి గవియుటఁజేసి తలఁకి
నిన్నుఁ బ్రార్థింపు మని సుర లన్నన్న వేఁడి,
కొనిన వచ్చితి నీకడ కనఘచరిత ! 32

వ. వినుము దినాభావంబున నిఖిలకర్మనాశనంబును గర్మనాశనంబునం ద్రిదివిష్టపవాసులకుం బుష్టిహీనతయు దాన ననావృష్టియు నగు ననావృష్టిదోషంబున జగంబు నశియించుం గావున నీవు దేవహితార్థంబుగాఁ బూర్వప్రకారంబునం బ్రభాకరవర్తనంబు చెల్ల ననుగ్రహించి లోకంబు లుద్ధరింపు మనిన నప్పతివ్రత యిట్లనియె. 33

క. మాండవ్యుఁడు మద్వల్లభుఁ,
జండాంశుఁడు వొడుచుటయును జాఁగలఁ డని తాఁ
జండతరశాప మిచ్చుటఁ,
జండాంశునిపొడుపు నాకసంమత మతివా ! 34

తే. అనిన ననసూయ యిట్లను విను పతివ్రవ,
తాంగనలపెంపు నాచేత నతిశయిల్లు
మగువ ! నీపతి మృతుఁడైన మగుడ నతనిఁ,
జిరతరాయుష్మంతునిఁ జేయుదాన. 35

తే. అనినఁ బ్రియ మంది యాతపస్విని గరాంబు,
జములు మొగిడించి భక్తిఁ జిత్తమునఁ దనర
నోదివాకర! నిత్యసత్యోజ్జ్వలాత్మ!,
దినమణీ! వేగ నుదయింపు మనియె ననిన. 36

సీ. చుక్కలదీప్తివిస్ఫురణంబు చవిగొని,
మిన్నులేఁగెంపున మెఱుఁగువెట్టి
ఘనతమఃపుంజంబు గనుకనిఁ బోఁదోలి,
దిక్కులఁ దేజంబు దీటుకొల్పి

కైరవాకరములగర్వంబు గబళించి,
కమలషండములకుఁ గాంతి యొసఁగి
తలకొన్నతుహినంబునర్వ మడంగించి,
చక్రవాకముల కుత్సవ మొనర్చి
తే. తనసముజ్జ్వలదీప్తివితాన మడరి,
యఖిలజనులకు ననురాగ మావహింప
నెలమి ననసూయ మహితార్ఘ్య మెత్తి మ్రొక్క,
నుదయగిరిశిఖరంబున నొప్పె నినుఁడు. 37
వ. పదిరాత్రుల కిట్లు ప్రభాకరుం డుదయించుటయు. 38
క. మునివరునతీవ్రశాపం,
బునఁ బ్రాణవిముక్తుఁడై విభుఁడు వ్రాలిన మే
దినిఁ బడకుండ నతని న,
వ్వనితామణి పొదివి పట్టె వగ మదిఁ గదురన్. 39
వ. అట్లుమృతుఁడైన నయ్యత్రికళత్రం బప్పరమపతివ్రతం గనుంగొని. 40
క. మతి నొక్కింతయు వగవకు,
పతిశుశ్రూషాతిపంబుబలమున నే నీ
పతి నిదె మగుడం బడసెద,
నతిరయమునఁ జూడు శుభగుణాన్వితమూర్తిన్. 41
వ. అని పలికె. 42
చ. అనుపమరూపశీలవినయాదిగుణంబుల నాదుభర్తగో
నెన యెవరు నేను గాన ననునీదృఢసత్యము పేర్మి నీద్విజుం
డనయము లబ్ధజీవుఁడు నిరామయుఁడున్ దృఢయౌవనుండునై
వనితయుఁ దాను గూడి శతవత్సరము లుత్సహియించుచుమండెడున్. 43
తే. మనముఁ బలుకును జెయ్యువు సమత్వ మొందఁ,
బతికి శుశ్రూష సతతంబు భక్తిఁ జేయ

దాన నే నైతి నేనిర్జయాధరణిసురుఁడు,
ప్రాణయుతుఁడు గావుత మని పల్కుటయును. 44

ఉ. ఆవసుధామరుండు విగతామయుఁడు న్నవయౌవనుండు తే
జోవిభవాధికుండు నతిసుందరుఁడు న్స్మరసంనిభుండునై
తా వెస నుత్థితుం డగుడు దైవతసంఘము మెచ్చి సంమద
శ్రీవిధిఁ బుష్పవృష్టిఁ గురిసె న్మొరసె న్దివి దేవదుందుభుల్. 45

# నృసింహపురాణము.

## (17) హిరణ్యకశిపుఁడు పెట్టు బాధలు.

సీ. ఘనరాశిజలములు పడిఁ ద్రిప్పఁ గొనులీలఁ,
గలగించు మందరాచలముకరణి
నంబుజప్రియసుముదాప్తులఁ బోరిఁ బట్టె,
బాధించు సింహికాప్రథమపుభంగి
ఘనగోత్రిగోత్రశృంగంబులు వెసఁ దాఁకి,
పొడిచేయుఁ దీవ్రదంభోళిపగిదిఁ
బ్రబలబలాహకప్రకరంబు వ్రచ్చి పం,
దఱలాడుఁ బటుమారుతంబుమాడ్కి—

గీ. దిగ్గజంబులగుండెలు దిగులుకొల్పు,
ఘోరరవమునఁ గ్రూరమృగారిపోల్కిఁ
బ్రకటభుజదర్పమునఁ దన్నుఁ బట్టలేక,
దుర్విషహుఁడై హిరణ్యాక్షపూర్వజుండు 1

సీ. తపములఁ గ్రుస్సినతపసులఁ బట్టి తె,
ప్పించి యచ్చరలతోఁ బెండ్లిసేయు
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ,
గట్టి చొక్కనియలఁ గపణ మొత్తు
భుజగేశ్వరులశిరంబుల మున్నమణు లూడ్చి,
కొమరార వ్రటువగుండు లెత్తుఁ
జెలఁగి గంధర్వులచేతివీణెలు పిశా,
చుల కిచ్చి పాడించి చూచి నవ్వు

గీ. ఖడ్గములుఁ బాదుకలు ఘుటికములు నపహ,
రించి సిద్ధపుంగవుల గారించుచుండు

భువనబాధలు దన కేళ్లు ప్రొద్దు వోక,
లుగ సురారాతి పేర్చె నుల్లోకుఁ డగుచు. 2

క. సదభిమతము అగుదుఃఖము, విదితముగ హిరణ్యకశిపవే స్వాహా య
న్నదివక్క మంత్ర మొండె, య్యదిబోరకుండఁ గసురారి యాజ్ఞాపించెన్.

చ. సరసిజసంభవుండు హరి శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొ
క్కరుఁడు జగత్త్రియంబునకుఁ గర్తయు భర్తయు సంప్రహర్తయున్
దిరముగ నేన కాక యని దేవకులద్విషుఁ డాగమక్రియా
కరులకుఁ దన్నుఁ గొల్వఁ డని గర్వమున న్నియమించె నెల్లచోన్. 4

సీ. భానుఁ బిల్పించి నాపంపునఁ బాయని,
తెరువరివై మీఁదఁ దిరుగు మనియెఁ
జంద్రునిఁ బిలిచి నాశాసనంబున జగం,
బున నెల్ల నోషధుల్ ప్రోవు మనియె
ననిలునిఁ బిలిచి నాయాజ్ఞఁ బ్రాణుల కెల్ల,
వలయుఁ బ్రాణంబవై మెలఁగు మనియె
ననలునిఁ బిలిచి నాయానతి యందునఁ,
బాచకాదిక మోజపఱుపు మనియెఁ

గీ. తనచరిత్రంబె వర్ణింపఁ బనిచె బహువి,
ధేతిహాసపురాణార్థజాతి నెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదముల నెల్ల,
దైత్యనాయకుఁ డఖిలవిధాయకుండు. 5

మ. జముఁడై తాన సమస్తకర్మగతులున్ శాసించు శీతంబు నూ
ష్మము వర్షంబును దాన యయ్యెయితిజేన్ సంధిల్లఁగాఁ జేయు న
ర్థముఁ గామంబును దాన కైకొని ప్రమోదం బందు ధర్మంబు మో
క్షము నాత్మీయకటాక్షలక్ష్యములనన్ గర్వోత్కటస్వాంతుఁడై. 6

ఉ. నేలయుఁ గొండలున్ దిశలు నింగియు దీవులు నంబురాసులున్
గాలములున్ గ్రహావళులు గాడ్పులు వహ్నులు నాకమర్త్య పా
తాళములు న్నిజాకృతులు దాల్చి సరోరుహసూతిఁ గొల్చున
ట్లాలఘుశీలుఁ గొల్చు సదయాత్మత యేర్పడ వచ్చునిచ్చలున్. 7

వ. ఇట్లు లోకపరమేశ్వరుం డగునసురేశ్వరుండు నిరంతరైశ్వర్యుండును, గురుభుజవీర్యుండును, దివిజమర్దనకార్యంబులు నవార్యంబులై చెల్లుచుండఁ జండప్రకోపదీపితత్రిలోకుం డగుచు ననేకసంవత్సర సహస్రంబులు సామ్రాజ్యంబు సేయుచుండ నాఖండలప్రముఖబృందారకు లందఱు రహస్యంబునఁ గూడఁబడి గురునితోఁ గర్తవ్యం బడిగిన నమ్మహామతి మరుత్పతి కిట్లనియె. 8

క. నీతులచేఁ ద్రోవడు దుర్నీతునియుద్రేక మెసఁగి నిగిడినయెడ లో
కాతిక్రమహేతు వగున, హేతుకళా నాశనంబు నెమ్మెయిన నగున్. 9

చ. కడఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ నవశంబుఁ జెప్పఁగయు నీమును రోషము నెమ్మనంబులోఁ
జడఁగొనియుండుఁ గావున నసాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబుఁ గొని వాని జయించుట వ్రేఁగుచూడఁగన్. 10

సీ. సామంబుచే శత్రు సాధింత మంటిమా,
సామంబు ఖలునందు సేయ వగునె
భృత్యులతోఁ దాయ భేదింత మంటిమా,
యసహాయసాహసుం డసురవరుఁడు
దానంబు వశ్యవిధాయక మంటిమా,
యెల్ల మెల్లను వానికెల్ల గొనియె
దండింతనంబున దడిందు మంటిమా,
చెనసి యజేయు నెన్నంపరాదు
గీ. కాసఁ జతురుపాయంబులు కార్యసిద్ధి,
జనకములు గావు మఱి చూడ సంధివిగ్ర

హాదులైన షడ్గుణములు నప్రయోజ,
నములు పగతుఁడు ఘనుఁడు దుర్దముఁడు గాన. 11

క. స్థానంబును వృద్ధియు న, ద్దానవపతియందు నంచితములైనవి దే
వానీకము సంక్షయగత, మైనయది త్రివర్గతత్త్వ మారసి చూడన్. 12

వ. స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలంబులను సప్తాంగంబులును సంపన్నంబులై తదీయసామ్రాజ్యంబు రిపులకు నభియోగ్యంబు గాకుండుటయు నాకౌకసులకు నమ్మహిమ విగతం బగుటయుఁ బరమేష్ఠిదత్తవరలాభంబున నుపయోగోన్ముఖుం డైనవాఁడునుం గావున నసురకుం గాలబలంబు సమధికం బగుటయుఁ ద్రిలోకంబులును దనయధీనంబులు గాఁ గైకొని యున్నవాఁ డగుటం జేసి దేవబలంబు సిద్ధంబగుట యనలంబింపవలయుట నాకుం దోఁచినకర్జం బది యట్లుండ వెండియు నొక్కతెఱంగు చెప్పెద. 13

శా. కామక్రోధమదాద్యమైనయసుహృద్వర్గంబులన్ గెల్వనే
ధీమంతుండు సమర్థుఁ డాతఁడు విరోధివ్రాతముఁ గెల్చు నీ
కామక్రోధమదాదినిర్జితుఁడు దుష్కర్ముండునై యుండు వాఁ
డీమై నెవ్వరిచేతనైనియు రమాహీనుం డగుఁ గ్రేళ్ళిడిన్. 14

క. అజితాత్ముఁ డైనయాతని, విజయంబును సిరియు విరియు వేగంబ శర
త్ప్రజనితజలధరములు గడు, నిజము లగునె యంబరమున నిముసంబైనన్.

మ. దితిజుం డిప్పుడు కామకోపముల నుద్రేకించి లోకంబు దు
స్స్థితి నొందించుచు నున్నవాఁడు విభవాంధీభూతచేతస్కుఁడై
మతిహీనుండును బోలె సౌఖ్యనిరతిన్ మత్తిల్లి యున్నాఁడు ని
ర్జితుఁ గావింపఁగవచ్చు దైవపరతన్ జేపట్టి యాపాతకున్. 16

క. విజయాభిమానతృప్తు, బహుజనద్వేషుఁ గామసంవృతోన్మాదు విబో
దజితుని వెసఁ దొడరంగా, విజయం బగు ననిరి నీతివిస్తరవేదుల్. 17

క. తమఁ దా నెఱుఁగనివానికిఁ, దనుఁ దాదండించుకొననితామసునకు నెం
దును దైవబలములేదింత నిరూఢతఁ గనినసిరియుఁ దవ్వుగఁ దోఁచున్.

వ. మనకు దైవంబు దాతయు వాసుదేవుండ మనకె యనేల యనేకబ్ర
హ్మాండకోటిజాతంబు లైన చరాచర భూతంబులకుఁ బరాయణంబు
నారాయణాభిధానం బగు తేజంబ. ఈజగంబుల సంకటం బుడుప వాదే
వునకు నపహార్యంబు మన మమ్మహాత్ము శ్రీపాదపద్మంబులు చేరి మన తెలుఁ
గంతయు విన్నవింతము మున్ను చెప్పితి హరి శరణాగతులయాపదలఁ
బాపనోపు నాపురుషుండు మనకు నెయ్యది కర్తవ్యంబుగా నానతిచ్చెఁ
దత్ప్రకారంబున నపకారులకుఁ బ్రతికారంబు చేయుద మిదియ నిశ్చ
యంబు. 19

# బ్రహ్మోత్తరఖండము.

## పంచమాశ్వాసము

### (18) అష్టాదశపురాణ రహస్యములు.

ఉ. శ్రీగురుదేవ హేళనము సేయఁగరాదు పురాణ వేద శా
స్త్రాగమ ధర్మము ల్విడువరాదు మహీసుర రాజ దేవతా
జ్ఞాగతి మీఱరాదు యోగి మృష ల్పచరింపఁగరాదు నిత్య మ
ధ్యాగతపూజ మాని కుడువం జనరాదు నరేంద్రనందనా! 1

క. గురుగోబ్రాహ్మణపూజా,
పరత న్వర్తింపు మెపుడు పరధనములకుం
బరసతుల కాసఁ జెందకు,
నిరతసదాచారధర్మనియతుఁడ వగుమీ. 2

క. స్నాన జప హోమ తర్పణ,
దానములను విప్ర దేవతా గురు పూజా
మానితకార్యములను నీ,
మానసమున నలసవృత్తి మానఁగవలయున్. 3

క. కోపము విద్వేషంబును,
పాపము పాత్రోకవృత్తి దండమును దురా
లాపంబులు పైశున్యము,
సాపవిచారములు విడువు భద్రగుణాఢ్యా! 4

క. నిరతము విషయాసక్త,
స్ఫురితమనోవృత్తి సాధ్వసూయయు హింసా
పరతయు నాత్మస్తుతియును,
బరనింద యొనర్ప వలదు పార్థివతనయా! 5

క. అత్యాహార మతిశ్రమ,
మత్యాలాపములు మఱియు నతిశయకోపం
బత్యుత్కటమగు నిద్రయు,
నత్యాకాంక్షయును విడువు మనవరతంబున్.

క. జనక శ్వశుర సతీగురు,
జననీ బుధబ్రాహ్మణులు సమ్మోద మొప్ప
న్వని విశ్వాసింపుము మది,
ననయము నిష్కపటవచన మది నమ్మఁదగున్. 7

క. కృపణు ననాథుని వృద్ధుల,
నపరాధవిహీను బాలు నబలను భాస్వ
త్కృప వెలయఁగ రక్షింపుము,
తపనీయాదికము లొసఁగి దాక్షిణ్యమునన్. 8

సీ. బంధుమిత్రులయెడ భావంబు నిలుపుము,
కృప గల్గి యుండు దుఃఖితులయందు
సజ్జనులందు హార్దంబు గావింపుము,
కుజనుల వీక్షింపు కోపదృష్టి
శరణాగతుం డైన శత్రువు నైనను,
జంపఁగా వలదు నిశ్చయముగాను
నెలమిఁ బాత్రాపాత్ర మెవ్వ రైన వేఁడిన,
లే దన కిమ్ము దేహాదు లైనఁ

తే. దల్లి దండ్రియు గురుఁడు నందనుఁడు విప్రుఁ,
డాచరించినయపరాధ మది సహింపు
మాత్మరక్షాపరుండవై యనుదినంబు,
నప్రమత్తుండ వై యుండు మనఘచరిత!

క. కీర్తి మహాభూషణ మగుఁ,
కీర్తియ లక్ష్మీకరంబు కృతకృత్యతయుం
కీర్తి శుభం బగుఁ గావునఁ,
కీర్తి యుపార్జింపు మెపుడు కృతపుణ్యుఁడవై. 10

తే. హయ గజాశ్వ రత్న హాటకంబులనైన,
నపహరింప ధాత్రి నపయశంబు
నిడుమవలయు దానిఁ గడు సత్వరంబుగఁ,
దృణముగాఁ దలంచి ధీరవర్య! 11

క. గౌరీశ్వరపదభక్తుల,
వారాధింపుము ప్రసన్ను లగునట్లుగ సం
సారపయోనిధిమగ్నుల,
వారసి వా రుద్ధరింతు రనవరతంబున్. 12

క. ఆయుర్బలధనవిద్యా,
శ్రేయఃకీర్తిప్రతాపశీలంబులు క
ర్తాయత్తత వచ్చినచోఁ,
బాయక యవి యనుభవింపు భవ్యవిచారా!. 13

క. కాలము దేశము శక్తియుఁ,
దా లెస్సఁగఁ దెలిసి చేయు కార్యము వా
ర్యాలోచనపూర్వకముగ,
మేలగు నెచ్చోట నైన మితహితవచనా!. 14

క. జపహోమస్నానంబులఁ,
దపములఁ బితృకార్యములను దత్పరమతివై
చపలత్వ ముడిగి యుండుము,
కపటం బించుకయు లేక కలుషవిదూరా!. 15

క. దాక్షిణ్యసమేతం బు,
ల్లాసకర మధికార్థ మశఠ మతిహృద్యతరం

దక్షిణ మసందిగ్ధము,
దక్షం బగుపటుకు పలుకఁదగుఁ దథ్యముగన్. 16

క. ఆపదలందును శత్రు,
వ్యాపారములందు భీతి వలవదు నీకుఁ
జాపములకు గురువిప్రా,
లాపములకు వెఱచి యుండు లాలితబుద్ధిన్. 17

సీ. పరుల నెవ్వరి నైన బాధింపకుండుము,
పరులబాధ లడంపు కరుణ వెలయఁ
జోరదుష్టారినివారణం బొనరింపు,
బాహ్యాగేహానుష్ఠిఁ బరఁగవలదు
బంధుమిత్రజ్ఞాతిభార్యాసుతాతిథి,
భోజనంబుల సమబుద్ధి వగుము
విద్యాకథాధర్మవిహితవాక్యోపదే,
శములందు సతతనిశ్చలుఁడ వగుము

తే. ఏస్థలము సాధువిప్రభూయిష్ఠ మగును,
పుణ్యతీర్థంబు లెచ్చోటఁ బొందియుండు
శివనివాసంబు లేభూమిఁ జెలఁగుచుండు,
నచట నిలువు మవశ్యంబు హర్ష మొదవ. 18

క. కులటావేశ్యాకాముక,
ఖలసంగతదేశముల నోకానోక వేళ
న్నిలువకుము జగత్ప్రభు వగు,
నలినాక్షుని మదిఁ దలంపు మశ్రాంతంబున్. 19

క. ఎప్పుడు శాంతియు దాంతియు,
నెప్పుడును శుచివ్రతంబు లెప్పుడు ధర్మం
బెప్పుడు జితషడ్వర్గత,
దప్పక వర్తింపు మీవు ధరణీశసుతా!. 20

క. యతులకు విప్రులకుఁ బతివ్రతలకు వరధేనువృషభరత్నములకుఁ బు
ణ్యాతరునదీనిజగృహదేవతలకు వందన మొనర్పు వాలాయముగన్. 21

ఆ. భక్ష్యభోజ్యలేహ్యఫలపుష్పతాంబూల,
వస్త్రభూషణాదివస్తువితతి
శివసమర్పితంబుఁ జేసి యాపిమ్మట,
ననుభవింప వలయు ననుదినంబు. 22

శా. భద్రాచారపరుండవై నిరతముర్ బ్రాహ్మీముహూర్తంబున
న్నిద్రాసక్తిఁ బరిత్యజించి శుచివై నిష్కల్మషత్వంబునన్
రుద్రాణీరమణుం గృపాగుణసముద్రుర్ శంకరుర్ శ్రీమహా
రుద్రుం జిత్తమునర్ భజింపు మతిధీరోదాత్తభావంబునన్. 23

ఆ. నిర్వికల్పముగను నీ వాచరించిన,
స్నానదానహోమజపతపములు
ననుదినంబు తత్ఫలాపేక్ష ఉడిగి త,
థ్యముగఁ జేయు మీశ్వరార్పితములు. 24

చ. విహరణ భాషణ శ్రవణ వీక్షణ భోజన పాన దానసం
గ్రహ శయన స్థలంబులను రాజకళాధరుఁ బార్వతీపతిర్
గుహజనకుర్ వృషధ్వజుని గోత్రశరాసను దేవదేవుని
న్నహితవిచార! నీదుమది మానక నిల్పి భజింపు మేర్పడన్. 25

మ. వరపంచాక్షరమంత్రపాఠకులు శైవాచారపారీణు లీ
శ్వరభక్తు ల్భసితత్రిపుండ్రవిలసత్ఫాలప్రదేశాంచితు
లురురుద్రాక్షమణిప్రదీప్తకరయుగ్ము ల్పూజ్యులై నట్టియా
పురుషశ్రేష్ఠులు నిల్చియుండు రెపుడుర్ భూతేశులోకంబునన్. 26

వ. అని చెప్పి వత్సా! యివ్విధంబున ననేకపురాణంబులయందు విస్తరింపం
బడిన ధర్మసంగ్రహంబు లన్నియు సంక్షేపరూపంబున నీకుం దెలియ
ననుగ్రహించితి. 27

## (19) శ్రద్ధాభక్తులను గూర్చిన యితిహాసము.

క. శ్రద్ధయె లోకహితం బగు,
శ్రద్ధయె నిజజననిపగిది సౌఖ్యము లొసఁగున్
శ్రద్ధాపరుల నభీష్టస,
మృద్ధులఁ గాఁ జేయు చుందు రెల్ల సుపర్వుల్ 1

శా. శ్రద్ధాభక్తిసమేతులై విబుధులన్ సంప్రీతిఁ బూజించిన
న్సిద్ధించు న్నిజకామితార్థములు నిశ్శ్రేయఃపదప్రాప్తియున్
శ్రద్ధాహీనులపూజ వంధ్యతరుపుష్పప్రాయమై యిష్టసం
సిద్ధిం జేయదు సర్వమానవులకున్ సిద్ధంబు ధాత్రీస్థలిన్. 2

ఆ. ఓమహాత్ములార ! యుపదేశమునకన్న,
శ్రద్ధ గలిగి యూనికి సిద్ధి దనరు
నిమ్మహార్థమునకు నితిహాస మొక్కటి,
విన్నవింతు వినుఁడు వీను లలర. 3

క. ప్రాంచద్విపులసరస్వ,
త్కాంచీస్థలి వెలయునట్టిఘనతరబహుమ
ట్పంచాశద్విషయములం,
బాంచాల మనంగ నొక్కపత్తన మలరున్. 4

మ. అనిశం బప్పుర మేలు ఖండితసమస్తారాతిసంఘాతుఁడై
హనుమత్కేతుఁడు విక్రమస్ఫురణ మహాభ్యున్నతి న్మారుతా
శనరాట్కేతుఁడు సత్కృపారసమునన్ సర్వారికేతుండు భూ
జనవిఖ్యాతుఁడు సింహకేతుఁ డనురాజశ్రేష్ఠుఁ డుద్యన్నతిన్. 5

ఉ. సారబలాఢ్యుఁ డానృపతిచంద్రునకున్ ప్రభవించె వైరిసం
హారుఁడు దుర్జయుం డనుకుమారుఁడు శౌర్యకుమారుఁ డర్థిమం
దారుఁడు శైలజాధిపపదాబ్జవిహారుఁడు సింధురాజగం
భీరుఁడు మేరుధీరుఁ డరవిందశరోపమసుందరాంగుఁడై. 6

వ. అంత. 7

క. జననాథనందనుం డొక,
దినమున మృగయాభికాంక్ష దీపింప ధను
స్సునిశితబాణధరుండై,
చనియెం గాంతారమునకు శబరులు గొలువన్. 8

వ. ఇవ్విధంబున నమ్మహారణ్యంబు ప్రవేశించి యచ్చటం బరితెంచు వేదండ గండక పుండరీక భల్లూక వరాహ మహిషాది దుష్టమృగంబుల విదళించుచు విహరించుచున్న సమయంబునఁ దద్భటుం డైన యొకశ బరుండు చండకుం డనువాఁడు మృగయాన్వేషణపరుం డై వనంబునం దిరుగుచు నొక్కయెడ జీర్ణం బైన దేవాలయమునందు స్ఫటికం బైన లింగంబుఁ గాంచి దైవనియోగంబున దానిం గొనివచ్చి యారాజనందను నకుం జూపి యిమ్మహాలింగంబున కేను బూజనం బొనరించెద దీనిం బూజించువిధానం బెట్టిది సవిస్తరంబుగా నానతీయ వలయు నని ప్రా ర్థించిన శబరునకుఁ బరిహాసముగా నారాజకుమారుం డిట్లనియె. 9

సీ. ఇమ్మహాలింగంబు నెమ్మితోఁ బూజించు,
క్రమ మెఱింగింతు సాంగంబుగాఁగ
విను మీవు సంకల్పవిధిపూర్వకంబుగా,
నవవారి నభిషేచనం బొనర్చి
యొప్పుగాఁ బీఠమం దునిచి యాపిమ్మట,
నతిశుభ్రగంధపుష్పాక్షతముల
నర్చించి ధూపదీపాదికంబు లొసంగి,
నెమ్మదిలోన ధ్యానమ్ముఁ జేసి

తే. మొదలఁ జితిభస్మ ముపహారముగ నొనర్చి,
యంత నాత్మోపయుక్తాన్న మాదరమున
మరల నైవేద్య మొనరించి మంత్రపుష్ప,
వందనాదులు గావింప వలయు నెపుడు. 10

క. క్రమ్మఱఁ బూజించి ప్రసా,
దమ్ము ధరింపఁ దగు సంతతిమును జితాభ
స్మమ్ము నివేదించిన శీ,
ఘ్రమ్మున సంతుష్టిఁ జెందు గంగాధరుఁడున్. 11

క. అని యుపదేశించిన విని,
జననాథకుమారుపలుకు సత్యం బనుచున్
దనలో నెంచుచు దృఢమతిఁ,
జనియెన్ శబరుండు త[illegible]సదనంబునకున్. 12

చ. నిరుపమభక్తి నాత్మతరుణీసహితంబుగ నీశ్వరార్చనా
పరతి వహించి యంతఁ జితిభస్మ నివేదన మాచరించి క్ర
మ్మఱ నిజభోగ్యవస్తుచయ మంత నొసంగుచుఁ దత్ప్రసాదమున్
శిరమునఁ దాల్చి పిమ్మట భుజించు నతండు మనంబు రంజిలన్. 13

వ. ఇట్లు శబరీసమేతంబుగా శబరుం డమ్మహేశ్వరలింగంబునకు దృఢ
భక్తిపరుండై నిరంతరంబు పూజనం బాచరించుచున్నంతఁ గొన్నిదినం
బులకుఁ జితాభస్మరహితం బైనపాత్రంబు నిరీక్షించి తత్సంగ్రహణార్థం
బుగ నలుదెసలుం బరికించి యెందును గానక మరలి నిజనివాసంబు
నకు వచ్చి విషణ్ణచిత్తంబున మానవ్రతుండై యున్న నిజవల్లభుం గాంచి
తత్కుటుంబిని యిట్లనియె. 14

క. నీ వేటికిఁ జింతించెదు,
శైవసమర్చనము లేల సమకూర్పవు నీ
భావముఁ దెలియం బలుకుము,
నా విని యాశబరుఁ డనియె నతవదనుండై. 15

తే. ఇంతి! విను మీదినంబున నీశ్వరోప,
హారమునకుఁ జితభస్మ మబ్బ దయ్యె
శైవపూజాంతరాయంబు సంభవించెఁ,
గాన నిఁక నేమి సేయుదుఁ గమలవదన! 16

క. గురువాక్యోల్లంఘనమున,
దురితంబులు వొందుఁ గానఁ దొయ్యలి! వినుమా
పరమేశ్వరుఁ బూజింపక,
తిరముగ భుజియింప నొల్ల దృఢమతి నెప్పుడున్. 17

వ. అని యివ్విధంబున నొడివిన ప్రాణవల్లభునకుఁ దత్కళత్రం బిట్లనియె. 18

సీ. ప్రాణేశ! దీనికై పరితాప మేటికి?,
నిపు డొక్క సదుపాయ మేను గంటి
బహుదారుమయనిజగృహదాహ మొనరించి,
తనమేను వైచి దగ్ధం బొనర్తుఁ
దద్భస్మమున నివేదన మాచరింపుము,
పరమేశ్వరునకు సాదరత మెఱయ
నని విన్నవించినఁ దనపత్ని నీక్షించి,
శబరుండు పల్కె విస్మయము నొంది

తే. సరస ధర్మార్థకామమోక్షముల కెపుడు,
సాధనంబు సుఖార్జనంబు సకలభోగ
భాజనంబు సుయౌవనం బైన తనువు
నెట్లు విడిచెదు సంతానహీన వగుచు. 19

వ. అని పలికిన శబరుం జూచి శబరి యి ట్లనియె. 20

క. పరజనులకుఁగా నిచ్చిన, శరీరమున సుకృత మందు సాక్షాజ్జగదీ
శ్వరున కొసంగినతనువుల, పరపుణ్యం బెన్నఁ దరమె? వాక్పతికైనన్.

ఉ. పూర్వభవాంతరంబులను బుణ్యము లెన్ని యొనర్చి యుంటినో
పర్వతకందరస్థలిఁ దపంబుల నే క్రియ సల్పియుంటినో
సర్వసరిజ్జలంబుల భృశంబుగ మజ్జన మాడియుంటినో
శర్వసమర్చనంబునకు సారసిజాంగ మొసంగఁ గాంచితిన్. 22

వ. అని పలికి నిజవల్లభు నొడంబఱిచి పుణ్యజలావగాహనం బాచరించి
శుచీభూతగాత్రయై హరిద్రాంజన కుంకుమ గంధ పుష్పాక్షతాద్య

లంకృత యై నిజగృహద్వారంబున ననలంబు దరికొల్పి ప్రదక్షిణత్ర
యం బొనరించి యవ్వీతిహోత్రునకు నభిముఖంబుగా నిలిచి గురువంద
నంబు గావించి యమ్మహాదేవుఁ దన మనంబునఁ దలంచుచుఁ గృతాంజలి
యై యిట్లని స్తుతియించె. 23

ఉ. దేవ! మదింద్రియంబులు ప్రదీప్తసుమంబులు దేహ మిష్టసం
భావితగంధధూప మతిభాసురచిత్తము దీప మన్నఁ బ్రా
ణావలియే హవిస్సు కరణంబులు మీకు సితాక్షతంబులై
జీవితపూజనం బిపుడు చేసెద నయ్య కృపాపయోనిధీ!. 24

తే. సర్వలోకాధిపత్యంబు స్వర్గ మైన,
బ్రహ్మపద మైన వలదు మీపాదమాన
తావకపదాబ్జభక్తి చిత్తంబునందు,
వెలయఁ జేయుము భవశతంబులకు నైన. 25

క. అని ప్రార్థించుచు శబరుని,
వనితామణి ధీరవృత్తి వహ్నిజ్వాల
న్నన మలకఁ బ్రవేశించుచుఁ,
దనమేను దహింపఁ జేసెఁ దత్క్షణ మందున్. 26

క. అంతఁ జితాభస్మము త
త్కాంతుఁడు దా సంగ్రహించి తగఁగఁ గుటీర
ప్రాంతంబున శైలసుతా,
కాంతునిపూజన మొనర్పఁ గౌతుకమతియై. 27

సీ. శబరుండు శివపూజ సలుపుచు వివశుఁడై,
మహితప్రసాదసంగ్రహణమునకు
నెప్పటియట్ల తా నొప్పగాఁ బిల్చినఁ,
దనపత్ని వచ్చి ముందటను నిల్చె
నంత నాశబరుఁ డత్యద్భుతస్వాంతుఁడై,
ప్రాంజలియై యున్నపడఁతిఁ గాంచి

నిర్దగ్ధదేహుఁడై నీ వెట్లు వచ్చితి,
విప్రుఁడు నీ వాలయం బెట్లు వొడమెఁ
తే. దేజమున నగ్ని దహియించు దినకరుండు,
కిరణములను దహించు భూవరుఁడు దండ
మున దహించును మనమున భూసురుండు,
తన దహించును శాస్త్రసిద్ధంబు లిట్లు. 28
క. అటు గావున గృహాయతముగఁ,
జటులజ్వాలాగ్నిదగ్ధసర్వాంగికవై
యెటువలె వచ్చితి విప్రుఁడు,
నిటలాక్షునిమహిమ తెలియ నేర్తురె మనుజుల్. 29
వ. అని విస్మయాక్రాంతచిత్తుం డై యాశిశు శబరునకు శబరి యిట్లనియె. 30
మ. దహనజ్వాలలయందుఁ జొచ్చి సుఖాస్పదం జెంది నిర్మాల్యసం
గ్రహణార్థం బయి పిల్వఁగా వినుచు జాగ్రత్త్వంబు సంధిల్లినన్
గృహముం దేహము పూర్వరూపములభంగిం జెంద నేతెంచితిన్
మహితం బైనశివప్రసాద మిది నన్నస్మింపు ప్రాణేశ్వరా! 31
సీ. అని యివ్విధంబున నతిశయవ్యాదనానా,
రాగంబు దోఁపఁ బరస్పరంబు
శబరదంపతులు సంభావణంబులు సేయ,
నవసరంబున విస్మయము జనింప
దివినుండి వచ్చె దేదీప్యమానం బగు,
మణిమయమైన విమాన మొకటి
యంత నయ్యారుపుర నతిమైత్రిఁ బుష్పా,
ఘాతులఁ జేసిరి రుద్రభటులు
తే. భవ్యశివపారిషదకరస్పర్శనమున,
విపులతరమైన దివ్యదేహములు దాల్చి

సిద్ధచారణగంధర్వసేవ్యమైన,
శ్రీసదాశివలోకంబుఁ జేరి రపుడు. 32

వ. ఇట్లు శ్రద్ధాపూర్వకంబుగ శబరదంపతులు పరమేశ్వరపూజనం బాచరించి నిజదేహంబులతో మహాయోగిజన సంభావితం బైన శివలోకంబునకుం జని యందుఁ బరమానందంబున నుండి రని చెప్పి సూతుండిట్లనియె.

క. కులవిద్యాచారంబులు, తలఁపఁగఁ బని లేదు భక్తితాత్పర్యముచే
నలికాక్షునిఁ బూజించుచు, విలసిల్లెడుమనుజునిఁబోలు విజ్ఞులు కలరే ? 34

# కూర్మపురాణము.

## (20) జయధ్వజుని విష్ణుభక్తి.

వ. ఆకార్తవీర్యార్జునునికి నూర్వురు కుమారులు పుట్టిరి; అందైదుగురు బలవంతు లైనశూర శూరసేన వృష్ణ కృష్ణ జయధ్వజు లనువారు. 1

క. వారైదుగురు మహారణ,
శూరులు సత్కృతులు సత్యశుద్ధులు ధర్మో
దారులు కడపటియాతఁడు,
నారాయణపరుఁడు మొదటినల్వురు శైవుల్. 2

తే. ఆజయధ్వజుఁ డచ్యుతు నమితభక్తి,
శరణ మని పూజ సేయంగ శైవు లైర
మొదటినల్వురు శూరాదు లది తగ దని,
యాజయధ్వజునకు నిట్టు లనిరి ప్రీతి. 3

క. మనతండ్రి శంభుభక్తుఁడు,
జనకునిమార్గంబు విడువఁ జన దన వారిం
గని యిట్లనియెఁ దదనుజుఁడు,
వినుఁ డిది నామతము మీకు వివరింతుఁ దగన్. 4

మ. తలఁపఁగ రాజులు కేశవాంశజను లిద్ధాత్రీతలం బెల్ల ని
చ్చలుఁ బాలింతు రవశ్యముగ్ నృపులుకా*లక్ష్మీకళత్రుండు ని
ర్మలలోకత్రయపాలనప్రకటశుంభద్దివ్యచారిత్రుఁ డే
వలనం జూచినఁ బూరుషోత్తముఁడెకా పంద్యుండు సర్వేశ్వరుం డిలన్. 5

చ. వినుఁడు గుణత్రయిన్ మొదట వేఁడుగఁ దోఁచెను మూఁడు మూర్తులం
దు నొకఁడు సాత్త్వికుండు హరి దుష్టతతిం దునుమాడి చేయుఁ బా

లనమున రాజసుండు కమలప్రభవుండు జగజ్జనిత్రియర్
దనరెను దామసుండు మఖదారకుఁ డెంతయుఁ ద్రుంచుఁ గావునన్. 6

తే. ధరణిఁ బాలింప నమరినవరపతులకుఁ,
బాలనమునకు సాత్త్వికభావుఁ డైన
హరి సమర్చింప నగు నన నన్న లతిమ,
నన్వ లిట్లని రాతన్మునకు నయమున. 7

సీ. వినుము సంహారకర్త నిరుద్రు వంటి వా,
రేఁడె ముముక్షులకు నెంతయు నుపాస్యుఁ
డనఘ తామసశక్తి నవలంబన మొనర్చి,
కాలమైనప్పు లోకముల నెల్ల
లయ మొనరించు నట్లనె నిజజ్ఞానశ,
క్తినిజేసి సంసారిజనుల దుర్గ
యావిద్యను హరించి యమృతం బొసఁగుఁ గాన,
శివుఁడు పూజ్యుఁడు మనీషిప్రతతికి

తే. ననిన వారల కనియె జయధ్వజుండు,
సత్త్వగుణ మొంది నరుఁడు మోక్షంబు నొందు
సాత్త్వికుఁడు గాన హరియె మోక్షప్రదుండ,
టంచుఁ బలికిన వార లిట్లని రతనికి. 8

తే. నిజము సాత్త్వికజనులచే నీలకంఠుఁ,
డర్చితుం డయి సత్త్వము నతఁడె తాల్చి
మోక్షము నొసంగుఁ గాన ముముక్షువులకు,
శంకరునిపూజ భక్తితోఁ జలుపవలయు.

క. మునులు స్వధర్మము మోక్షం,
బునకుఁ దదన్యంబు బంధమున కని రటు గా

కను విష్ణుశక్తి దేవత,
మనకుఁ దదర్పనమె యుత్తమము ధర్మ మగుట. 10

ఆ. అనిన నగుచు నిట్టు లనియెఁ గృష్ణుం డను,
నతఁడు మనకుఁ దండ్రి యర్జునుండు
దేనిఁ జేసె ము న్నదే కదా మనకును,
ధర్మ మనె వివాద దగిలె నిట్లు. 11

ఆ. వాద మెక్కుడైన వల దని యట శూర,
సేనుఁ డందఱకు వచించె నిట్లు
దీనివిషయ మేమి తెల్పుదురో ఋషు,
లదియె సత్ప్రమాణ మగును మనకు. 12

సీ. అనిన సంరంభమ్మునను వారలందఱు,
నరిగిరి సప్తమహర్షు లున్న
యాశ్రమమునకు బ్రహ్మజ్ఞానపూర్ణు లౌ,
వారికిఁ దెల్పిరి వాద మెల్ల
నపుడు వసిష్ఠాదు లారాజులకు యథా,
ర్థముగ వచించిరి సుమతులార!
యెవ్వని కేదేవుఁ డిష్టమో వానికి,
నతఁడె దేవుం డగు నదియె నియమ

ఆ. మనఁగరాదు కార్యమున కయి యేదేవు,
నైనఁ గొలిచి ఫలము నంద వచ్చు
నదియుఁ గాక మీకు నెఱిఁగింతు వినుఁడు వి.
శేష మొకటి కలదు శిష్టఫణితి. 13

సీ. నృపులకు విష్ణుండు నింక నింద్రుండును,
విప్రుల కగ్నినవిధిహారులును
సురలకు విష్ణుం డసురులకు రుద్రుండు,
యక్షగంధర్వుల కమృతకరుఁడు

విద్యాధరుల కైందవీదేవి సాధ్యుల,
కినుఁడు రక్షస్సుల కీశ్వరుండు
కిన్నరులకు హిమవన్నగాత్మజ ఋషు,
లకు శివాజాలు మనుప్రకరమునకు
తే. నార్యవిష్ణ్వీశ్వరవులు గృహస్థున కిఁక,
సర్వదేవతలును బ్రహ్మచారి కజుఁడు
కనఁగ వైఖానసులకు భాస్కరుఁడు యతికి,
శివుఁడు దేవత లని మున్ను చెప్పె నజుఁడు. 14
తే. భూతములకును గూశ్మాండజాతములకుఁ,
గ్రమముగా రుద్రుఁడును మహాగణపతియును
నందఱకు బ్రహ్మయే దేవుఁ డనుచు మున్ను,
ధాత తెల్పెను లోకవిఖ్యాతముగను. 15
ఉ. కాన జగత్త్రయం బసురకంటకు విష్ణునిఁ గొల్వవచ్చు నం
చాన యొసంగె నాఋషుల కందఱకున్ బ్రణమిల్లి యప్పు డా
మానవనాథపుత్త్రు లసమప్రభ నొప్పెడు రాజధానికిన్
భూనుతచర్య్య లేగి ప్రజఁ బొందుగ నేలి రరుల్ చలింపఁగన్. 16

# టిప్పణము.

## (1) ఉదంకుఁడు పౌష్యమహాదేవికుండలములం దేఁబోవుట.

[ఉదంకుఁడు పైలునిశిష్యుఁడు. ఇతఁడు గురుదక్షిణ యేమి వలయు నని యడుగ, నతఁడు తనభార్య నడుగు మనియె. ఆమె పౌష్యునిభార్యకుండలములు తెచ్చి యిమ్మనెను. శిష్యుఁ డందులకై పోయి పెక్కుచిక్కులు పడియు, తుదకుఁ దనకార్యము నెఱవేర్చుకొనియె. ఇందు, గురుభక్తి, శిష్యునిశక్తియె కాక, ఘనకార్యనిర్వాహణాసక్తియు వెల్లడి యగుచున్నది.

1. అఘపంకము, తపస్సలిలము-రూపకసమాసములు, తపస్సుచేఁ బాపములు పోఁగొట్టుకొన్నవాఁడు. న+ఆతంక=అనాతంక, నఞ్ తత్పురుషము. భక్తిన్-తృతీయార్థకమైన ద్వితీయ.
2. గురుకులము-ఇందు, కులమనకు గృహమని యర్థము, 'గురుకులవాస' మన్నమాట వినుచున్నదె. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము-ఇవి యణిమాదులు.
3. నియోగము-ఆజ్ఞ; వాని పన్నిన-ప్రయోగవిశేషము.
4. ఏను-నేను రూ. నా నా. అయిదు, గుర్వర్థి-గురు+అర్థి-యణాదేశసంధి. పూన్కి రూ. పూనికి, పూనిక. పూను ధా॥ కృత్తు.
5. ఈన్+కాంచితిన్; ఈన్=ఇచ్చు ధా॥ తుమున్నర్థకము. రూ. ఈయన్, ఇయ్యన్. అంతఃపురము-తత్స, అంతిపురము-తద్భ.
6. ఈపద్యములో, రాజు మాటల మృదుత్వమెట్లున్నదో గ్రహించునది.
9. ప్రక్షాళితపాణిపాదవదనుఁడు-పంచార్ద్రభావమిదే.
7 రోయు-క్త్వా రోసి=అసహ్యపడి. ఱోయు=వెదకు; అశుద్ధాన్నము—అశ్లీలము; ఉదంకపౌష్యుల పరస్పరశాపము లిందుఁ గలవు, స్వల్పదోషమునకై శపించుట సజ్జనలక్షణము కాదు.
10. ఇది యెన్నికయైన పద్యము. ఇందు, బ్రహ్మక్షత్రియులకు మనోవాక్కులయందుఁ గల వ్యత్యయమును, సమర్థతలును, ఎంతో చక్కఁగ,

చెప్పఁబడినవి. ఆఖండల శస్త్రము=వజ్రాయుధము. (కఠినతమమైనది.)

11. నగ్నవేషము=దిగంబర వేషము.

12. భూవివరము=భూ+వివరము=బిలము. నానా; స్పష్టము.

13. తోడన తగిలి=వెంటఁబడి.

14. కులపర్వతములు-మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము.

సహస్రఫణములు=వేయిపడగలు; అనంతుఁడు భూమిని మోయువాఁడు; విష్ణునకుఁ బానుపు. అయ్యెడుఁగ్-సంప్రార్థనార్థకము.

15. అరిది=దుర్లభము; అశక్యము; అరుదు=ఆశ్చర్యము, అపూర్వము, వాసుకి శివునకు అలంకార మైనవాఁడు.

16. కోటి=తుద, హద్దు (ఐరావతకోటి=ఐరావతుఁడను చిన్నపాముపడగఁ గల) ఫణిరాజులు-రాజి.ఇ.వ. రాజులు=సమూహములు, రాజిశబ్దము మహదర్థకము కాఁబట్టి 'అయ్యెడుఁగ్' అను క్రియ యేకవచనమందున్నది.

17. ఈక్షణశ్రోత్ర=చక్షుశ్శ్రవః=కన్నులే చెవులుగఁ గలవి, పాములు, ఇవి వినునెడఁ జూడ లేవు; చూచునెడ వినలేవు.

18. నాగకులము = సమూహము, అనుపయించు = సేయు.

ద్వాదశ + అర + చక్రము, అర = అంచు.

అతిప్రమాణ = ప్రమాణాతీతమైన; అతిభక్తి = ఎక్కుడు భక్తి.

ఉదంకునకు తృతీయార్థమున షష్ఠి.

19. మితవచన + అనియమిత + అర్థ + సుతులకుఁగ్—కొలఁది మాటలలోనే విపులార్థము గల స్తోత్రములకు. ఇదియె విశేషము.

20. కరంబు=అవ్య—మిక్కిలి; నానా-చేయి, పన్ను, తొండము. ధ్మానము=ఊఁదుట, వల్లె—రూ - వల్లే; అవ్యయము-అంగీకార సూచకము.

2.. ఈ పద్యమున భయానకరసము వర్ణింపఁబడినది. సమయోచితముగ శబ్దాడంబరము, తదనుకూలముగ శార్దూలవృత్తమును, గలవు. కాద

బము, బాడబానలము—మధ్యమపదలోపి కర్మధారయము. అఁడు గుఱ్ఱము మొగమువంటి మొగముగల సముద్రమధ్యస్థమైన యగ్ని.

22. శంకరనిభుఁడను విశేషణము విప్రునకు 'భయంకరకోపాగ్ని' యను టచే సార్థకమైనది. పరికరాలంకారము.

## (2) దుష్యంతచరిత్రం

(ఇందు, శైలి స్వభావసిద్ధముగ నున్నది; శకుంతలాదుష్యంతుల పరస్పరానురాగము, కణ్వుని యనాథ సంరక్షణదీక్ష, శకుంతల దుష్యంతునితోఁ జేసిన వినయ వివేక విహిత ప్రసంగము, దివ్యమర్త్య పాత్రముల సమ్మేళన వైశద్యము, రసవంతముగఁ జిత్రింపఁబడినవి.)

1. దుష్యంతుని తండ్రి ఈలినుఁడు, తల్లి రథంతరి. చంద్రవంశ్యుఁడు.

2. దుష్యంతుఁడు బాల్యమునందె సింహశరభాదులను బాలవారిణముల వలెఁ బట్టె ననుటనుబట్టి చూడ, నితఁడు పెద్దతనమున నెంతటి పరాక్రమవంతుఁ డగు నని తోఁచునో కనిపెట్టునది.
వి+సమ=విషమ. విషమ + అటవి—సవర్ణదీర్ఘసంధి; శార్దూల + ఇభ —గుణసంధి, బాల + త్వ-'త్వ' భావార్థకము; బాల్యము (రూ) బాలత్వమునందు-'ఎ', నిశ్చయార్థకము.

3. ఒండు-మఱి యొక. వైచు-రూపాం. వేయు.
యౌవనగర్వము శక్యాశక్యముల గణింప నీయ దని భావము.
అతిశయోక్తి, యౌవన గర్వము - తద్భ - జవ్వన పుగరు వము.

4. అశాంత మాతంగములు=దిగ్గజములు-ఎనిమిది-ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. ఇవె కాక, సప్తకులపర్వతములు, ఆదికూర్మము, ఆదివరాహము, ఆదిశేషుఁడు భూమిని మోయుచున్నట్లు పురాణములు చెప్పుచున్నవి.

«ఆదిత్యాంశు=సూర్యకిరణములు, సమీర=వాయువు, ఇవి చొరని యరణ్య మనుటచే సాంద్రాటవి యని భావము.
వీర్యమునన్-«న' కర్థకము తృతీయార్థకము. వీర్యము తద్భ-వీరము;
'అది క్షత్ర చరిత్ర నేరె'—పూర్వరాజ మర్యాదను పాటించి పాలించె.

5. రుజ - రూ - రుక్ = రోగము ;

6. మృగయ - రూ - మృగవ్య - మృగములఁ జంపుట, వేఁట.
పూంచిన - పూనిచిన - పూన్చిన - (రూ) = కట్టిన.
ఆజానేయము=అజానదేశమునఁ బుట్టినది, ఉత్తమాశ్వము, ఆజానేయమె తురంగార్థమై యుండ,తురంగమును జేర్చుట, కరికలభము వంటిది.
ప్రయోగదృష్టము.

7. అర్పుల బొబ్బల యులివు—అర్పుబొబ్బ లని ద్వంద్వముగఁ జెప్పక, వేర్వేఱ విభక్తి లోపముతో సమసింపఁజేయుట యిందలి ప్రయోగ విశేషము. అర్పు- అర్చు ధా॥ కృ॥ ఉలియు ధా॥ కృ॥ ఉలివు.
విపినమును మహోదధిగాను, దుష్యంతబలమును మందరము గాను నిరూపించెను. సముద్రమథనకథ సూచింపఁబడుచున్నది.

8. కడిమిమెయిన్ - 'మెన్' రూపాం॥ 'చేత' అని యర్థము. అవ్య॥ నామవాచకము-మెయి=శరీరము.

9. ఏసి - వేసి - వ్రేసి - సమార్థకములు- = కొట్టి.

10. పిపాస - సనాద్యంతధాతు వృత్తి - త్రావనిచ్ఛ.

11. ఉపమాలంకారము.

12. చొచ్చు + అపుడు—నుగాగమము.

13. ఇందు, ప్రకృతి సౌందర్యము లలితముగ వర్ణింపఁ బడినది.
అలంకారము ఉత్ప్రేక్ష. నేసలు = తలఁబ్రాలు.
పుష్పము లక్షతలుగాను, పక్షుల కలకలములు దీవనలుగాను, చెప్పఁబడుట భావిశుభసూచకము.
వృత్తము చంపక మవుట, మఱింత సొగసు తెచ్చినది.

14. కాఱు+అడవి-కాఱుటడవి, కాఱడవి.
ఊఱడక-విశ్రాంతియను మాటలేక.
ఆఱన్=పోవునట్లు; అరన్=నిండునట్లు, (కన్నులార)
ఎద-తద్భ; తత్స-హృదయ.
దుష్యంతుని యుద్యమమున ప్రకృతియుఁ దోడుపడుచున్నది.
15. మానినీవృత్తము-రాఁబోవు మానినీవృత్తమును స్ఫురింపఁజేయుచున్నది.
వనశోభ వర్ణితము.
ఏచి=పెరిఁగి; తనర్చి=ప్రకాశించి; తలిర్చి=చిగిరించి.
తావు-అవ్యదేశ్యము, వీనులు-నిత్యబహు.
16. రాజుమనసులోని యుత్సాహమువలెనే, యీ వృత్తమును చిత్రగతిని నడుచుచున్నది.
చనిచని-ఆమ్రేడితము-బహుదూరము పోయి.
హోమధూమము తీఁగవలె చెట్టుకొమ్మలఁ జుట్టుకొనుటచే, పువ్వులు లేకున్నను తుమ్మెదలు అంటిపెట్టుకొని యుండుట యిదియొ మున్యాశ్రమమని తోఁపించినది.
17. వేదమునకు, 'పదము' 'క్రమము' మాత్రమెగాక జట, ఘన, కలవు.
18. కరులయు+సింహంబులయు+సత్త్వంబులయు+సహవాసము— దూరాన్వయమె 'యొక్క' లోపించిన సమాసవిశేషము, ఎట్లు, మునితపోమహిమ జాతివైరము నుడిపినదో !
19. నావచ్చునంతకున్—నేను వచ్చువఱకు. ప్రయోగవైచిత్రి.
20. తత్+ముని=తన్ముని.
21. జయంతుఁడు-ఇంద్రుని కొడుకు; రూపమునకు ప్రసిద్ధిఁగన్నవాఁడు.మఱి, కుబేరకుమారుఁడు నలకూబరుఁడు, విష్ణుపుత్త్రుఁడు మన్మథుఁడును సౌందర్యమున నెన్నికగన్నవారె. అర్ఘ్యపాద్యాదివిధులన్-ఆది శబ్దముచే గ్రహింపఁదగినవి మఱేవి ?
22. ఒకొ-సందేహార్థకము.

23. ముహూర్తము=12 క్షణముల కాలము; 2 గడియల కాలము;
వచ్చితని-వచ్చితివి+అని; మధ్యమపురుష వకారలోపము.

24. జగతి-తత్సమ-భూమి; దేశ్య - = అరగు.

25. తవివె-తగిలె-గ కారమునకు వకారము, ఇట్లు అగు, అవు;
నమ్మ నేరనయ్యెదన్ - అగుధాతుభూతార్థక మనుప్రయుక్తమైనది.
వాడుకలో, నమ్మ నేరనైతి.
కలరూపు=నిజస్థితి,

27. ఊర్ధ్వరేతునకుఁ గూఁతుర వెట్లయితి వని యడుగుట యనుచితము.

29. కాశ్యపులు-కణ్వుఁడు-పూజ్యార్థక బహువచనము, అర్థి - తెనుఁగున కో
రిక; తత్సమ-యాచకుఁడు.

30. చెతిచి-చెడుధా "సేర-క్త్వా"
భయంపడి-భయముపడి-ముపర్ణమునకు నిందుమన్న.

32. త్రిశంకునియజ్ఞమునకు విశ్వామిత్రుఁడు యాజకుఁడైయుండ, వసిష్ఠుఁడు
తాము చేయింపనిదాని నీతఁడేల చేయించుచున్నాఁడను నీసుచే నధి
క్షేపింపఁగా నలిగి, వసిష్ఠకుమారులను శక్తిమున్నగు నూర్వురను జంపె
నని పురాణము.
పాడి=న్యాయము; పాఁడి=పాలు, పెరుఁగుమున్నగునవి-పాడి+ఎ-'ఎ'
ప్రశ్నార్థకము.

33. పమ్మిన=అతిశయించిన, రూ-పంబిన,
విశ్వామిత్రునికోపముచేఁ గల్గిన యుత్పాతము లిందుఁ గలవు.

35. దక్షిణమారుతము-మలయమారుతము. 'చల్లని', 'అల్లన' 'సుగంధ'-వీనిచే
వాయువునకు వర్ణింపవలసిన శైత్య,మాంద్య, సౌరభ్యము లను గుణత్రయి
వివరింపఁబడె.

36. కౌశిక=విశ్వామిత్ర; ఇంద్ర.
విశ్వామిత్రుని తపస్సు దేవేంద్రునికేల బాధకము ?
తపోగ్నివలన ప్రజలకుఁ గల్గు బాధ రాజుదికదా !

37 పుష్పాపచయము —పుష్ప+అపచయము=పువ్వులు[త్రుంచుట (కోయు
టు); వ్య. ఉపచయము = పెంచుట.

సఖులు-సఖి, సఖుఁడు, ఏకవచనములు, ఇచట స్త్రీపరము.

38 వలుద + ఎడలక్ - అకారసంధి.

వల్ద-వలుదయొక్క రూపాం, = స్థూల మైన,

39 కందర్పసాయకములు-అయిదు. అరవిందము, అశోకము, చూతము, నవ
మల్లిక, నీలోత్పలము. ఇవి కలుగుటచేతనె మన్మథుఁడు పంచబాణుఁ
డనఁబడు.

40 ఏఁబు - ఏటి - ఔపవిభక్తికము - సమాసమున;

41 చెట్టుపలు - రూ - చేట్టుపలు, = ఱెక్కలు.

42 కూఁతురు - ద్వి॥ ఏకవ॥ కూఁతుక్

పోని = పోలిన.

శకుంత + ల = పక్షులచే రక్షింపఁబడినది. (వ్యు॥)

53 అక్కరలు - ఐదువిధములు . కర్ణాటభాషాసిద్ధములు. మధురాక్కర -
ఒకసూర్యగణము, మూఁడింద్రగణములు, ఒక చంద్రగణము కలది,
వృత్తములట్ల ప్రాసము. యతి మూఁడు గణముల పైని.

ఇందు, స్త్రీకి ముగ్గురును, పురుషునకైదుగురును, ఒరువు రయినట్లు
చెప్పఁబడియె.

ఏను+గురు-ఏఁగురు. రూ-ఏవురు.

అనయము-దేశ్య-ఎల్లప్పుడని యర్థము.

తత్స - అన్యాయము.

44 శకుంతల-కణ్వుని పెంపుడుకూఁతురు.

కణ్వుఁడు శకుంతలకుఁ బెంపుడుతండ్రి.

45 అలంకారము-ఉపమ.

అభిజాతభావ మాభిజాత్యము - ఉన్నత వంశసంభవము.

47. శకుంతలాసహజసౌందర్యమునకు వనవాసాదికము విపరీతముగాదుష్యం తునకుఁ దోఁచెను.

ఉచితము + ఎ-'ఎ' కాకువ్యర్థకము.

'గుణముల్'—అమహదర్థక బహువచన విశేష్యము. కావున, దీని విశేషణము 'ఉచితము' అని యేకవచనమున నున్నది.

48. 'నీవిలాసమునకు మానివాసమె యర్హమైన' దని దుష్యంతుఁడు శకుం తలతో నిజాభిప్రాయమును వెల్లడించెను.

49. వివాహము లెనిమిదిటిలో గాంధర్వ రాక్షసములు క్షత్రియ వైశ్య లకుఁ దగినవి. కన్యావరులు పరస్పరప్రేమచేఁ జేసికొను వివాహము గాంధర్వము. బలాత్కారముగ వధువు నెత్తికొని పోయి చేసికొను పెండ్లి రాక్షసము.

లజ్జన్ + చేసి—చేసి, తృతీయార్థకమైన అవ్యయము.

50. 'కరుణానిరతులు' 'ధర్మస్వరూపులు' — ఈ విశేషణములు సమయ సముచితముగ నుపయోగింపఁబడినవి.

52. గాంధర్వవివాహస్వరూప మిందు వివరింపఁబడినది.

54. శకుంతలకోరిక నుబట్టి యామె లోకజ్ఞత యెట్లు వెల్లడియగుచున్నదో !

56. కణ్వునిదివ్యదృష్టి యిందు స్పష్టపడుచున్నది.

'నీదుగర్భమునవాఁడు' — అలుక్సమాసము.

57. 'నాచిత్తము ధర్మవునందె తగిలియుండ వర మి' మ్మనుటచే, శకుం తలయొక్క లోకాతీతసౌశీల్యము ద్యోతితము. శకుంతల వర్షత్రయము చూలుదాల్చుట లోకాతీతము. సద్యోగర్భసంభూత, మూఁడు తొమ్మి దులు మోచుటకంటె నిది మించినది.

58. శాకుంతలుఁడు-అపత్యార్థకతద్ధితము.

59. సత్త్వము = బలము, జంతువు.

అందలిమునులు-అందాదుల కలిగాగమము సమాసమున.

60. సాధ్వి = పతివ్రత - సాధుశీల.

తద్ద - తూ - తద్దయు; ఇట్లు వెండి - వెండియు.

ఏడుగడ - (ఏడు + కడ) గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత - అని యేడుగురు దిక్కు.

"క. గురుఁడును దల్లియుఁ దండ్రియుఁ
బురుషుఁడు విద్యయును దైవమును దాతయు నాఁ
బొరి నేడుగడయుఁ దానై
హరి నను రక్షించుఁగాత మనవరతంబున్."

63. ఎడ-కాలము. దవ్వు=దూరము-ఎడ దవ్వగుట = చాలకాల మగుట.
ముగ్ధులు=మోహపరవశులు.

64. 'పృథివి నధిపులు నూతనప్రియులు గారే?' అని నానుడి.

66. 'క. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపం దగు సుఖతరముగఁ దెలుపఁగ వచ్చున్
దెలిసిన వానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెలుప బ్రహ్మదేవుని వశమే?'-భర్తృహరి.

కఱటి=వంచకుఁడు, మోసగాఁడు.

67. పోవంగాదు = పోఁదగదు.

68. గోనకోను = యత్నించు.

72. వెల్ల వెల్లనై = వెల వెల పోయి;
వెచ్చనూర్పు = వేఁడినిట్టూర్పులు విడిచి.
కెంపు + తమ్మి = కెందమ్మి.
వాంచి-వంచి-వంగుధా॥ క్రీ॥ క్త్వా.

74. మనుష్యుఁ డెంతరహస్యముగ నేపని చేసినను, భూతపంచకాదులు సాక్ష్యము లగు చుండును.
దక్కొనన్ = దక్కు+కొనన్ = స్వతంత్రుఁ డగుటకు;
ముచ్చిలన్ = దొంగిలింప; వంచించుటకు.

75. తొంటి - రూ - తొల్లిటి, తొల్లింటి, 'తొలి'కి విశేషణము.

76. (77), (79) పద్యములు కంఠపాఠము చేయఁదగినవి. ఇందు భార్యయందలిధర్మవిశేషములు వివరింపఁబడినవి.

80. ఇందు, నహాగమనము పూర్వాచారముగఁ జెప్పఁ బడినది, 'అంగా దంగా త్సంభవసి, - 'ఆత్మావై పుత్రనామాసి' అను సూక్తము లను సంధింపఁబడినవి.

81. గార్హపత్యమునుండి యాహవనీయము పుట్టినట్లు, తండ్రి నుండి కొడుకు పుట్టును. గార్హపత్యము-సాగ్నికగృహస్థుని యజ్ఞాగ్ని. ఆహవ నీయము-దేవతల నాహ్వానించుచు వేల్చు నగ్ని. దక్షిణాగ్ని-తోఁ గూడి త్రేతాగ్ను లనఁబడు.

82. నీళ్లల - బహుత్వముమీఁది బహుత్వము.

83. పుత్ + త్ర = పుత్త్ర = పుత్ అను నరకమునుండి రక్షించువాఁడు, పుత్ర

85. పుత్త్రగాత్రపరిష్వంగము చందనాదిశాధికశీతల మనుట. ప్రాణ ము లేచి వచ్చునని వాడుక.

86. వాజ + పేయము = అన్నరూపమైన రసము త్రాగఁబడునది.
సామవేదులు చేయు యజ్ఞము.
వినిచెన్ - వినుధాతు ప్రేరణము. (వినిపించెను)

87. సత్యము = ఇనట, ప్రతిజ్ఞ.
'నాఁటిసత్యము కలుగన్' అనకంటె 'కలఁగన్' అనుట మేలు.

88 ఉత్తరోత్తరోత్కర్ష-సారాలంకారము, దీనివంటిది.-
"కం. శతకూపాధిక దీర్ఘిక;
శతవాప్యధికంబు క్రతువు, శతయజ్ఞసము
న్నతుఁ డొక్క కొడుకు, తత్సుత
శతకంబున కెక్కు డొక్క సత్యోక్తి నృపా!"
శతంబు+న+కంటె-ఇందు న గాగమము విశేషప్రయోగము.

89. అశ్వమేధము-దేనియందు అశ్వము బలియీయఁ బడునో ఆయజ్ఞము ఇది రాజులు మాత్రమె చేయునది. దానిం బట్టిన రాజులను జయించి చేయవలసినది.

గౌరవంబున పేరిన్ - సమాసమున నగాగమము.

90. నరియుఁ గావు + ఎఱుఁగు - సంధిలేమి పా
అందురు, అంద్రు.

91. సమయము-ప్రతిజ్ఞ.. నానా-కాలము, ఆచారము, జ్ఞానము, సిద్ధాంతము.
చూడు-చూడ్కుము. ప్రార్థ వార్థక ముపర్గలోపము.

94. నీకాలమున మానవంతురాం డ్రందఱు నసత్యవాదిను లనెడి యపకీర్తి
రానీయవలదు.

నాక్ - రూపాం - అనక్.

95. పాడవునక్-ఆకారమునందు.

ఎడమడుగుగక్ - వ్యత్యాసమూగా.

97. శకుంతలపరితాపము.

మధ్యాక్కర - రెండింద్రగణములు, ఒక సూర్యగణము,
రెండింద్రగణములు, ఒక సూర్యగణము - కలది
ఇట్లొక్క పాదము, ప్రాసము నియతము.
ఇందు, యతి యైదవగణము మొదటి యక్షరమయినది.

99. దివ్యవాణి - ఆకాశవాణి - రూపము కనఁబడక వినఁబడుధ్వని, ఇది,
సత్యాసత్యముల నిర్ధారించు పట్ల వినిపించు దైవభాషితము, పురాణ
ప్రసిద్ధము.

100. వీచు + తెంచు = వీతెంచు = వచ్చు. (విసరు)

102. లోకాపవాదము - లోకప్రవాదము - నింద.
అంటిని నందఱ - ద్రుతముమీఁది ద్రుతము.
'ఎఱుఁగనంటినే నందఱ కిప్పు డెఱుఁగ' అనుట లెస్స.

103. ప్రాజ్ఞుఁ డయిన కుమారుఁడు కలుగ, తండ్రి వనప్రస్థాశ్రమము నొందు
ట సనాతన ధర్మము. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాస
సము లని యాశ్రమములు నాలుగు.

104 భాస్కర, జహ్ను, కన్యకాతీర—యమునా, గంగానదుల యొడ్డుల.

## (3) ద్రౌపదీ వస్త్రాపహరణము.

(దుర్యోధనునిమాయాద్యూతమున ధర్మరాజు తన సర్వస్వమును, సోదరులను, తన్నును, శకుని తలఁపించుటచేఁ గడకు ద్రౌపదిని, ఒడ్డి, యోడినపుడు పాండవులు తనకు వశులైరని రాజరాజు సంతసించి, ద్రౌపది నవమానింపఁ దలఁచి ప్రాతిగామి నంపినసందర్భమం దీకథ వచ్చినది. ఇందు-ద్రౌపదీదేవిధర్మజ్ఞతయు, అతిలోకమానినీత్వమును, మనోధైర్యమును, భక్తివిశేషమును విస్ఫురితము లగుచున్నవి.)

1. మహిషి = పట్టపుదేవి. నానా; గేదె;
   పాలికిన్ = సగ్గఱకు. నానా, వంతునకు.
2. తరువోజ-రెండు ద్విపదపాదములు కూడి దీన నొకపాద మగును.
   ౩, 5, 7, గణముల యాద్యక్షరము యతి.

   ఓటు - ఓడు వా॥ కృత్తు.
3. యుగములు - నాలుగు-కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు. ఒడ్డు= పందెము పెట్టు.
   'భార్య నొడ్డి యోటువడిన భర్త గలఁడె' యనుట యామె యమ ర్షాభిమానములఁ దెల్లడించు చున్నది.
4. ద్రౌపది చేసిన సూక్ష్మ విషయవిమర్శన మిం దున్నది.
6. సందిగ్ధమైన యర్థము = సందేహాంశము.
7. ఏకవస్త్ర=రజస్వల-ఇట్టి యెడ, నొంటి బట్ట కట్టుట మర్యాద.
   వృకోదరుఁడు=వృక+ఉదర; తోడేటికడుపువంటి కడుపుగలవాఁడు.
8. కృష్ణ - నల్లనిది - ద్రౌపది కీపేరు రూఢము.
9. స్త్రీ నవమానింపఁ దలంచుదుశ్శాసనునికార వాధముఁడనుటయుచితము.
   అరుగంగఁ బోలు - పోవచ్చును.
   ఒడుము - = ఓడి చు - దేశ్యప్రేరణము.
   పాత్రి - పాలఁతి యొక్క రూపాంతరము, ప్రయోగవిశేషము.

10. డాయక్ - రూ - దాయక్ - ఇట, దడల కభేదము. ఇట్లు, దాఁగు, డాఁగు.

11. అపశదుఁడు - = నీచుఁడు.

రాజసూయము - సర్వదేశాధీశ్వరుల జయించి, వారిచేఁ గానుకలు గొని, రాజులు చేయు నొక ప్రసిద్ధయాగము. అవభృథము - యజ్ఞదీక్షానంతర స్నానము.

ద్రౌపది శిరోజములు యజ్ఞమంత్రిత జలాభిషేకము నంది పవిత్రము లయినవి. అట్టి వానిని బట్టి దుశ్శాసనుఁ డీడ్చి తెచ్చుట దారుణ కృత్యము.

12. కర్ణ శకుని దుర్యోధనసైంధవులు - దుష్టచతుష్టయము.

13. భర్తలయందలి గౌరవమును, దుశ్శాసనునియందలి దుశ్శీలతయు, ద్రౌపదిమాటలవలనఁ దేటపడుచున్నవి.

14. ఒక్క దుర్మార్గునివలనఁ గులమున కెల్లఁ దీఱని యపఖ్యాతి కలుగుచున్న దని నీతి. ఇందుచేతనె దైవ మె దిక్కని ద్రౌపది కృష్ణునిం బ్రార్థించెను.

15. జగత్త్రయి - స్వర్గమర్త్య పాతాళములు. అలం - అనుప్రాసము.

16. ఇన - సూర్యుఁడు - నానా . రాజు.

17. పణము = పందెము.

18. భీమునికి ధర్మజునిపైఁ గల్గిన కోపావేశము. స్త్రీగౌరవము చెడుటచే, అగ్రజునియెడ మున్నెంత విధేయత యున్నను, ఇట్లనిపించినది.

19. అర్జునునిసామరస్యజ్ఞాన మిందు స్పష్ట మగు చున్నది. నేరమి = అజ్ఞత.

పరులు = శత్రువులు; నానా - ఇతరులు.

20. వికర్ణుఁడు దుర్యోధనుని యన్యతమ భ్రాత, ఇతఁడు పిన్నయయ్యు, ధార్మికామర్షమును నిర్భయముగా వెల్లడించినధీరుఁడు. వీఁడు విభీషణు నట్టి వాఁడు.

22. జూదము, పానము, వేట, బహుభక్షణాసక్తి - ఈనాలుగే యిట దుర్వ్యసనములుగఁ జెప్పఁబడినవి.

"గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబు, పరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల."

పైఁ జెప్పిన బహుభక్షణాసక్తి యిందు లేదు.

వికర్ణుని ధర్మవిమర్శన మిటఁ దేటపడుచున్నది.

1. వ్యసనాసక్తుఁ డయిన ధర్మజుని పందెము పాటిగాదు.
2. పంచపాండవులకును స్వత్వమైన ద్రౌపది ధర్మజునిచే మాత్రమోటువడుట తగనిది.

ఈ రెండుకారణములచే ద్రౌపదిని జయించితిమని భావించుట, రజస్వలను దోడ్తెచ్చుట యన్యాయము, అని వికర్ణునివాదము.

23. గరువము+పలుకులు=గరువంపుఁబలుకులు.

ఇందు, మువర్ణమునకు, బిందుపూర్వక 'పు' వర్ణకమును,
పిదప నుగాగమమును, వచ్చినవి.
చనును×ఎ-చనునె, చన్నె. విశేష ప్రయోగము.

24. వికర్ణుని ధర్మసిద్ధాంతమును పూర్వపక్షము చేయుటలో
కర్ణుని విపరీతబుద్ధి గానవచ్చెడు.

26. ఒల్చెన్=విప్పెను.
ఆశంక=పూర్ణ సందేహము.
వస్త్రింబునట్టి=వస్త్రమువంటి.
ద్రౌపదిదైవవిశ్వాసమహిమ యిట సూచితము.
దుర్యోధనుఁడు పరాభవింపఁబోయి పరాభవింపఁబడెను.

28. భీముఁడు దుశ్శాసనునిగూర్చి చేసినప్రతిజ్ఞను దెలుపుప్రసిద్ధపద్యము.

30. పద్యము మొదలు (38) వఱకును విదురునిధర్మోపన్యాసము.

31. 17 పుట చూడు.

39. ద్రౌపది తన గౌరవము వెల్లడించినది.

'ఆ' విధంబున నట్టు 'లా' స్వయంవరమున నని ప్రారంభించుట మెఱుఁగు దెచ్చినది.

40. అవ్యాజ=అమాన్య-గౌరవార్థకము.

గహనంబు - చొరరానిది.

కులపాంసనున్=వంశదూషకుని.

41. కర్ణునియనుచితపరిహాసోక్తి.

42. కలాపవిభాసికేశభారమ్మున నొప్పుదానిన్ = నెమలిపురివలె నొప్పు శిరోజములచేఁ బ్రకాశించుదానిని.

కొప్పువీడి వ్రేలాడుచున్నదాని నని భావము.

43. ప్రళయసమయదండధరనిర్దయుఁడై = ప్రళయకాలమందలి యమునివలె దయారహితుఁడయి.

44. భీముఁడు దుర్యోధనునిగూర్చి చేసినప్రతిజ్ఞ - సుప్రసిద్ధ పద్యము.

రంభా+ఊరు+నిజ+ఊరు+దేశమునన్-అని పదచ్ఛేదము.

46. 47. ద్రౌపది నవమానించుటచేఁ గలిగిన యుత్పాతములు,

వఱటులు-ఏకవ-వఱడు=నుసలినక్క.

48. మహత్+ఉత్పాత = మహోత్పాత. కర్మధారయస. కలశభూ = ద్రోణుఁడు (కుంభసంభవుఁడు).

అరిష్టము=కీడు. నానా. కాకి, కుంకుడుచెట్టు, పురిటిల్లు.

49. 'పరమపతివ్రత, తపస్విని, ధర్మరత, అయోనిజ' ఇవి ద్రౌపది ప్రకృతిమానవభామిని కాదని తెలుపుచుండె. చెప్పరములు = దుస్సహవచనములు.

బాల్యము దక్కవు = చిన్నతనపుఁ జేష్టలు మానవైతివికదా?

51. భంగించి=భంగపెట్టి యని సామాన్యార్థము.

ఇట, మందలించి యని భావము.

52. కోడండ్రురయందు - (కోడండ్రయందు) బహుత్వముమీఁద బహుత్వము.

అభ్యర్చితవు-అభి+అర్చితవు, అభి ఉపసర్గ 'ప్ర పర ప్రతి పర్యత్యధ్యభ్యవానూపసంస్వప, ని వి నిర్దురుదప్యాజేత్యుప సర్గాస్తు వింశతిః'

54. ధృతరాష్ట్రుఁడు వరములు కోరుకొమ్మన్నపుడు, ద్రౌపది, 'తన్నింతకుఁ దెచ్చిన ధర్మజుని దాస్యమునుండి విడిపింపు మనుట యొక గుణవిశేషము.

దాస్యము = (దాసభావము) సేవ.

56. నెమ్మి=నెమ్మది, నానా-క్షేమము, సంతోషము, నెమిలి.

58. బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర స్త్రీలు కోరఁదగిన వరముల విధి. ధృతరాష్ట్రుఁ డెక్కుడు వరము లిచ్చెదనన్నను, ద్రౌపది ధర్మమునకుఁ గట్టువడి రెండే కాని మూఁడవది కోరననియె. ఇది మఱియొక గుణవిశేషము.

59. ఒగ్గు × ఎగ్గు (మేలు, కీడు).

60. ఎఱుక - ఎఱుఁగుధా. 'కృ'.

మఱచునది - అని విధ్యర్థకము.

61. ఉత్తమపురుషుని యుత్తమగుణములు.

62. ధృతరాష్ట్రుఁడు ధర్మజు ననునయించుట.

63. పాచి - పాయుధాతు ప్రేరణార్థకము.

క్రన్ననన్ - రూపాం - క్రన్నన్ = త్వరగా.

ఉద్ధరించెన్ = లేవనెత్తెను.

తరలము — న,భ,ర,స,జ,జ,గ

12 వ యక్షరము యతి.

31. మత్తకోకిలము — ర,స,జ,జ,భ,ర.

11 వ యక్షరము యతి.

---

## 4. అహింసాస్వరూపము.

(కౌశికుఁ డను బ్రాహ్మణునకు ధర్మవ్యాధుఁ డనుకిరాతుఁడు ధర్మసూక్ష్మము నెఱింగించు సందర్భమున వచ్చినది. కౌశికుఁడు తపస్వి. ఇతఁడొక చెట్టుక్రిందఁ గూర్చుండి తపస్సుచేయు చుండ, మీఁదనుండి కొంగరెట్టవైచెను. ఇతఁ డలిగిచూడ, కొక్కెర తోడనె చచ్చిపడె. మాధ్యాహ్నికభిక్షార్థమై గ్రామములోనికిఁ బోయి, యొక బ్రాహ్మణ గృహమున నీతఁడు భిక్షమడిగెను. బ్రాహ్మణి భిక్షతెచ్చునంతలోనా మెభర్త వచ్చుటచే, నతని కుపచారములుచేసి వచ్చునప్పటికి జాగయ్యె. కౌశికుఁడు మండిపడెను. నీకోపమునకు నేఁ గొక్కెరను గానని యాపతివ్రత సమాధానము చెప్పఁగా నతఁడాశ్చర్యపడి వేఁడ నామె ధర్మవ్యాధునికడ ధర్మసూక్ష్మములు నేర్చుకొమ్మని పనుప వచ్చినవాఁడు. ధర్మవ్యాధుఁడు మాంసవిక్రయమను కులాచారము నడుపు కిరాతుఁడయ్యును, జాతిస్మరత్వము మాతాపితృభక్తి ధర్మజ్ఞత గల యుత్తముఁడు.)

1\. ఎవ్వరికి నేర నగు? = ఎవరు గ్రహింపఁగలరు?
నేరువక - అనుటకు నేరక అనుట విశేషము.

2\. సూవె - నిశ్చయార్థకము, రూ. సుమె, సుమ్మె, సూ, సుమి, సుమ్మి, సుమీ, సుమ్మీ.
భూతములు = ప్రాణికోటులు. నానా - పంచభూతములు, పిశాచములు, పుట్టినవి, జరగినవి.

4\. భక్ష్యము = (తినఁదగినది) తిండి, పిండివంట.
ఆహారమైదువిధములు - భక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయములని.
అస్ఖలితము = (జాఱనిది) స్థిరమైనది.
శ్రుతులు = (వినఁబడునవి) వేదములు.
వేదములు మొదట ధ్వనిరూపముననే పుట్టినవి.
అప్పటికి లిపిలేదు.

5. శిబిచక్రవర్తి శరణాగతరక్షణధర్మము పరీక్షింపఁ దలఁచి యింద్రుఁడు డేగయై పావురమైన యగ్నిని తఱిమికొని వచ్చినపుడు, తన్ను శరణుచొచ్చిన పావురమును గాపాడ శిబి తన మేని మాంసమును దాని యెత్తు కోసి యిచ్చెను.

6. పితృశేషము - విఘసము, దైవతశేషము - అమృతము.
"అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకమ్,
దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్"

7. హాలికుఁడు - (హలము-నాఁగలి కలవాఁడు) = వ్యవసాయదారుఁడు.
ఓజ = క్రమము.
సీర + అగ్ర = నాఁగటితుద.
జంతులు = జంతువులు - 'వు' లోపము.
దైవజ్ఞ ! = పండితుఁడా.
- ఊహింపుము + ఆ = సంప్రార్థనార్థకము.

8. దేహయాత్ర - జీవయాత్ర = పొట్టపోసికొనుట, మనుగడ,
తారు-టా-తమరు, తాము.

9. తొడరు = సంభవించు.
నిపీడనము = మిక్కిలి బాధించుట. (త్రుంచుట కోయుట నొ.)

10. ఎడ = దూరము - నానా. సమయము, స్థలము. అందు (ఉదా. నాయెడన్.)

11. దురవబోధంబు = దుః + అవబోధము = దురవగాహము = తెలియరానిది.

---

## 5. ఉత్తరసారథ్యము.

(పాండవు లజ్ఞాతవాసకాలమున విరాటునిపురి నున్నవారని, నుండిరేని విరటునకుఁ దోడుపడుదురని బయలుపడుదురేని సమయభంగము చేయ నగునని యెంచి విరటుని పశుగణములను బట్టుటకు ముందు

గ దక్షిణమునకు సుశర్మను బంపి యోధుల నెల్లర రానిచ్చి పిమ్మట నుత్తరగోగ్రహణమునకై దుర్యోధనాదు లెల్లరు రాఁగా వారి నెదుర్కొనుటకై యుత్తరుఁడు పోఁదలఁచినప్పటికథ యిది.)

1. బృహన్నల - అర్జునునియజ్ఞాతవాసమునందలి మాఱుపేరు.
వ్యు - బృహత్ + నల = ముంజిగడ్డివలె నల్లనైన శిరోజములుగల.
అర్జునునికిడిన ఊర్వశీశాపమీ యజ్ఞాతవాసమున నుపకరించినది.బృహత్ + నర - 'రల' లకు నభేదముచేసినను ఈ గూఢనామము సత్యమె యైనదని తోఁచెడు.
కలహము - తద్భ - కయ్యము.

2. పైమఱువు - రూ - మైమఱుఁగు - కవచము.
తొడి - రూ - తొడిగి (గి వర్ణలోపము).
తప్పక్ + త్రుంకక్ = వెనుకఁ దీయుటకు.
సైరంధ్రి — పరగృహమందుండి స్వతంత్రురాలయి శిల్పకార్యములు చేయునిల్లాలు,

3. చేఁత - చేయుధా॥ కృదంతము.
సారథికమ్మె — సారథివికమ్మె - మధ్యమపురుష వు వర్ణకలోపము వైకల్పికము.
ఏడ్తెఱక్ = పరాక్రమముచే

4 వైరాటి = విరాటపుత్త్రుఁడు ఉత్తరుఁడు.
కిరీటి = అర్జునుఁడు. తద్భ - క్రీడి.

5. ఖాండవము - ఇంద్రునివనము - సకలమైనయోషధులు కలది.

బహుయజ్ఞహోమాజ్యభక్షణమునఁ గలిగిన యజీర్ణవ్యాధి నివర్తించుకొనఁ దలఁచి, యింద్రునివలని యాటంకము లేకయుండ తన ఖాండవదహనకార్యమునఁ దోడుపడుమని యగ్ని కృష్ణార్జునులను వేఁడుకొనఁగా,

బాణపంజరము గట్టి కాపాడి, పార్థుఁడాతనివలన నక్షయతూణీరాదులఁ బొందినట్లు పూర్వకథ. ఇయ్యెడన తక్కెను - ఇప్పుడే తగ్గినదా?

6. తనుత్రాణము = కవచము, (శిరస్త్రాణము = పాగా)

7. ఒఱపులుగాఁ = వ్యత్యాసముగా, తాలుమాలుగా. మై = శరీరము.

8. కంకటము = కవచము.

పని - పతుకబ్ధభవము.

చిడిముడిపడఁ = తొట్రుపడఁగా.

10. సిడము = ధ్వజము.

11. గెలుము = గెలుపుము, ఇట్లు - నిలుము, పిలుము.

13. పూంచి - పూనిచి, పూన్చి, ఇట, బిందువు విశేషము.

పంచానన - పంచ+ఆనన=విడఁద మొగముగల.

15. ఉత్తర చిన్నతనపుఁ గోరిక.

పొత్తిక - చిన్నగుడ్డ, పొత్తి, 'క' స్వార్థకము - పొత్తు=స్నేహము.

16. చేకొనుననెఁ - ఇది సాధారణముగా దుఃఖాశ్చర్యములం దెలుపు నవ్యయముగ వాడఁబడుచున్నది. జయలక్ష్మినే యుత్తరుఁడు చేకొను నప్పుడు, పొత్తికలు దెచ్చుటొక్క ఘనకార్యము కాదని భావము.

17. నొగలు = కూబరములు.

ప్రుక్కు = ముడుతి

పితృవనముపలనిఁ = శ్మశానముపైపు.

భూమింజయుఁడు - ఉత్తరుని నామాంతరము.

అయ్యెడుఁ+అని = అయ్యెడు మని.

ఎదుతల ద్రుతంబునకు అనుకరణంబున ముగాగమము.

పరేతనిలయము = శ్మశానము.

18. ఈప్రశస్తపద్యమున, కౌరవసైన్యము నడచునప్పటిచొప్పు వీరశృంగారముల సమ్మేళనముం దెలుపుచున్నది. ఆకుపచ్చనిచోట్లు లాకుతోంపములవలెను, ఎఱ్ఱనిచోట్లు చిగుళ్లవలెను, తెల్లనిచోట్లు పూఁబొదలవలెను

పసపుపచ్చనిచోళ్లు పుప్పొడులవలెను, అయిసైన్యము నడుచునప్పుడెగ సిన ధూళి ప్రమదావనమువలె నున్నట్లుత్ప్రేక్ష.

నలిన్ = చక్కఁగా.

కాఁపు = కాఁపురము.

గోడిపడన్ = అణఁగఁగా.

పూవు + బోద - పూఁబోద, ప్రాఁతాదులవలె నిందులుప్తశేషమును, నుగాగమమును.

పూవు + పొడి = పుప్పొడి. లుప్తశేషమును, పూర్వహ్రస్వమును, పైహల్లునకు ద్విత్వమును సిద్ధించినవి.

19. భయభ్రాంతునిస్వభావము.

గరుపాటిన = గగుర్పొడిచిన (శరీరము).

తలఁకు మనము = చలించిన మనస్సు.

తిచ్చపడిన = నిశ్చేష్టమైన (చూపు).

20. భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపుఁడు మొదలయిన యోధవర్గముచే భయంకర మయినది, దుర్యోధనుఁడను గ్రీష్మర్తువందలి చండభానుని పరాక్రమములచే వ్యాప్తమైనది; శస్త్రాస్త్రములయొక్క యుగ్రతచే ప్రకాశించు చతురంగబలముచే వెడిదమైనది; యెత్తయిన టెక్కెములను జ్వాలలతోఁ గూడినది.

అస్త్ర - మంత్రపూర్వకముగఁ బ్రయోగింపఁబడునది.

శస్త్ర - కత్తిమున్నగు నాయుధము.

21. అకృతాస్త్రుఁడన్ = ఉత్తమపురుష విశేషణము = అస్త్రవిద్య నేర్వని వాఁడను.

22. వెట్టిదులు = క్రూరులు.

కొలఁది = శక్తి.

23. మార్కొనమి = మార్కొనను, వ్యతిరేకభావార్థకము.

“ప్రాణములు తీపన మున్విఁకవే, బృహన్నలా!” ఇది, నానుడి దొరవది.

24. దర + హసిత = చిఱు + నవ్వు.

25. ఆమిషము = లాభము, ధనము, (మున్ను, గోధనమె ధనము) నా నా.
భోగ్యవస్తువు, మాంసము.

26. నెఱ + మనము = నెమ్మనము.

27. ఎలుఁగువడఁగ = ఎలుఁగు + పడఁగ = కంఠస్వరము తగ్గఁగా.
దయ్యము = దైవశబ్దభవము.
ఉత్తరునిపిఱికితనపుమాటలు నవ్వుపుట్టించుచున్నవి.

29. పోక - పోవుధా. కృదంతము = పోవుట.
లోకముచక్కటి = లోకధర్మము.

30. చిందము = శంఖము.
ఉరవడి = కడువేగము.
అగ్గలికము = అతిశయము.
వర్మము = కవచము.
బరవసము = పరాక్రమము.
క్రందు = ఆపద.
నవ్వరెట్లు = ఎట్లు నవ్వరు? అని యన్వయము.

31. చాసట = తోడు.
లేర = లేరు+అ - నిశ్చయము.

32. వెడమాటలు = వ్యర్థభాషణములు.

34. వెగడు = భయము.
తెగడు = నిందించు.

36. అగ్గించి = స్తుతించి.
కొంపోవు = కొనిపోవునకు విశేషరూపము. రిత్త - రిక్త (తత్సమ
ఊరక.

37. కదుపు = పసులమంద.

పెట్టించి = విడుచునట్లు చేసి.

38. పల్లటిల్లన్ = వెల వెల పోఁగా.

39. అఁగుధా. క్రే = అఁగు = అడ్డగించు.

40. వీటిఁబోవన్ = చెడునట్లు.

41. కుత్సించుచున్ = నిందించుచు.

బీభత్సుఁడు = శత్రువులను యుద్ధములలోఁ గలఁతపఱుచువాఁడు.

42. బృహన్నలను జూచి యజ్ఞులు నవ్వుచున్నారు ; ప్రాజ్ఞులు వస్తుతత్త్వ
మును గనిపెట్టుచున్నారు.

43. ఊష్మలత = తైక్ష్ణ్యము, శౌర్యము.

'వికృతవేషావృతంబుచై' - యనన్వయము-

'వికృతవేషావృతంబునై' యనుటయొప్పు.

నివులు = రూ. నీఱు. నిప్పుమీఁది తెల్లనిపొర.

44. పేడి = నపుంసకుఁడు.

(పేడి = గడ్డము మీసము లేనివాఁడు)

45. దొరకొనక = (దొరకక) సిద్ధపడక

46. పరి = పేన.

47. ఎయిదు-రూపాం, ఎద్దు = వెంబడించు.

48 తటతట - కొట్టుకొనుట యందైన యనుకరణము.

పెలుకులు = భయాదులచే విహ్వలించు.

శరటిదళకము = పదియేనుఁగులు.

49. నాతోడిప్రేముడి = (నాతోడన్ + ప్రేముడి)

సమాసమున, చేత తోడ వలనల కిత్వంబు.

ప్రేముడి - ప్రేమ యనుటకు వైకృతము.

అంబకున్ = అమ్మకు.

చేతః ప్రీతి - ఇంచలి విసర్గము ఉపధ్మానీయము.

పోడసూతున్ = కనుఁగొందును.

51. అన్న - ఆదరార్థకము.

పోటు = యుద్ధము.

చిచ్చుఱపిడుగు = అగ్నిమయమైనపిడుగు - (నిప్పులొలుకునది) తత్సమసమాసము - అగ్నిమయాశని.

## 6. అభిమన్యువివాహము.

(ఉత్తరునికి లభించిన దనుకొన్న విజయము బృహన్నలదే యనియు, నతఁడు విజయుఁడే యనియు గ్రహించి, సంతసించి, విరటుఁ డతనికిఁ దన తనయ నుత్తరను గానుకగా సమర్పింపఁ దలపెట్టఁగా, నర్జునుఁడు ధర్మాను మతమునఁ దనతనయున కిమ్మన్న సందర్భమందలికథ.)

1. వైవాహిక ... సావధానుండు = వివాహప్రయత్నములయందు శ్రద్ధ గలవాఁడు.

మౌహూర్తికులు = ముహూర్తమును పెట్టువారు. (జ్యోతిష్కులు) జాతక, ముహూర్త, సిద్ధాంతము లని జ్యోతిషభాగములు మూఁడు.

లగ్నము - ఇచట, నిర్ణీతసమయము, మేషాదులు పంద్రెండు లగ్నములు లేక, రాసులు.

వివిధప్రసాధనశోభితులు = నానాలంకారములచే నొప్పువారు.

భద్రగజము - ఉత్తమజాతియేనుఁగు.

భద్ర, మంద్ర, మృగము లని గజజాతులు మూఁడు.

మట్టపుధట్టంబు చేసికొని = కొలఁదిసేన గూర్చుకొని.

ధట్ట = సేన. మువర్ణకము చింత్యము.

క్రంత = వాడుకలో, కంత, పెండ్లికొడుకు వారు పెండ్లికూఁతు వారికిఁ దీసికొని పోవుడు బహుమాన ద్రవ్యములు.

వావా; సందు, రచ్చ, రంధ్రము.

తూర్యము = వాద్యవిశేషము.

మాగధ — వంశక్రమముగ పరాక్రమాదుల నగ్గడించువాఁడు.

వంది = ఒక వ్యక్తియౌదార్యాదికమును స్తుతించువాఁడు. (సూతుఁడు-జయవెట్టువాఁడు.)

ఈ ముగ్గురును బట్టుజాతివారె.

2. విరటుని రొండురుసన్నాహోత్సవము.

3. విహితపరిపాటితోన్ = విధి ననుసరించి (విధిక్రమమున).

4. సాంవత్సరికులు = జ్యోతిష్కులు.

5. వీనులన్ — నిత్యబహువచనముగాఁ బ్రయోగింపఁ బడుచున్నది. = చెవులయందు.

తియ్యము = ప్రీతి.

విన్కి = వినికి - వినుధాతువు॥

ఊను = పూను (ఆదివర్ణలోపము)

ఇట్లు నెగయు పోవు హెచ్చు ను.

ఉవ్విళులూరు = ఆశపడు.

మారవికారము = మోహము

6. అవలోకనము - రూ - ఆలోకనము = చూచుట.

7. తివుట + మై = కోరిక + తో.

వ్రేఁగుపడిన చాడ్పునన్ = చిక్కుపడినట్లు.

ఎఱుక = జ్ఞానము (భావము).

తా॥ వధూవరుల పరస్పరావలోకనములు నఖశిఖ పర్యంతము వ్యాపించి యనురాగమును వెల్లడించు చున్నవి

9. దోయిళులు - దోయిలి (ఏక॥ వ॥) దోసిలి (రూపాం) నిండు + ఒం దన్ = నిండు పడునట్లు, (పూర్తి) అక్షతప్రకరము = సేసఁబ్రాలు తలఁబ్రాలు. దోసిలి = ఇట, అత్యన్నతేపదార్థకము. (దోసిళ్లానిరి) అల ం॥—ఉపమ.

10. విచ్చలవిడి = స్వేచ్ఛ

వెరవు = ఉపాయము.

(cf- వెఱపు, వెఱఁగు)

పచరింతురు. (ప్రచారింతురు. తత్స.) పఱపుదురు,

11. చిత్తమునగాఢరాగము-అలుక్సమాసము.

రాగము = ప్రేమ, రక్తిమ.

ఉత్తరమనసులోని యనురాగము చేయి చాఁపఁగానే మాపినట్లు రక్తిమ కనిపించుచున్నది. అలం॥ ఉత్ప్రేక్ష. పల్లవాలంబిమత్తేభలీలన్ =చిగురు పట్టుకొను మదపుటేనుఁగు రీతిని, అలం. ఉపమ.

కాలుసేతులురక్తవర్ణములగుట భాగ్యసూచకమని సాముద్రికశాస్త్రము.

13. పెనుఁగుదుటన్ — పెను + కుదురు + అన్ = పెద్దపాదులో

1. 2.

1. ను ఆగమము 2. టు వర్ణము ఔపవిభక్తికము.

చూతము = మామిడి చెట్టు.

నవమాలిక = విరజాజితీఁగ.

అలం॥— ఉపమ.

14. ఉత్తరాభిమన్యుల పరస్పరానందసమ్మేళనము.

వర్ణనము స్వభావసిద్ధము.

క్షత్రియులు ద్విజులలోని వారు కావున, వివాహాదులందు హోమాదిక

ములు గలవు.

గెడగూడ = జత గూడ.

ఎయిదిన = పొందిన, ముట్టిన.

ఊఱట = విశ్రాంతి.

(ఊఱడు ధాతు కృదంతము)

తలతాఁకులు = తలలను (మొనలను) తగులునవి.

మవ్వము = సొగసు, కోమలత్వము.
మార్గతి = మాఱు + గతి, (అన్యమార్గము) —శకటరేఫము సంయుక్తమున రేఫమగును. చొక్కు = పారవశ్యము. (చూ॥ చొక్కుమందు, చొక్కుపొడి)
పెన్నిట్ట—పెన్ + నిట్ట = పెద్ద + ప్రవాహము. సమ్మదాంబుధి—రూపకసమా॥

## (7) శ్రీ కృష్ణుని రాయబారము.

[పాండవులు సమయము చెల్లించి వచ్చి తమపాలిమ్మని సంజయుచే రాయబారము నడపినను దుర్యోధనుఁ డొడంబడమిచే, కులనాశమునకుఁ దలంకి సామరస్య మొనర్చి యెట్టు లయిన సంధి సమకూర్పుమని సమర్థుఁడయిన శ్రీ కృష్ణుని ధర్మరాజు పంపిన సందర్భము]

1. జలదస్వనగంభీరతన్ = మేఘధ్వని (ఉఱుము) వంటి యాడంబరముతో
ఎలుఁగు = కంఠధ్వని. (నానా. ఎలుఁగుబంటి) దీప్తి = కాంతి.
చవులన్ = రుచులతో (శ్రావ్యముగా)
మేఘోపమానము శ్రీకృష్ణుని శరీరమునకుఁ గలదు; కావుననె వాక్కులు ఉఱుములవలె, దంతకాంతులు మెఱుములవలె, నుండుట సమంజసము.
భూమిభునకున్ = భూవిభునితో
—వ్యా॥ వచ్యర్థాఽముఖ్య కర్మంబునకు 'తోడ' 'కు' వర్ణకంబులు ప్రాయికంబుగ నగు.
2. సభలలో నెట్లు భాషింపఁదగునో కృష్ణునియెత్తుగడలోనె వెల్లడియగుచున్నది.
భారతాన్వయప్రియము = భారతవంశమువారికి మేలు
3. క్షీరోదకగతి-పాలు నీరు వలె. (క్షీరనీరన్యాయము)
4. సద్గుణోత్తరులరు-మధ్య; విశేషణ.

= మంచి గుణములచే శ్రేష్ఠులయినవారలు.
(తృతీయాతత్పురుషము.)

శుభ శీలురు—బహువ్రీహి సమా॥

దీర్ఘపూర్వక లకారోపధాదంత సంస్కృతసమ మహచ్ఛబ్దములమీఁది 'లు'ల లకురుర లాదేశంబు లగును.

5. లోనిపాత్తు......జనస్తుత్యముల్ కావింపం దగు.

నీమనసులోనిది క్రియలోఁ గనఁబఱుప వలయునని భావము.

కుటుంబములోని వారు తెచ్చిన మంచిచెడ్డలు యజమానునకు వచ్చును.

ఇది లోకధర్మము.

6. సుయోధనుఁడు = దుర్యోధనుఁడు.

నాక = అనక.

పుయిలోడరు = వెనుదీయరు.

(7) తెఱఁగు = సంధి, నానా, విధము.

పోరితము = పోరు (యుద్ధము)

8. వలసినన్ = ఇష్ట మగు నేని.

తీర్పంగ నేర వచ్చున్ = చక్కఁబఱుప నగును.

వీరలఁ దేర్చుట = వీరిని ప్రసన్నత నొందించుట.

నెఱి = న్యాయము.

9. అనిన్ = యుద్ధమునందు.

ఈల్గుట = చచ్చుట, నీఁగుయొక్క. రూపాంతరము.

10. సముద్రవేలావృతోర్వి = కడలిచెలియలికట్టచేఁ జుట్టఁబడిన పుడమి.
(సకల భూమి)

11. ఉపేక్ష × అపేక్ష.

12. చావు = చచ్చుధా॥ కృ॥

నొవ్వు—నొచ్చుధా॥ కృ॥ రూ॥నొప్పి.

ఎవ్వారికి వచ్చిన మేలు? —ఎవరికి వచ్చినను మంచిది కాదు.

13. వీరు వారు = కౌరవ పాండవులు.

రిత్తబవరము = వట్టిపనికిమాలినయుద్ధము.

ఆఱడి చావు-నింద్యమైన మరణము.

యుద్ధము నాశహేతువని శ్రీకృష్ణుని హితబోధ.

14. యుద్ధమైనయెడల, పాండవులకె విజయము కలుగును, నీరాజ్యము పోవును. నీకపఖ్యాతి వచ్చును, తరువాత పరితాపము కలుగును, అను భావము వచ్చునట్లు "నీదు ప్రాభవంబు నీతియు కాంతియుఁగాచికొను" మని శ్రీకృష్ణుఁడు చెప్పెను.

16. ప్రజలు = బిడ్డలు.

17. పదుమూఁడగు నేఁడు - పదుమూఁడవ యేఁడు.

(ఏడు = ఆఱు నొకటి)

అజ్ఞాతవాసము = తెలియకుండునట్టి యునికి.

"పదివేలేండ్లకు"—ఎన్నఁటికిని (జాతీయము)

ఒక్కరూపు = ఒక్కవిధము.

కొఱగాకున్నన్ = పనికి మాలినను.

18. ధర్మము పాపముచేతను, సత్యము బొంకుచేతను చెడునని యన్యాయము ఇట్టి దాని నుపేక్షించువారికే యాపద యగును. ధర్మసత్యము లందు దైవముండును.

19. మనోవాక్కాయములు త్రికరణములు.

క్రోధమానమాత్సర్యములు – కోపము, గర్వము, చలములేక ద్వేషము. (ఇవి యరిషడ్వర్గములోనివి)

20. చెప్పుఁడ = చెప్పుఁడీ! (పకారద్వయలోపమును, సంప్రార్థనార్థకమైన అకారమును.)

21. అర = భేదము.

దశ = అవస్థ, స్థితి

23 అజాతశత్రుఁడు - వ్యు॥ శత్రువులు పుట్టనివాఁడు, ధర్మరాజు; ఇత
నికి మనసులో నెవ్వరియెడను శత్రుత్వము లేదని భావము.
ధర్మరాజాదులు అణఁగి మణఁగి యున్నారని మాత్రమె యెన్నకు,
వారు బలవంతులె సుమా యని శ్రీకృష్ణుని సూచన.

25. మదిమదినుండక = నెమ్మదిగా, నిశ్చింతగా నుండఁగా.

26. భుగ్నులు + కాక = వఁగినవారు + అగుచుండఁగా.
పెడచేతఁ గన్నునీ రొత్తుకొను—స్వభావోక్తి
(దుఃఖమును దిగ మ్రింగి)
అపకారులతో నైనను పొత్తుగోరు చున్నాఁడు;
ఇది ధర్మజు గుణవిశేషము.

27. తనుఁ దాన పోలుఁ గాక = తనకు సాటి తానే కాని (అనన్వయాలం
కారము.)

28. ఇరు దెఱఁగు = రెండు పక్షములు.
సమా॥ ద్విగువు. ద్విగువున నేకవచనము ప్రాయికముగ నగు.

29. శాంతశూరులు = సమయము వచ్చునంతకు శౌర్యము నణఁచి శాంతిను
వహించువారు.

(నివురు గవిసిన నిప్పులట్టివారు.)

పథ్యము = హితము.

30. నెఱి = క్రమము.
రోమహర్షణము, రోమాంచము = గగుర్పాటు. అనువు + అరి = నెర
వరి, ఉపాయశాలి.

అ8 - మతుబర్థకము.

అచలాకృతులు = కదలని స్వరూపములుకలవారు.
అచల—నఙ్‌ త॥ అచలాకృతులు = బహువ్రీహి.

## (8) మంకి చరిత్రము.

(ధర్మరాజు శరతల్పగతుఁ డయినభీష్ముని ధనలుబ్ధుఁ డయిన పురుషునకు సుఖమెట్లగు నని ప్రశ్నింప, నందులకు శాంతనవుఁడు చెప్పినయితిహాసము.)

1. కోడియ-రూ, కోడె=దున్న నీడువచ్చిన దూడ.
   పోని=పోలిన.
   వత్సతరములు - కోడెదూడలు.
   అకట! - సంతాపార్థకము.
   నిర్వేదనము = విచారము.
2. దైవము పౌరుషముకంటె హెచ్చు.
   దైవము = అదృష్టము (భగవంతుఁడు)
   పౌరుషము = పురుషకారము, మనుష్యయత్నము.
   ఇట్లు "క. క్షేత్రంబు పురుషకారము
   ధాత్రీశ్వర! బీజ మరయ దైవము రెండున్
   మాత్రపడఁ గూడెనేనిన్
   బాత్ర మగున్ గర్మకరుఁడు ఫలమున కెందున్."
3. అర్థ...భంగుల్ = ధనవిషయమైన యుపాయపద్ధతులు.
   ఉరవు = (గ్రామ్య.) ఔచిత్యము.
4. ఉత్సారణంబు = కదలించుట, పోఁగొట్టుట.
5. సంకల్పామర్శము = ఉద్దేశముయొక్క యొరయిక.
6. తుదముడి = దానితో సరి (అనివారుక)
7. చెడుట చావుతోఁ దుల్యము—ధననాశము ప్రాణసంకటము.
8. ఇచ్ఛానిరసనము సుఖము = 'నిరాశా పరమం సుఖమ్'.
9. తృష్ణ = ఆశ, నా.నా. దాహము.
10. కావించెదఁబో = నేసంపాదింతునే యనుకో.

(అది పోవుచుండ, నీవాఁపఁగలవా?)

11. నిండుట = తృప్తి.

రసాతల భంగి=పాతాళము వంటిది (అగాధము)

నీవు చనుపొలమునన్ = నీవు పోవుచోటున.

బచ్చెన = పూఁత, వర్ణము.

బచ్చెనరూపు పోఁకలన్ = కృత్రిమమార్గముల చేత.

12. శాంతి-శమము (కామక్రోధాదులు లేని స్థితి) అంతరింద్రియనిగ్రహము.

దాంతి=బాహ్యేంద్రియ నిగ్రహము, తపఃక్లేశము నోర్చు శక్తి.

క్షమ =ఓర్పు, సహనము.

చెందినాఁడ (చెందిన+వాఁడ) ఉన్నకలన వర్ణంబుల మీఁది తచ్ఛబ్ద వకారలోపము బహుళము.

13. (ఐహికాముష్మిక ద్వంద్వాతీతమైనది సుఖము.)

కామసుఖ...పోలలేవు-తా-ఐహికాముష్మిక సుఖవాంఛలను విడుచుట వలనఁ గలిగెడు మేలులో నీవు పదునాఱవ పాలయినను సరిరా నేరవు.

14. చచ్చినంబుట్టిన = చచ్చుటచేతఁ గలిగిన.

ఫలితార్థము—ఆశాపరిత్యాగము పరమసుఖకారణము.

---

## (9) గరుత్మంతుని చరిత్రము.

(ధర్మరాజు భీష్మునిఁ దనధర్మ సందేహము లడుగు సందర్భమున వచ్చినది.)

1. కశ్యపుఁడు—ఇతఁడు దేవదైత్యాదులకు జనకుఁడు.

బ్రహ్మమానసపుత్త్రుఁడయిన మరీచికి కళాదేవికి, జనించినవాఁడు.

పదునైదువందల యేండ్లకు కద్రువ వేయియండము లవిసినవి.

2. సవతి-సపత్నితద్భవము.

3. అనియతిన్ =యథాకాలము రాకుండఁగానే.

4. పులుఁగు = పక్షి, ఒక్కఁడు = ఒక్కటి.
పూర్వాంగము = ఊర్ధ్వకాయము.
ఉల్లము = మనసు.

5. నివ్వెఱపడి = నిండు, వెఱ(గు), పడి
అండజంబు = గ్రుడ్డునుండి పుట్టినది.

6. వినతకుఁ గలిగినశాపము.
పెంపు = పెనుచుట, వృద్ధి.
చాపలము = చాంచల్యము; (వాంఛ)
పరవుడు = దాసి; (పరవుడను = దాస్యము)

7. అలుకుచుక్ = భయపడుచు.

9. అనుజుఁడు (తమ్ముఁడు) × అగ్రజుఁడు (అన్న)
మహోగ్ర...మూర్తి = మిక్కిలి భయంకరమైన తేజ స్స్వరూపుఁడు.
తోఁచుక్ = పోఁగొట్టును.

11. సుపర్ణుఁడు=(మంచి రెక్కలు గలవాఁడు) గరుత్మంతుఁడు. పరిస్ఫుట...దివాకరుండు=ప్రకటమైనకాంతిచే పోల్పఁబడిన బాలసూర్యుఁడు గలవాఁడు. అనఁగా బాలసూర్యుని తేజస్సువంటి తేజస్సు కల వాఁడు (ఎఱ్ఱనివాఁడు) లోకనయన...కారి-కన్నులపండు వైనవాఁడు. ఈ పద్యమున, నరుఁడుని యంగసౌష్ఠవము అచ్చున గుద్దినట్లు పొడ కట్టుచున్నది.

12. అరుణుఁడు = ఇతఁడే యనూరుఁడు;
ఇతఁడు సూర్యసారథి యయ్యె.

13. తన యిచ్ఛ—స్వేచ్ఛ (తత్స)

15. చంచువు = పక్షిముక్కు.
పోలము = మత్తు, బొక్క.
తరఁగ = అల (తరంగశబ్దభవము)
పదుపు - రూ - పదువు = గుంపు (తిర్యక్సమూహము)

28. 29. వాకుకి ప్రకృతుల ధర్మగుణము.

31. అమృతకరాన్వయము = చంద్రవంశము.

గౌంతి - కుంతీ వైకృ॥

32. కద్రువ తనమాట విననికొడుకులకు శాపమిచ్చుట, శృంగిశాపముచే సర్పదష్టుఁడై చచ్చిన తనతండ్రి పరీక్షిత్తు తృప్తికై జనమేజయుఁడు సర్పయాగము చేసెను.

అదవాన...తాపమునన్ = అనుజ్ఞాగ్ని యొక్క భయంకరమైన పెను మంటలలోఁ బడుట వలనఁ బుట్టిన మహాపరితాపములో.

తక్కటి నాగములు = మిగిలినపాములు.

33. వాలధి = తోఁక.

36 పరిచారికాకృత్యము = దాసిచేయఁదగినపని.

అలంచు = బాధపెట్టు.

37. అగ్గలింపన్ = అతిశయింపఁగా.

ఉపలాలన = బుజ్జగించుట.

ఒకయప్పుడు = ఒకప్పు డనుటకు వికృతప్రయోగము.

39. సవతాలు = సవతి.

చింతపంతి - జంట మాట

43. ఎరఁగి = నమస్కరించి.

సేర్మి - సేరిమి = సేర్పు, సామర్థ్యము (గొప్ప)

44. విడ్పు-విడుపు - విడుచు ధా॥ కృదంతము. = విడిపించుట విసనల.

45. ముఱకటించుకొను = త్రిప్పుకొను.

46 కూర్తు = ప్రేమగలవాఁడవు.

47. ముదంబును నచ్చెరుపాటు = సంతోషాశ్చర్యములు.

49. విన్నులను = ఆకాశమువైపు (దిక్కు)

పాదిగొని = గుమిగూడి.

జల, వహ్ని, భట దుర్గములు మూఁడు.

50. బలియుఁడు = బలవంతుఁడు.

54. గారు = ఏనుఁగు.

55. మథుఁడు కచ్ఛపము (తాఁబేలు); కైటభుఁడు దంతి (ఏనుఁగు)

58. కంటు—కనుటు (కనుధా॥ భావార్థకము)

59. వీఁక = కడిమి.

60. వీడ్కొను, వీడుకొను—శబ్దపల్లవము = సెలవుపుచ్చుకొను

తేరక—తెచ్చుధా॥ తుమున్నర్థకము (తేక)

61. పక్షతి...ప్రజంబు = అక్కలగుంపునఁ బ్రకాశించు కాంతి సమూహము.

62. నీరికి = నీటికి - ఔపవిభక్తికము తేనిరూపము.

63. నీరువట్టు = దాహము.

64. కాళ్లల గోళ్లల—బహుత్వముపై బహుత్వము, సాము = సగము.

65. వలకాలు = కుడికాలు.

వామపాదము = ఎడమకాలు.

కచ్ఛ+పము = కచ్ఛముచేఁ ద్రావునది, తాఁబేలు.

66. ఒరలంబడక = ఒరఁగిపోఁగా

అడచిపడు = ఎగసిపడు.

67. వసంబు+ఏది = వశము తప్పి.

మేఘయుగళి ... కేళియోయనక = మేఘములజంటకలిగి యొప్పు ధాతు చిత్రములుగల కొండయొక్క ఆకాశమునందలి యాటయో యనునట్లు.

అలం—తృప్తికి.

68. పంచయోజనములనిడుపు=ఐదామడ పొడవు.

ఎరఁగు = దిగు.

70. బిట్టు = శీఘ్రము.

వల్లటిలు - పల్లటిల్లు = చలించు; వ్యత్యస్తమగు.

ఒయ్యన్ - (క్రియావిశేషణము)=తిన్నఁగా, మెల్లఁగా
విశేష్యరూ. - ఒయ్యన.
వాలఖిల్యులు - తలక్రిందుగఁ దపస్సుచేయుమునులు.
71. వైనతేయుఁడు, వినతాపత్యము = గరుడుఁడు.
76. పుళింద = ఉత్కళదేశమందలి కొండలమీఁది మ్లేచ్ఛజాతి.
77. అట గాని = అటకుఁగాని.
వ్యా॥ కాలాధ్వములకుం బ్రాయికముగ ప్రథమయగు.
చక్కటి - చక్కి = చోటు.
79. అను=త్రావు.
అమృతమునకు - వ్యా॥ నిమిత్తార్థకషష్ఠి.
81. తన్మహాత్రరజిహ్వల్ = అయగ్నియొక్క పెద్దమంటలు.
తనుకు = జ్వలించు, ప్రకాశించు.
82. కేలు మోగిచి - చేతులు మోడ్చి (నమస్కరించి)
83. ఒక వెంటన్ = ఒక విధమున.
విధీయము = విధింపఁబడినది.
నగుబాటు = పరిహాసము (పరాభవము)
అన్వెఱతోన్ = అను+వెఱతోన్ (ఉత్వలోపము)
84. అతనికి వత్సలుఁడు - అతనియెడ దయగలవాఁడనుటకు ప్రయోగ విశేషము.
క్రుగ్గఁబడున్ = అడఁగిపోవును.
85. ఆలమందలు - ఆవులమందలు.
86. ప్రాణ్సారోదారుఁడు = ఎక్కుడు మనోబలముగలవాఁడు.
అయోమయంబైన యజ్జాలంబు = ఇనుపతీఁగలతో నల్లిన ఆ వల.
రావీథి=నక్షత్రమార్గము.
88. విథూతము = ఎగురఁగొట్టఁబడినది.
కమ్రగేహఁ గెంపెసఁగన్ ॥ శా ॥ కన్నుతెల్లఁబాఱఁగా

రౌద్రంబయిన చిత్తంబుతోఁ - తా॥ మనసులో కోపమువచ్చి
అవష్టంభోగ్రుఁడు=గర్వముచే భయంకరుఁడై.

89. ఒకఁడు వేయుఁజాలక - ఏదియుఁ జేయ నేరక.
కదియు = తగ్గు.
మదమతి = గర్వముచెడి. (మదము+అతి)

93. అగడము - అవగడముయొక్క రూపాంతరము. = అకార్యము.
ఎడగలుగ - దూరముగా.

94. కర్మఠుఁడు = పనినెఱవేర్చుటకు దీక్షగలవాఁడు.
మీ నాయొడఁబాటు - మనయిద్దఱ సమ్మతి.

95. ఎలమిం గూరంగ = సంతోషపడునట్లు.

96. నూరెల = ప్రక్కలను.

97. గుజ్జువాలము = మిశ్రమసమాసము.

100. అభినందించిరి = కొనియాడిరి.
ఆమంత్రితులఁ జేసి = (సంబోధించి) సెలవుగైకొని.

101. గరుత్మంతుని చరిత్రములోని ముఖ్యాంశములు.
శ్లాఘింపఁగ = కొనియాడుచుండఁగా.
మగిడి = మరలి. మగుడు ధా॥ క్త్వా॥
వ్యా॥ ఇ, ఎ-పరమైనపుడు ఉపాంత్యమయిన ఉకారమునకు ఇత్వము.

(ఇందు గ్రహింపఁబడిన గరుడుని సౌశీల్యములు—

(1) దేవాంశము—బ్రహ్మచేఁ బెరుఁగుట.
(2) మాతృభక్తి—దాస్యమునుండి విడిపించుట.
(3) దేహబలము—గజకచ్ఛపములను పంచయోజనాయతవృక్షశాఖను మోయుట.
(4) విజయకార్యదీక్ష—జలాయుధ దుర్గముల భేదించుట.
(5) ధర్మపరాయణత—అమృతకలశమును మరల నింద్రున కిచ్చుట.
(6) ఉపాయజ్ఞత—అగ్నిజ్వాలలను మన్నుముద్దలు వేసి చల్లార్చుట.

## (10) సత్యభామ చేసిన యుద్ధము.

(లోకకంటకుఁడయిన నరకాసురుని జయింప శ్రీకృష్ణుఁడు వెడలి నప్పుడు సత్యభామ తోడంబోయి తన ధనుర్విద్యా వైశద్యము భర్తకుఁ జూప యుద్ధము చేసెను. రాజకన్యకలును ధనుర్విద్య నభ్యసించుట పూర్వాచారము.)

1. ధరాసుతుండు - వరాహావతారమున భూదేవియందుఁ గలిగినవాఁడు, నరకాసురుఁడు, లోకకంటకుఁడు. గరుత్మంతుని మూఁపు మీఁద సత్యభామతోడి కృష్ణుఁడు చంద్రబింబముపైని మెఱుముతో నొప్పు మేఘము పోల్పఁబడెను.

కనన్నిమంగుళ్ = కనత్ + నిమంగుళ్ = ప్రకాశించుచున్న యమ్మలపొది గలవానిని.

కుహనాచంగుళ్ = మాయలచేఁ బ్రసిద్ధుని = మాయలమారిని.

రణాభంగుళ్ = యుద్ధమున నోటమిలేని వానిని. (శ్రీకృష్ణుని)

అలం—అంత్యనియమము.

2 గమకింపక్ = సిద్ధపడఁగా.

తమకింపక = తొందరపడక.

3. చొల్లెము = చుట్టు.

నీవి = పోఁకముడి.

పయ్యెద-పై+ఎద. పైటచెంగు.

తుఱిమి = ముడిచి.

4. యదురాజన్య శ్రేష్ఠుఁడు = యదువంశపు రాజులలో మేటి.

యాదవులు—యదు వృష్ణిభోజాంధకు లని నాలుగు తెగలవారు.

అలం-యమకము.

6. అలం-యమకము.

లేమా = తరుణీ!

లేము+ఆ? = అసమర్థుల మా?

తే+మాను - లెమ్ము - ఘూనము = తొల్లగుము, పొరుడుగుము.

తే+మావిల్లు = సిద్ధపడుము + నా చేతిలోని విల్లు.

7. అలం-అంత్యప్రాసము.

బాణాసనము-వృ-బాణములు చిమ్మునది, విల్లు.

తా. దేవతలను సంతోషపెట్టునది, రక్కసుల భయపెట్టునది, శత్రువుల గర్వమడఁచునది.

8. తదగణ్య...ప్రతాపమునన్ = ఆ వింటియొక్క యపరిమితమైన మహా తేజస్సువలనఁబుట్టిన శౌర్యముచేత.

స+గుణము=వారితోఁ గూడునట్లు.

నిర్+గుణము = త్రాళ్లు తెగునట్లు (వాడుక)

అనఁగా, విధవాత్వము వచ్చునట్లు.

9. నారి-తెలుఁగున:-వింటిత్రాడు.

తత్సమమున.— స్త్రీ).

రింఖణ = జాఱుట

బల+సంపన్న+అరి+ఇభ+ఆదికము = బలవంతులయిన శత్రువులయేనుఁగులు మొన్నగునవి.

10. సత్యభామ తనూవిలాసము యుద్ధపరికరములతోడి సమ్మేళనమున వీరశృంగారాది రసములు మూర్తిభవించినట్లు శోభించినది.

తొడుగుట, తిగుచుట, ఏయుట, గొబ్బుఁన రాకుండనగుట శరలాఘవ సూచకము.

11. వీరశృంగార సమ్మేళనముఁ జిత్రించు తీరి పద్యము.

12. ప్రత్యాలీఢము—విలుకాఁడు ముందటికి ఎడమకాలుచాఁచి నిలుచుట.

విలుకాఁడు యుద్ధకాలమున నిలుచు విధము లైదు.

1. ప్రత్యాలీఢము.

2. ఆలీఢము-కుడికాలుముందటికి చాఁచి నిలుచుట.

3. సమపదము-రెండుకాళ్లతో సమముగ నిలుచుట.

4. విశాఖము-రెండుకాళ్ళనడుమ జేనెఁడెడము గలుగ నిలుచుట.

5. మండలము-రెండుకాళ్లు గుండ్రముగఁబెట్టి నిలుచుట.

అలిక......లతోఁ=నుదుటిచెమటలో నంటినముంగురులతో.

ఆకర్ణ...దీధితులతోఁ = చెవులవఱకును లాగఁబడిన నారియొక్కయు గోటికొనలయొక్కయు కాంతులతో.

లక్ష్యావలోకంబుతోఁ=గురిచూచుటతో.

వలయా...రాతియై=చుట్టుదిరుగు వింటినుండి వెలువడు బాణసమూహముచేఁ గొట్టఁబడిన శత్రువులుకలదై.

(సత్యయొక్క ధనుర్విద్యాపాటవ మిందు వ్యక్తమవు చున్నది)

13. కన్యకా సిద్ధక్రీడలను యుద్ధ ప్రసిద్ధకృత్యములతోడ వ్యత్యస్తముగా వర్ణించుట.

14. చారు+సత్య+భా+మా=ఒప్పిదమైన సత్యము, కాంతి, సంపద కలది (బహువ్రీహి)

15. సత్యయుద్ధము వర్షకాలముతోఁ బోల్పఁబడినది. ధనుష్టంకారము ఉఱుము, దేవతలు చాతకములు, విల్లు ఇంద్రధనుస్సు, కృష్ణుఁడు మేఘము, సత్య మెఱుపు, బాణములు వర్షధారలు, రాక్షసగణము దావాగ్ని.

16. ఇందు, యథాసంఖ్యాలంకారము.

కేతువు = జెండా;

ధూమకేతువు = తోఁకచుక్క.

పరిధి = పరివేషము, వృత్తము (circle) యొక్క సీమను సూచించు గోళాకార రేఖ (circumference)

18. దానవానీకంబుల్-విచ్చెన్.

అనీకము (సేన) బహుం॥ కర్త గనుక, క్రియ ఏకవచనము.

19. అంత్య ప్రాసము.

మధుం...సారి=తీయనిమాటల నమృతముఁజిలుకువాఁడు.

తదీయ...వారి = ఆమె యొక్క ప్రయత్న[illegible]వాఁడు.

20. యమకము.

దానవనాథుని కొమ్మ ఆహవమునకుఁ దొలఁగెఁ = రాక్షసనేపథ్యమువారు యుద్ధమునకు విముఖులైరి.

తై కొమ్మ-రూ॥ తైకొమమా. కొమ్మ+ఆభరణములు

21. అంత్యప్రాసము-

కళావతి - విలాసములు, విద్యలు కల దని సాభిప్రాయవిశేషణము.

## 11. నృగ చరిత్ర.

[శుకయోగి పరీక్షిన్మహారాజునకుఁ జెప్పినది. నృగుఁడు సూర్య వంశ్యుఁడు. ఇక్ష్వాకుతనయుఁడు. పుణ్యశాలి. అయినను, తెలియక దానము చేసియుండిన గోవును మరల దాన మిచ్చుటచే నూసరవెల్లి యయ్యెను. బ్రహ్మస్వ మజ్ఞానమున నైన నపహరింప రాదనునీతి యిందుఁ దెలుపఁబడినది.]

1. పిపాస = త్రావనిచ్ఛ.

ఊసరవెల్లి = తొండ ముదిరినది.

ఇట్టి, నక్క ముదిరి పండగు.

. శోకము = త్రాసం.

3. కృకలాసము = తొండ

4. తెలియఁగొంకక - తెలియుట కొఱకు (ట లోపము)

5. ఊసరవెల్లి తనము - త్వప్రత్యయార్థకము తనవర్ణకము.

6. నిటలఘటితాంజలి యై-నుదుటఁ గూర్పఁబడిన దోయిలిగలవాఁడయి.

8. చతురంత భూధరణ సామర్థ్యము-నాలుగు చెఱఁగుల నేలయేలు శక్తి.

9. ఆత్మస్తుతి పాపహేతువు.

అలం - అతిశయోక్తి.

11. సువర్ణ శృంగఖురములు = బంగారు కొమ్ములు, గొరిజలు

13. పంచమహా యజ్ఞములు:—

'పాఠో హోమ శ్చాతిథీనాం సపర్యా తర్పణం బలిః,
ఏతే పంచమహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః.'

14. ధార - జలధార, దానము ధారాపూర్వకముగఁ జేయఁబడును.
వాడుకలో "నీళ్లువదలినాఁడు"

15. మొదవు = ఆవు.

18. గోధనము = గోవు లనుసొమ్ము. పూర్వము గోధనమె ధనము. ఇప్పటికిని తూర్పున పశువులను సొమ్ములనియె వాడుచున్నారు.

21. కింకరులు - కింకర వ్యు॥ ఏమిచేయుదునని యడుగువాఁడు, సేవకుఁడు.

22. పాపపుణ్యములలో రెంటిని పాటిది యనుభవింపవలెనని శాస్త్రము.

23. అనుభావ్యము = అనుభవింపఁదగినది.
దురితనిస్తారకము=పాపమును పోఁగొట్టునది.

24. సామాన్యముగ నందఱు పఠించు పద్యము.

25. పదంబులు...బ్రణమిల్లి = పాదాక్రాంతుఁడై.
విమానము = ఆకాశసంచారము గలది.

## 12. లంకాదహనము.

[సీతాన్వేషణార్థము పోవని లంకకేఁగి రావణుంగని బుద్ధిగఱపఁదలఁచి యశోకవని విఱువఁగా రక్కసులు రావణునెదుటికిఁ గొంపోవ నతఁడలిగి తోఁకగాలుపుఁడన, వాలాగ్నిలో లంకను దహించి మాచి రమ్మన్నఁగాల్చి వచ్చెనను సామెత పుట్టించెను. ఇందు హనుమంతుని బల సాహస ధైర్యశౌర్యములు గా పట్టుచున్నవి.]

2. అబ్జగర్భుఁడు వలఁతియై యిచ్చినవరము.

Allusion:—హనుమంతుఁడు పుట్టఁగానే సూర్యబింబమును పండని

బ్రమింగఁ బోవ, ఆవేఁడిమికి మూర్ఛచెందెను. తండ్రి వాయుదేవుఁడు కోపించి స్తంభించెను. అందుచే లోకము లాకులపడెను. అపుడు, బ్రహ్మాదులు నీకుమారుని బ్రతికించి వరము లిత్తుము, లోకవ్యవహారము నడుపుమని వాయుదేవుని వేఁడుకొనిరి. అప్రుడు బ్రహ్మ యితనికి బ్రహ్మదండ బ్రహ్మాస్త్రములవలన హానికలుగకయుండ వరమును గ్రహించెను.

4. అగుటయుఁగా:—అగుచలుకు, కాఁగా.

వ్యా॥ భావార్థకముపై యుభయర్థక సముచ్చయము అనంతర్యార్థకము.

10. వ్రీడా, విషాదములు = సిగ్గు వగపులు.

11. రావణుని రూపమునందు మేఘధర్మము నిరూపింపఁబడినది.

అలం. ఉపమ.

సౌదామని = మెఱుపుతీవ.

బలాకాళి = కొంగుడుపిట్టలగుంపు.

12. పటు ... బాహాగ్రుఁడు = మిక్కిలి ప్రకాశించు పదితలల చేతను, రత్నములతో దేదీప్యమానములయిన బాహువుల చేతను భయము కలుగఁ జేయువాఁడు.

కుటిల...కుశేశుఁడుఁడు = వక్రము లయిన కనుబొమ్మలనెడు పెద్ద తాగచే తీక్ష్ణమైన, ఘోరమైన మిఱుఁగుఱులచే విస్తరిల్లిన కోపాగ్ని జ్వాలలచే వ్యాప్తమైన చూపులు కలవాఁడు.

ప్రోద్దష్ట...వక్త్రుఁడు — గట్టిగా కఱవఁబడిన వ్రేలాడు పెదవుల వయిఁ జూపట్టు దంతములచే భయంకరమైన ముఖము గలవాఁడు.

13. హాటక...జాటుఁడు.—బంగరు కొండకొనవలె నొప్పెడి సిగముడి గలవాఁడు.

కోటులు = స్త్రీలు.

లోకవిద్రావణుని = లోకభయంకరుని

17. ప్రహస్తుఁడు = రావణుని సేనాని.

ఇందు, ప్రభువులు మంత్రులచేతనే యడిగించి గౌరవము నిలుపుకొనువా రని తెలియ నగును.

12. తపన ప్రియనందనునకు సచివుఁడగు—సూర్యపుత్త్రుఁడైన సుగ్రీవుని మంత్రిని.

27. బలీముఖ—బలిముఖ = వానర-

28. ధూర్జటిపిలు—శివధనుస్సు.

రాముఁడు సీతావివాహార్థము శివధనుర్భంగము గావించెను.

రావణుఁడు త్రిలోకజయార్థమై పోయి కైలాస మెత్తినపుడు, శివుఁడు తన బొట్టనవ్రేలితో నదిమెను.

(వాలి సముద్రతీరమునఁ దపస్సు చేయుచుండ, వెనుకాటునఁబోయి రావణుఁడు పట్టుకొన నరఁడట్టే రావణుంబట్టి సప్తసముద్రములలో ముంచి విడిచెను.

(హోమధేనువునకై పోరఁజొచ్చిన కార్తవీర్యార్జునుని పరశురాముఁడు చంపెను.)

29. ఖరులు=ప్రశ్నలు.

30. సౌమిత్రి ... బాణములు = లక్ష్మణుని భుజమందలి యమ్ముల పొది నుండి వెలువడు రత్నపుమొనలు గల యసంఖ్యము లయి పుట్టుచున్న మిణుఁగురుల గుంపుచే పెచ్చు పెరుఁగు మంటలుగల బాణములు.

33. మతకరి = మతకము + అరి = మాయలమారి. అరి - మత్వర్థకము.

35. జనకకన్య - తద్ధి - జానకి.

నీకంఠార్పితకాలపాశము—ఏకదేశాన్వయము.

నీమెడకుఁదగిలించిన యమపాశము వంటిది.

శిరోనిర్ఘాతపాతము = నెత్తి పై పిడుగుపడుట.

లంకాకస్సంచయకాళరాత్రి — లంకావాసులయినరక్కసులకు మారక శక్తి.

గళ......కాలాహి = మెడం దగులుకొన్న నల్లత్రాచు. కన్యా +
ఆకార×అగత+మృత్యువు = స్త్రీరూపమున వచ్చిన మృత్యుదేవత.

37. కుటిల...ఘోరాస్యుఁడై
= వక్రములయిన కనుబొమలచే భయంకరమైన పది మొగములును, అందలి పెద్ద ముక్కులును, వ్రేలాడు పెదవులును, చెక్కిలి పైభాగములును, కదలుచున్న పెద్ద కోఁరలును, గలుగుటచే క్రూరమైన మొగము గలవాఁడయి.

38. నీకోపమునకుఁ దగఁ డితఁడు అష్టదిక్పాలకులలో నెవ్వఁ డితఁడు?

39. దూతకు విధింపఁబడిన శిక్షలు.
1 కొరడాదెబ్బలు 2. తల గొఱుగుట 3. అవయవములలో నేదో యొకటి నఱకుట.

43. కార్పాసపట్టిక = గుడ్డపేలిక

44. చూఁడుచుఁ = దహించుచు.

45. గరుద్వేదిదిన మేను మేఘమువలెను, జ్వాలాజాలము గలవాలము మెఱుపువలెను ఉండెనని.

51. సీత యగ్నిం బ్రార్థించుట.

52. ప్రాలేయనగము = మంచుకొండ.

47. తోరణము = పురద్వారము.
పరిఘము = గద (పరిఖ = అగడ్త)

## 18. విభీషణు విషాదము.

[రావణుఁడు యుద్ధభూమిం బడి పడియుండ, సోదరప్రేమచే విభీషణునకుఁ గల్గినవిషాదము. రావణుని గుణదోషము లుగ్గడింపఁబడినవి.]

1. సైఁపక - ఓర్పుమున్ సహింపక.

2. మున్ను మహాయుద్ధములలో భుజాబలము గనఁబఱచిన నీవు నేఁడు

చేతులు తెగఁ గొట్టఁబడి నేలఁగూలితివా ?

3. దేవలక్ష్మి కొప్పపట్టి యీడ్చునవి, యుద్ధములలో వానినవి, వెండి కొండ నెత్తినవి, దిగ్గజములదంతముల నూడఁ బెఱుకునవి, -ఇట్టివి చేతులు.

11. సూర్యుఁడు నేలఁబడెను, చంద్రుఁడు చీఁకటిలో మునిఁగెను; అగ్ని చల్లఁబడెను, మేరువు ఒరఁగి పోయెను.

12. రూపకాలంకారము—

బలమైన మూఁపులను ప్రాను, కలది; శౌర్యమను వేళ్లుకలది; భుజములను కొమ్మలు కలది; అనివార్యమైన ధైర్యమను చిగుళ్లు కలది; పెచ్చు పెరుఁగు కోపమను పువ్వులు కలది; పాపకార్యము లను ఫలములు కలది; యగు రావణుఁడను చెట్టును రాముఁ డను గజము విఱిచెను.

13. కర...దుర్జయము=చేదోయి యను దంతములచే జయింప రానిది; గర్వమనుమదముచే కన్ను గాననిది; ఘోర...క్రమము=క్రూరచాపధరులగువారి చేతులకు పట్టరానిస్థితికలది(గజరాజు);(క్రూరములయిన విండ్లను ధరించిన చేతులయొక్క సహింపరాని విధముకలవాఁడు-రావణుఁడు).

పద్మజ వంశసముద్భవంబు=బ్రహ్మవంశమునఁ బుట్టినవాఁడు (రావణుఁడు); శ్రేష్ఠమయిన జాతిలోఁ బుట్టినది (ఏనుఁగు);

నిర్జర......తరంబు—దేవత లనెడు చెట్లగుంపును విఱుచుటచే గొప్పది.

దైత్యరాజ సింధురపతి=రావణుఁ డనెడి యేనుఁగు. బాణదంష్ట్రమై= బాణములను దంతములుకలదియై.

14. సాంద్ర పరాక్రమ మను మంట, ఊపిరి యను పొగ, సాహసమను కట్టెలు, ప్రతాపమను ప్రతాపము, కల, రావణుఁ డనెడి యగ్నిని రాముఁడను మేఘము చల్లార్చెను.

## 14. బలరామ వ్రజగమనము.

[జరాసంధు నోర్చిన వెనుక, బలరాముఁడు కృష్ణానుమతిని వ్రేపల్లె కుఁ బోవుట. ఎంకటివారికిని జన్మస్థానము మీఁది ప్రేమయుండి తీఱును.]

1. కడలుకొనన్ = అతిశయింపఁగా.
   ఆలోకము = ఆలోకనము = చూచుట.

2. వ్రే = గొల్ల, స్త్రీ॥ వ్రేత పుం॥ వ్రేఁడు.

4. తీపారెడు చూడ్కి (తీపు×అరు) = మనోజ్ఞమగు చూపు అ+పోవని = తృప్తి తీఱని. (అదట + పోవని)

6. స్వాగతమే = సుఖమైన రాక గదా? (సుఖముగ వచ్చితిరా?)

7. దేశభక్తిని వెల్లడించు పద్యము.

8. రామకృష్ణులు చేసిన వీరకృత్యములు.

10. బలరాముని వినయము, కృతజ్ఞత.

11. మాకిచ్చటి పిన్నవాఁటి పనులు మఱపురాకయుండుటచే, రాజ్యలక్ష్మి మీఁద సహితము మాకంత మనసు పోవుట లేదు.
   రామి—వచ్చు ధా॥ వ్యతి॥ భావార్థకము, క్రియా విశేష్యము.
   రామిన్-తృతీయార్థమున ద్వితీయ.

12. అంత్యప్రాసము.
   వివిక్తము = విజనము, రహస్యస్థలము.

13. గోర = గిన్నె
   శిఖువు = తెల్లపుఁగల్లు.
   ఉగ్గడువు = మిక్కిలి యధికము.
   ఘూర్ణనమందన్ = తిరుగుడు పడఁగా.

14. ఉల్లేఖాలంకారము.
   బలరాముఁడు తెల్లనివాఁ డనుటకు సురదంతి మొదలయిన సామ్య వస్తువులు చెప్పఁబడినవి.

చందనవృక్షములు దక్షిణదిక్కున నున్న మలయ పర్వతమున నుండు నని, వానిని జుట్టుకొని పాము లుండు నని, పురాణము.

---

## 15. స్కంద కృష్ణుల యుద్ధము.

[ఉషాకన్య నిమిత్త మనిరుద్ధుఁడు నిరుద్ధుఁడు కాఁగా నతనిం దెచ్చుటకు శ్రీకృష్ణాదులు బాణాసురునిపై దండెత్తినప్పుడు బాణపక్షమున వచ్చిన స్కందునితో శ్రీకృష్ణునకు యుద్ధము తటస్థించినది. ఈశ్వర తేజము కూడ విష్ణు తేజమునకు లోఁగినది. రాక్షసపక్షపాతి యీశ్వరుఁడు; దేవతా పక్షపాతి విష్ణుఁడు.]

1. కార్తికేయుఁడు=షట్ కృత్తికల పెనుపు కలవాఁడు.
ఈశ్వరపుత్త్రుఁడు—ఇతఁడే కుమారస్వామి, స్కందుఁడు.
ఈశ్వర తేజము గౌరి ధరింప లేక, యగ్నిలోఁ నెలకొల్ప, నతఁడును గెల్లునం బెట్టఁగాఁ దీని షట్కృత్తికలు పెనిచి రని పురాణకథ.
కానీ = కానిమ్ము. ఓడుతుక్ = ఓడింతును. అని = యుద్ధము.
3. వాలు × అమ్ము = వాలురంప, (రుగాగమవిశేషము) చేఁత - చేయు ధా. కృదంతము.
సమవధానము = సమాధానము.
4. ముగ్గురు మూఁడగ్గు లట్లని పోలిక.
5. ఏర్చు=దహించు.
సమస్త—సాధనంబు = ఎల్లపగతుర మథించునుత్సాహము గలయా యుధము.
6. క్లీబత = నపుంసకత్వము.
కుమారస్వామి కాలు మొగములు.
౯. ఉల్క = నిప్పురునుక.
తక్కిరి = విడిచిరి.

9. శక్తి = బలము. శక్తి = ఒకానొకదేవత.

11. పనుపు = ఆజ్ఞ

దీధితి = కాంతి.

దిగ్వాస=దిగంబర॥ (బట్టలేనిది)

## 16. పాతివ్రత్య మాహాత్మ్యము.

[కౌశికునిభార్య తన పతి కుష్ఠరోగి యని యనాదరింపక యాతని పరిచర్యయే యధికపుణ్యఫల మని యాతని కోరికలు దీర్చుచుండి తన పాతివ్రత్యముచే సూర్యోదయము కాకుండఁ జేసినది.]

1. ప్రతిష్ఠానపురమునకు సముద్రము పోలిక చెప్పఁబడ్డది.

3. అంగుళి = వ్రేలు

వ్రస్సి = విడిపోయి. వ్రయ్యుధాతువు.

రుజ = రోగము.

4. అలందురు=వాగచు.

6. కింకిరిపడక = అసహ్యపడక.

ఆవశ = విధేయురాలు.

9. చెన్ను = సొగసు.

10. తివుట = కోరిక. తివురుధా.

11. ఉగ్మలి = స్త్రీ. నెఱకులు = ఆయువుపట్లు.

12. అగ్గలింపక = హెచ్చుగా, వల్వ = బట్ట.

13. చీఁకటి × చీఁకటి = చిమ్మచీఁకటి.

14. క్రేవ = ప్రక్క.

15. మ్రుచ్చు = దొంగ.

16. కాత = అతిరథకము

17. తుదను లోకోక్తి ననుసంధించె.

18. త్రియామ=రాత్రి పగటిలో పూర్వాపరములందొక జాముకలియుట. చేనిక నిద్రావస్థ కేర్పడినది మూఁడుజాములె యైనది. త్రియామ బహుయామయయ్యెననుటలో రాత్రియెంతకుం దెల్లవాఱలేదని భావము.

21. అహః+పతి=సూర్యుఁడు.

22. అధఃకరింపన్ =నిరసించుటకు.

24. భావింతు+ఎ=భావింతువేయని.

26. సహిష్ణుఁడు=ఓర్పువాఁడు.

27. తంగేటిజున్ను=సులభ సాధ్యము.

29. భర్తృభక్తినియతాత్మకఁగన్ =పతిభక్తి మనసునఁగలుచునట్టి దానిగా.

32. కఁదియుటఁజేసి=కూడుటచేత.

తలఁకి=జడిసి.

33. కారణవాల.

34. చాన్ =చావన్ రూపాంతరము.

37. గనుకని=మిక్కిలి, తీటుకొల్పె=నిండించి.

అర్ఘ్యము=సూర్యునికిచ్చు జలాంజలి.

39. పొడవిపట్టెన్ =పండిటఁబట్టెను.

44. మనము చెయ్యు పలుకు-త్రికరణములు(తలఁచుట చేయుట చెప్పుట.) కావుతన్ +అని-కావుతమని (ముగాగమము)

5. ఉత్థితుండు=లేచినవాఁడు.

అగురున్ =అగురుధాతు, అనంతిర్యము.

## 17. నృసింహపురాణములో హిరణ్యకశిపు పెట్టుబాధలు.

(అధికతపంబొనర్చి హిరణ్యకశిపుండు బ్రహ్మ చేవరములందిన గర్వమున నమరులను బెట్టుబాధించుచున్నాఁడు. అతని క్రూరత, బలవిక్రమాదులిందు ల్లడికాఁగలవు.)

1. ఉపమాలంకారము.

సింహికాప్రథమపుత్రంగిక్ = రాహువువలె.

గోత్రగోత్రశృంగంబులు = కులపర్వతములయేడింటియొక్క శిఖరములు.

దంభోళి = వజ్రాయుధము.

బలాహకము = మేఘము.

దుర్విషహుండు = సహింపరానివాఁడు.

2. లాయంబు = గుఱ్ఱపుసాల.

కవణమెత్తు = గుఱ్ఱములకు మేఁతవేయు.

3. స్వాహా = హోమముచేయుటయం దుపయోగించు పదము.

4. అగమక్రియ = యాగకార్యము.

5. భానుప్రభృతులను వశపర్చుకొనుట.

6. శీతగ్రీష్మవర్ష కాలములుమూఁడు.

ధర్మార్థకామ మోక్షములు నాలుగు.

8. మరుత్పతి = దేవప్రభుఁడు.

10. వ్రేఁగు = భారము.

11. దాయ = శత్రువు. చెనసి = చేరి

ఉపాయములు. నాలుగు; సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయములు షడ్గుణములు; త్రివర్గము = స్థితివృద్ధిక్షయములు.

12. స్థానము = స్థితి.

13. సప్తాంగములు.

14. కామక్రోధలోభమోహమదమత్సరము లారు మనశ్శత్రులు.

ఈమైక్ = ఈవిధముగా.

వ్రేల్మిడిక్ = అహుతిగా.

15. అజితాత్ముఁడు = జయింపరానిమనసుగలవాఁడు.

శరత్ = ఆశ్వయుజకార్తికమాసములు.

16. విధవాంధీభూతచేతస్కుఁడై = ధనముచేఁ గన్ను గానని మనస్సుగలవాఁడై.

17. ఎవరి నెదిరింప జయ మగు?
ఎవరిసిరి తొలఁగును?

19. చరము = జంగమము. అచరము = స్థావరము.

## 18 అష్టాదశపురాణరహస్యములు.

(బ్రహ్మోత్తరఖండములో నష్టాదశపురాణములలోను చెప్పంబడినముఖ్యధర్మములని యుదాహరించిన విందు పొందుపఱుపఁబడినవి) ఇవి ప్రచారంబునఁ బెట్టినవారు కృతార్థులని ఫలితము.

1. హేళనము = వేళాకోళము. మృష = అబద్ధము.
2. సదాచారము = పూర్వాచారము.
3. కార్యములన్ . ద్వితీయ - సప్తమ్యర్థము.
అలసవృత్తి = చులకనగఁజూచుట.
4. ఆక్రోశవృత్తి= ఏడ్పు, పిశున=తద్ధి-పైశున్య.
5. విషయాసక్తి - శబ్దస్పర్శరూపరసగంధములం దాదరము.
· సాధు+అనూయ యణాదేశసంధి.
6. "అతి సర్వత్ర వర్జయేత్" అనుట కిది.
7. శ్వశుర = పిల్ల నిచ్చినమామ.
8. కృపణున్=లోభిని. తపనీయము = బంగారము.
9. పాత్రము = మిత్రాదిగణములోనిది.
11. హాటకంబు = బంగారము.
13. కర్మాయత్తములు ఆయుర్బలాదులు.
14. మితహితవచనా! (మాటయెప్పుడును పరిమితముగాను, వినసొంపుగాను, ఉండవలెను.)

16. ఎట్టిమాట పలుకవలెను?

18. బాహ్యాగేహసుషుప్తి = ఇంటికైటఁబరుంట.

19. కులట = అంకులాఁడి. అలిక+అక్షి=నిటలాక్షుఁడు.=శివుఁడు.

22 భక్ష్య = పిండివంటలు, భోజ్య = అన్నాదులు.
లేహ్య = పచ్చళ్లు. భోజనమైదు విధములు.
వైవూఁడుగాక చోష్య-ఊరుఁగాయలు.పానీయ (చారుప్రభృతులు).
అలంకారములునాలుగు. వస్త్ర, పుష్ప, గంధ, భూషణములు.

23. బ్రాహ్మిముహూర్తము = తెల్లవాఱకమునుపు నాల్గుగడియలు.
రుద్రస్యభార్యా = రుద్రాణీ = పార్వతి.

26. పంచాక్షరి (నమశ్శివాయ) శైవులకు పంచాక్షరీజపము, రుద్రాక్షధారణము, విభూతి, విభూతిస్నానము, లింగధారణము, అర్చనము, బిల్వము, సోమవారవ్రతము అనునీయెనిమిది ముఖ్యములు. భసితత్రిపుండ్రము=నుదుటవిభూతిరేఖలుమూఁడు. భూతేశులోకము=కైలాసము. ఇదే వెండికొండయనికొందఱు.

27. వత్సా! ప్రేమసూచకపదము. సంక్షేపరూపంబునన్ = క్లుప్తముగా.

## 19 శ్రద్ధాభక్తులనుగూర్చి.

(శబరుఁడు శివపూజను శ్రద్ధతోఁజేయుచుండ నొకప్పుడు చితాభస్మము దొరకక వగచు భర్తనోదార్చి శబరి తాను భస్మమై భక్తిఁజూపినది శివప్రసాదమున నిద్దఱును ముక్తులైరి.)

1. శ్రద్ధ+ఏ. నిశ్చయార్థకము.
సుపర్వుల్ = దేవతలు.

2 నిఃశ్రేయసపదప్రాప్తి = మోక్షస్థానములభించుట. ఇందలి విసర్గము ఉపధ్మానీయము.
వంధ్య = గొడ్డుది.

3. ఉపదేశమునకన్న=కన్న కంటెకుమ. ఇందునాగమము. ప్రయోగ విశేషము. ఇతిహాసము. పూర్వకథ.

4. సరస్వత్కాంచీస్థలిన్ = సముద్రములు మొలనూలుగాఁగల భూతలము నందు. పంచాశత్ + విషయంబులు = ఏఁబదియగుదేశములు; దీనికే ఛప్పన్న దేశములనివాడుక.

5. హనుమత్కేతుఁడు = అర్జునుఁడు.
మారుతాశనరాట్కేతుఁడు = కుమారస్వామి.
సర్పారికేతుఁడు = విష్ణువు.
సింహకేతుఁడు = రాజుపేరు.

6 అంత్యప్రాస.

8. మృగయ = వేఁట, అభికాంక్ష - అభి ఉపసర్గ.

9. వేద+అండ = వేదండ = ఏనుఁగు; శకంధ్వాదిగణము.
పుండరీక = పెద్దపులి.
స్ఫుటితంబు = చెడినది.
దైవనియోగంబునన్ = కర్మప్రేరణమున.

10. ఉపచారములు.

11. చితాభస్మము=కాటిబూది. (చితా రూ. చితి.)

14. విషణ్ణ = విచారగ్రస్తమయిన-వ్యతి-ప్రసన్న.

15. నతపదనుండై=తలవంచుకొన్నవాఁడై.

18. ఉపహారము = కానుక. అంతరాయము=విఘ్నము.

19. తనమేను. నామేనని.

21. వాక్పతి = బ్రహ్మ; నలుమోములవాఁడని విశేషము. మఱిమాటల నేర్పరియనియు.

23. హరిద్రాంజన = పసపు, కాటుక.

24. ఇంద్రియములు పూవులు, దేహము గంధధూపము, చిత్తము దీపము, ప్రాణములు హోమపదార్థములు, కరణంబులు అక్షతలు. ఇట్లు జీవితశివ పూజచేసెను.

25. శివభక్తికన్న స్వర్గాదు లెక్కు_ఐవి కావనిభావము. నీపాదముల=నీపాద ములతోడు. ఇదిప్రమాణము.

27. కుటీర+ఉపాంతమునక = గుడిదెవద్ద.

28. అగ్ని తేఁడిమిచేతను,రవి కిరణములచేతను, రాజు శిక్ష చేతను,శివ్రుడు మనకు చేతను దహింతు రని శాస్త్రము.

29. నిద్రపోయి మేల్కొనినట్లుయునది.

32. ద్యు=దివి. వి+మానము = ఆకాశగమనమునకలది. పుష్పకము=విమాన భేదము. పారిషదులు=శివపార్శ్వచరులు.

34, విజ్ఞులు = విశేషజ్ఞులు. ప్రాజ్ఞులు, కలరు+ఏ. కారుపు. లేరనిభావము. భక్తియే ముఖ్యము.

## 20 జయధ్వజునివిష్ణుభక్తి.

[తామసదేవతారాధనకంటె సాత్త్వికదేవతాపూజాదికము మేలని ఋషుల ప్రవచనము. కులాచారమైన శివారాధన మాని విష్ణుభక్తుఁడైన ప్రహ్లాదునివంటివాఁడీజయధ్వజుఁడు.]

2. సత్కృతులు = మంచి పనులు చేయువారు.

4. తం్రడియాచారము కొడుకున కుండవలెనని వాదము.

5. „నావిష్ణుః పృథివీపతిః,” అనున్యాయ మిచట.

అర్హ్యుఁడు=అర్చనార్హుఁడు.

6. మూఁడుగుణములు మూఁడు మూర్తులు మూఁడుపనులు. మఖధారకుఁడు= యాగ (గతమునిది) పాలకుఁడు. జని=పుట్టుక.

7. పాలనమునకు సాత్త్వికమె ప్రధానము.

అతిమనస్వి=ఎక్కువబుద్ధిమంతుఁడు.

8. సంహారకృత్తు. పాలంతములకు ద్విత్వోత్వము ప్రాతిపదికము. శివుఁడు భక్తులయజ్ఞానసంహారిసుమీ.

9. ముముక్షువు=మోక్షేచ్ఛగలవాఁడు.
శివుఁడె వృద్ధిక్షయములకు హేతువు.

10. మోక్షము=విడివడుట., వ్యతి-బంధము-కట్టుపడుట.

11. వివాద-వివాదము-ములోపప్రయోగము.

13. సంరంభంబు=తొందర-సప్తమహర్షులు వసిష్ఠాదులు.
శిష్టఫణితిఁ = పెద్దలయాచారమునుబట్టి.

14. అగ్ని+ఇన సవర్ణదీర్ఘసంధి
విధి=బ్రహ్మ-నానా-కర్మము
అజ=బ్రహ్మ. విష్ణు+ఈశ=యణాదేశసంధి.
వైఖానసులు=విఖనసునివంశస్థులు (సంబులు)

15. కూశ్మాండ=భూతభేదము.

16. కంటక=ముల్లు (బాధించునది)
అరి - బహు - అరులు - ఉత్వలోపము అరుల్=శత్రులు.



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 5 | ప్రధానము | ప్రధానత |
| | 25 | మహాత్వ | మహాత్త్వ |
| 7 | 22 | స్వధర్మ | సధర్మ |
| 9 | 1 | సిద్దుఁడు | సిద్ధుఁడు |
| 11 | 14 | నిర్వ్యచనమ | నిర్వ్యచనము |
| 15 | 5 | మహాత్మశ్రీ | మాహాత్మ్యశ్రీ |
| | 22 | బ్రహ్మాండ | బ్రహ్మాండ |
| 17 | 8 | ధర్మము | ధర్మము |
| 18 | 19 | కీర్తన | కీర్తన |
| 19 | 24 | మారము | మార్గము |
| 21 | 10 | వ్రాథమి | ప్రాథమి |
| | 19 | స్వార్ద | స్వార్థ |
| 28 | 9 | వెంకట | వేంకట |
| 30 | 14 | మింతిక | మింకకు |
| 31 | 19 | ఆదినె | ఆదిని |
| 35 | 11 | పుణ్యమునై | పుణ్యునై |
| | 13 | మెలు | మేలు |
| 43 | 5 | రెండుపద్యములువిడువఁబడినవి. | |
| | 17 | మాహాత్మ్మ | మహాత్మ్య |
| | 20 | కావ్య | పావ్య |
| 47 | 14 | వనంబులని | వనంబులోని |
| | 13 | ర్జికుసుమా | ర్జితకుసుమా |
| 51 | 3 | ఇటు | ఇట్లు |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 1 | నెఱుంగ | నెఱుంగ |
| | 4 | యను-చిత్రంబులు | వను చిత్రంబులు |
| | 8 | కణంబుల | కణంబులు |
| 61 | 25 | శాంత | శాంతః |
| 62 | 24 | గాగ | గాఁగ |
| 63 | 2 | భరతుం | భరతునందుం |
| | 23 | కామి | కామికి |
| 68 | 21 | తికి | గతికి |
| 69 | 20 | బుద్ది | బుద్ధి |
| 72 | 7 | గాందారి | గాంధారి |
| 73 | 11 | నొప్ప | నొప్పఁ |
| 74 | 22 | బహిపరింపరే | బరిహరింపరే |
| 75 | | ఉత్తరుని చరిత్రలో నాదిని18 | పద్యములువదలిరి |
| 78 | 23 | రక్తాంబర | రక్తాంబక |
| 79 | 22 | వెలు వెల | వెల వెల |
| | 23 | దల్ల డిల్లు | దల్లడిల్లుఁ |
| 82 | 12 | దీపుల | దీప్తుల |
| | 15 | నక్షతి | నక్షత |
| 85 | 10 | తుదిఁ | తుదఁ |
| 88 | 2 | నధీ | సధీ |
| 102 | 24 | హాతువై | హేతువై |
| 115 | 13 | ముఖంబున | ముఖంబుల |
| 119 | 21 | గ్రోద్ధిత | గ్రోథిత |
| 123 | 14 | వియనల | వియనల |
| 125 | 1 | దుట్య | ద్రుట్య |
| 130 | 14 | శేయు | శేయు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 132 | 12 | నయ్యలము | నయ్యలఘు |
| 137 | 19 | జేడ్వడి | జేట్వడి |
| 142 | 4 | గలగించు | గలఁగించు |
| 144 | 12 | నగుణ | యగుణ |
| | 23 | దండింతనంబునదడింత | దండితనంబున దండిం |
| 150 | 3 | అపన | అపద |
| | 11 | తిధి | తిథి |
| 154 | 8 | త .. | తనదు |
| 156 | 8 | బివుడు | బిపుడు |
| 165 | 10 | ఈశీనుఁడు | నీలుఁడు |
| 169 | 6 | న న | నవ |
| 170 | 21 | గర్బ | గర్భ |
| 171 | 1 | ఏడ-కడ | ఏదు+కడ |
| ·173 | 1 | పా ... | పాదాంత్యముగాఁబట్టి |
| 174 | 5 | ప్రాతిగామి | ప్రాతికామి |
| 175 | 5 | అవబృధ | అవభృథ |
| 176 | 17 | ×ఎ | + ఎ |
| ·194 | 17 | సఖ | సుఖ |
| 203 | 16 | దారలు | ధారలు |
| 204 | 24 | ఖుర | ఖుర |
| 205 | 22 | చుపట్టు | చూపట్టు |
| 207 | 1 | ప్రహనుఁడు | ప్రహస్తుఁడు |
| 208 | 2 | ఆకారx | ఆకార+ |
| | 22 | విషాదమ్ము | విషాదముచే |

